ఓమ్.

# మహాభారత చరిత్రము



పిండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి కృతము

పిఠాపురము



ఇది

రాయవరమున

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు

మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రింపఁబడి ప్రచురింపఁబడియె.

వెల రు *1—4—0*

*1928*

# గ్రంథారంభ సమర్థనము



ఒక్క-నాఁటి పురాణము చేతనె పురాణశ్రవణలోలుఁడగు "పాల కుర్తి వెంకయ్య" యను కాకినాడతాలూకా "మేడపాడు" నివాసి యగు రసికు నానందింపఁజేసి యాతనిచే జీవితాధారమునకుఁ దగిన భూవసతినొంది "అభిజన" మగు, అంబికపల్ల్యగ్రహారమును వదలి మేడపాడునే నివాసముగానొంది యచట "మహాలింగేశ్వరాలయముం గట్టి శివప్రతిష్ఠఁజేసి పౌరాణికుఁడు నన్నదాత భక్తుఁడు నను ప్రఖ్యాతినొంది పరమపదమునొందిన మా తండ్రిగారగు పెండ్యాల వెంకయ్య గారు నా పదియవయేటనె నాచే నాంధ్రమహాభారతముఁ జదివించి నన్ను మహాభారతకథాలోలునిగాఁ జేసిరి. వారు నాఁటిన బీజమె నన్నీ గ్రంథమును జేయించినది. పురాణకథన జీవకులగు మా పితృవ్యులు రామశాస్త్రిగారును, మాతులులు వింజమూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును మా తండ్రిగారు నాటినదానిని దోహదముచేసి వృద్ధినొందించిరి. మా తండ్రిగారు పురాణముఁ జెప్పునపుడె విమర్శనాంశములు కొన్ని నా హృదయక్షేత్రమునఁ బ్రవేశించినవి. శ్రీకృష్ణచరితమును ముచ్చటించునపు డాయన తారకమంత్ర జపాలోలురగుటచేఁ గాఁబోలు కృష్ణుఁడు రామునివంటి శుద్ధచారిత్రుఁడు కాఁడనుచుండిరి. సీతాపాతివ్రత్య కథానిమగ్నులగుటచేఁ గాఁబోలును కుంతీద్రౌపదులే కురువంశ నాశకురాండ్రనుచుండిరి. పిమ్మట మా మేనమామగారు "వెర చోడవరము"లోఁ బురాణముఁ జెప్పుసమయ



మునఁ దద్గ్రామవాసులగు "దండు నరసింహరాజుగా" రను వారు

కర్ణార్జునుల చరిత్రలను విమర్శించుచు నర్జునునకు గర్ణుఁడెందును సరిరాడని విమర్శించుచుండిరి. కర్ణుని గురించి యీ క్రింది పుక్కిటికథ నాకప్పుడు మా పినతండ్రిగారు చెప్పిరి.

“ధర్మజుఁడు కర్ణునివలె దానమునందును వీరుఁడు కాఁడట. కర్ణుని యుదారస్వభావమును ధర్మజునకుఁ జూపి యాతని సిగ్గుపరుప నొకనాఁడు ప్రస్తావనవశమున శ్రీకృష్ణుఁడు ధర్మజునితో బావా, నీకు మేరుపర్వతమును స్వాధీనపరచిన దాని నెంతకాలములో దానముఁ జేయఁగల వనగా ధర్మజుఁడు “ఘన” ప్రమాణముఁ దెలిసికొని కొన్ని వత్సరములలో దానిని ఛేదించి బీదలకు దానముఁ జేయవచ్చున నెనట. తత్కాలాగతుఁడై యగుఁ గర్ణునిజూచి కృష్ణుఁడు ధర్మజు నడిగినటులె యడుగఁగా గర్ణుఁడు, విశేషకాలమెందుకు, బీదవాని కొక్కనికె నిమిషములో నా పర్వతమంతయు ధారవోతుననెనట! కర్ణుని యీ యుదారస్వభావమునకు ధర్మజుఁడు సిగ్గువడెనట!” ఇట్టిదె దానకంకణ విషయకమగు నొక కథ కర్ణునివిషయమై చెప్పఁబడెను. ఇట్టి విమర్శనలు వినుచున్న నాకు సంస్కృతాంధ్రభాషలలో విజ్ఞాన మలవడిన పిమ్మటఁగొంతకాలము నేను స్వగ్రామమునఁ బౌరాణికుఁడనై యాంధ్ర మహాభారతముఁ బెక్కుసారులు పురాణముఁ జెప్పితిని. నన్నయ తిక్కనల కవితాశైలికిఁ జొక్కి పలుసారులు కొన్ని ఘట్టములఁ జదివితిని. ఇటులుండఁ గాకినాడ కలాశాలలో శ్రీ॥ సర్ దివాన్బహాద్దరు, ఆర్ వేంకటరత్నమునాయకుగారి దయవలన నాంధ్రోపాధ్యాయుఁడనైతిని. కాకినాడ చేరినపిమ్మట రాజకీయమునందే గాక గ్రంథ విమర్శనమునందును విశేషప్రజ్ఞావంతులగు శ్రీ॥ దుగ్గిరాల వేంకట సూర్యప్రకాశరావుగారితో విశేషపరిచితి కలిగినది. వా రాంగ్లభాషలో “వైద్యా” పండితుఁడు మొదలగువారు వ్రాసిన భారతవిమర్శనల నపుడపుడు వినిపించుచుండిరి. సంఘసంస్కరణవిషయములో మాకు

భిన్నాభిప్రాయముండినను, విశేషవిమర్శకులగు బ్ర॥ శ్రీ॥ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు మహాభారతగాథలలోనివిశేషాంశములు అందు పాంచాలీ పరిణయకాలమున ధర్మజుండు "మా పూర్వులు పోయిన దారిని మేము పోవుదుము" నుటయు, అనుక్రమణికాధ్యాయములోఁ "జాపలు పాండవుల పుట్టుక ననుమానించిరి" అను నంశముల నొక ప్పుడు చెప్పి యీ గ్రంథరచనలో వారి మతమునకుఁ దీసికొనువా రైరి. దేవీభాగవతములోఁ బాండవులనుగురించి భారతమునకు భిన్న ముగా రచియింపఁబడి యున్నదనియు బ్రహ్మయ్యశాస్త్రిగారె చెప్పి మహత్సహాయముఁ జేసియున్నారు. అంతకు ముందె నేను మచిలీపట్ట ణమునఁ బ్రచురింపఁబడు 'ఆంధ్రభారతి" పత్రికలో "మహాభారత యుద్ధకాలము" అను వ్యాసమును వ్రాసియుంటిని. అంతవఱకు నాకు సంస్కృతగ్రంథములఁ జూచి విమర్శనము వ్రాయు నలవాటులేదు. కాకినాడనుండి "బందరు" లోని "జాతీయకలాశాల" కుపాధ్యాయ త్వముకు మార్చుకొంటిని. ఆ కాలమున గ్రంథములఁ జదువు నవకా శము విశేషముగాఁ గలిగెను. ఇపుడు కోయంబత్తూరు వ్యవసాయ కలాశాలలోఁ బండితులుగానుండిన మ॥ రా॥ శ్రీ సుప్వారి బాల కృష్ణమూర్తిగారు (అపుడు గోదావరీమండల ప్రాంతమున కగ్రికల్చర్ అసిస్టెంటు డైరక్టరు) గోదావరిడిస్ట్రిక్టు అసోసియేషన్ ద్వారా, "శ్రుతి స్మృతి పురాణేతిహాసముల" ననుసరించి వ్యవసాయచరిత్రము నాంధ్రభాషలో వ్రాసినవారికి నూఱుమొదలు నూటయేబది రూప్య ములవఱకు బహుమతి నిత్తుమని ప్రకటనను జేయుచుటయేగాక జాతీ యకలాశాలకు వచ్చి, కీ॥ శే॥ కోపల్లె హనుమంతరావు బంతులుగారి సన్నిధిని నీవీ గ్రంథముకు వ్రాయఁగలవని వింటిని. తప్పక వ్రాయ మని రెండుసారులు ప్రోత్సహించిరి. నేను శ్రుతుల యర్థముఁ దెలిసి



తెలిసికొనలేనేమోయని మొదట సందేహించితిని. గాని యొకప్పుడు

"దుగ్గిరాల ప్రకాశరావు పంతులుగారు "గ్రిఫిత్" భాషాంతరీకరించిన "యథర్వవేదము"లోని కొన్ని యంశముల నాంధ్రీకరించి చెప్పుట చేతను బందరుటవున్ హాలు లైబ్రరీలో నాల్గువేదములు శాస్త్రగ్రంథములు (సంస్కృతభాషలోను, ఆంగ్లానువాదములు) నుండుటచేతను, నాకు శిష్యుఁడును మిత్రుఁడు నగు "మైనేపల్లి అప్పారావు" వను విద్యాప్రియునిగూడి వేదములలో వ్యవసాయమునకుఁ గల భాగములను "అనుక్రమణిక" (ఇండిక్స్) చూచి యాతఁడు చెప్పఁగా విద్యారణ్యాదిభాష్యములఁ జూచి యవసరాంశములను వ్రాసికొని యుక్తకాలమునకే వ్యవసాయచరిత్రను పంపవలసిన చోటనకంపితిని. పర్లాకిమిడి కాపురస్థులగు బ్ర॥ శ్రీ॥ పారనంది రామశాస్త్రిగారును బంపిరట! నాందానికి బ్రాశస్త్య మెక్కువగా నున్నదనియు బహుమతికది నర్హమనియు, గో॥ డి॥ అ॥ శక్రకెటీగారొక యుత్తరమును వ్రాసిరి. దువ్వూరి బాలకృష్ణమూర్తిగారును డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారింట నీకిచ్చు బహుమతి నిచ్చెద నని చెప్పిరి. నా రెండవకుమార్తె వివాహసందర్భమున వారిఁజూచుటకు గుంటూరువెళ్ళియిచ్చుపారితోషిక మిప్పుడిప్పించినఁజాలసంతోషింతు ననగా నిప్పుడుతొందరపనిలోనుంటిని వెనుకనుండి వ్రాసెదననితిరిగియింకొకసారి జ్ఞాపకపరుపగా గ్రంథప్రచురణమునకుఁ దొందరయుండినఁ ప్రచురించుకొనవచ్చునని కార్డు నొకదానిని వ్రాసి మహదుపకారముఁ జేసిరి. కాళయుక్తివత్సరమున నీయఁదగిన యాబహుమానముదారపురుషులగు వారింతవఱకీయకపోయిన నెప్పటికైన నిత్తురనియే నిరీక్షించుచున్నాను. ఆవ్యవసాయచరిత్రను "భారతి" పత్రికలో శ్రీదేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు ప్రకటించి మహదుపకారముఁజేసి యున్నారు. బాలకృష్ణమూర్తిగారు ప్రత్యక్షముగా నొకమహదుపకారముఁ



జేసినందులకు వారికిఁ గృతజ్ఞుఁడను. ఆయుపకార మేదియన నాకాళ

నొలిపి విశేషగ్రంథములను నాచేఁ జదివించుటయే, అథర్వవేదముఁ జనువునపుడు "కుంతాపసూక్తము" లో పరీక్షిత్తుయొక్క ప్రశంసయు "ఐతిరేయ" బ్రాహ్మణములో జనమేజయుని ప్రశంసయుఁ గాన్పించినవి. ఆకాలముననే "మలబారు" సిభకై మ॥ రా॥ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగా రతి పరిశోధనతోఁగూడిన మహాభారతోపన్యాసమును (డి 6—12—1921) మద్రాసులోని గోక్లేహాలులోఁ జేసియున్నారు. ఆంధ్రపత్రికలో నావ్యాసముయొక్క సంక్షిప్తభాగము ప్రచురింపఁబడెను. నే నాకాలమున జాతీయకళాశాలలో నాంధ్రభారతభాగములనె పాఠముఁ జెప్పుచుండుటచేతను జనసామాన్యమునకు విరుద్ధముగాఁ గాన్పించు శ్రీరెడ్డిగారి యుపన్యాసమును ఖండింపుచు వ్రాయుమని కొందరు విద్యార్థులు, మిత్రులు, నన్నుఁ బ్రోత్సహించిరి. మొదట నిష్టపడితినిగాని రెండుమూడుసారు లాయుపన్యాసాంశములఁ జదువఁగా వారుచెప్పిన యంశములు విరుద్ధముగాఁ గాన్పింపలేదు. అందుచే ఖండనము వ్రాయలేదు. అపుడె "దుర్యోధనుఁడు—భారవికవి" యను నొకవ్యాసమును కృష్ణాపత్రికకు సుయోధన పాత్రౌచిత్యముఁగూర్చి వ్రాసితిని. మహాభారతకాల భరతఖండపటమును లిఖించి విద్యార్థులకుఁ బాఠముచెప్పితిని. ఆపటమును వ్రాయుటలో నచటి చిత్రలేఖకోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ ఈరంకి వేంకటశాస్త్రిగారు చాల సహాయముఁ జేసిరి. పిమ్మట జాతీయకళాశాలా వ్యవహారము నాకు సరిపడకనేమి తద్గ్రామజలము నాకు పడకనేమి బందరువదలి మ॥ రా॥ శ్రీ దివాన్ బహద్దరు నురిశేటి శేషగిరిరావుపంతులుగారి యనుగ్రహమువలన "రాజోలు" హైస్కూలున సంస్కృతోపాధ్యాయుఁడ నైతిని. అచటనుండినపుడు నాకు ద్వితీయ కళత్రవియోగమైనది. ఆవిచారము నపనయింపు నుపాయము సదా గ్రంథావలోకనమె యనితలఁచి రాత్రి నాల్గుగంటలుమాత్రమె నిద్రకై

యేస్పరది సద్గ్రంథపఠనమునకె కాలమును వినియోగించువాఁడను. నన్ను "నాంధ్రసాహిత్యపరిషత్తు" న 1914 సంవత్సరమునుండియు గౌరవసభ్యునిగాఁ జేస్చుకొనిరి. కాని 1922 సంవత్సరమునఁ బిఠాపురమునఁ జరిగిన పరిషదుత్సవమునమాత్రము "రామాయణ" చరిత్రతో సంబంధించిన వ్యాసముఁ జదువుటకుఁ బదునేను నిమిషముల కాలవ్యవధియని మైదాఱునిమిషములలోనె ముగింపుకావలెనని తొందర పెట్టిరి.

మ॥ రా॥ శ్రీ శ్రీ రాజా విక్రమదేవవర్మగారి యాధిపత్యమున "తుని" లో డి 13—10—23 సంవత్సరము తేదీని జరిగిన యాంధ్రసాహిత్యపరిషద్యుత్సవసమయమున "మహాభారత చరిత్ర" యను వ్యాసముఁ జదువుటకు నాకు సంపూర్ణావకాశమునిచ్చిరి. 1¼ గంట కాలము వ్యాసమునంతయుఁ జదివితిని. జనసామాన్యాభిప్రాయ విరుద్ధములుగానుండిన నా వ్యాసాంశములు సభికులను "క్రోధాశ్చర్య" నిమగ్నులఁజేసినవి. దానికి వెంటనె ప్రత్యేకసభంజేసి ఖండనముఁ జేయుబూనఁ గొందరు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారిం బ్రోత్సహింపగా వారు నావ్యాసాంశములు గ్రంథనిదర్శనసహితముగా నున్నవి గాన ఖండింప వీలులేదనిరని యా ప్రోత్సాహకుల నడుమనుండినవారును నామిత్రులు నగు పండితారాధ్యుల సూర్యనారాయణకవిగారు పిమ్మట నాతోఁ జెప్పియున్నారు. అప్పటి డి॥ బో॥ ప్రసిడెంటు రావుసాహేబు మాదిరెడ్డి వేంకటరత్నమునాయుడుగారి పక్షపాతము నాపైనుండుటచే నేను బోర్డులోని యుద్యోగమునకు సెలవుపెట్టి చిరకాలాశ్రయమగు పిఠాపురసంస్థానమున మ॥ రా॥ శ్రీ దివానుగారు కోకా సుబ్బారావునాయుడుగారియొక్కయు శ్రీ పిఠాపురము మహారాజావారియొక్కయు ననుగ్రహమున బిఠాపురములోని హైస్కూలున నాంధ్రోపాధ్యాయుఁడనుగాఁ బ్రవేశించితిని. ఒకనాడు ప్రస్తావన

వశమున శ్రీ డిబానుగారితో శారతవిశేషములను ముచ్చటింపుచుండగా తునివ్యాసము నంతయు వినగోరెదనని "రుధిరోద్గారిసంవత్సర ఆశ్వయుజపుష్యమాసపు సాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురింపఁబడిన యావ్యాసము నంతయు విని దీనిని విపులముగాఁ బెంచి వ్రాసిన బాగుండునని ప్రోత్సహించిరి. వారిప్రోత్సాహముచేతనె యీగ్రంథమును వ్రాసితిని. ఈ గ్రంథైకదేశమగు "మహాభారతరచనావిధానము" అనుదానిలోని ముఖ్యాంశములను, రక్తాక్షిసంవత్సరవైశాఖశుద్ధపూర్ణిమకు "అన్నవరములో" శ్రీ సత్యనారాయణస్వామివారి కల్యాణమహోత్సవకాలమున బ్రహ్మశ్రీ ప్రసిద్ధికెక్కిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి యాధిపత్యమున నగు పండితసభలో నుపన్యసింపగా శ్రీశాస్త్రిగారు కొన్నిట నభిప్రాయభేద మున్నదిగాని విమర్శనాంశము లీవ్యాసమునఁ బొందుపడియున్నవనిరి. ఆవ్యాసములోని "వింటర్నిడ్జు" గారి యభిప్రాయములు "విశ్వభారతిఁ" జదివి మన్మిత్రులు శ్రీ పెద్దాడ సత్తిరాజుగారు వినిపించిరి. ఆవ్యాసమునె పిఠాపురము వచ్చినపుడు బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి గారికి వినిపించితిని. ఇదునుగురించి నేనొకసారి వ్రాయనుద్దేశించితిని గాని కార్యవ్యవధికలుగనందున వ్రాయలేదనియు నాయభిప్రాయము లించు చాల కలవనియు స్వల్పములో మాత్ర మభిప్రాయభేదము కలదనియు వారు సెలవిచ్చిరి. మహాభారతరచనావిధానమును వ్రాయుటకొకప్పుడు మ॥ రా॥ శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు "ఆంధ్రభారతి" లో వ్రాసిన యొక చిన్నదగు వ్యాసము బీజమైనది. నాకుఁ జిరకాలమిత్రులు—మిత్రులెకాదు, సోదర నిర్విశేషులును రెడ్డిరాణీ పత్రికాధిపతులు నగు మ॥ రా॥ శ్రీ మల్లిడి సత్తిరెడ్డి గారు నేనురచియించు "మహాభారతచరిత్రము" ను ముద్రింపింతుమను

మహాబానందవార్తను నాకు వ్రాసిరి. వారిసహాయము లేకుండిన నాప్రయత్నము వ్యర్థమైయగును. గ్రంథమును వ్రాయ నారంభించి యొకటిరెండు "ఫారములు" ప్రస్సున కిచ్చితినో లేదో, అంతలోనె వ్యాధిగ్రస్తుఁడనై తొమ్మిదిమాసములు మంచముపట్టి "చావుతప్పి కన్ను లొట్టపోయినది" అనుసామెతకు నేనె నిదర్శనమై కుడికన్నుఁ బోగొట్టుకొని మెటులనో జీవించితిని. రోగగ్రస్తుఁడనై యుండినపుడును కొన్ని యంశములఁ జెప్పి "పొక్కులూరి లక్ష్మణమూర్తి" యను మిత్రపుత్రునిచే వ్రాయించుచు నూటనాలుగు పేజీల గ్రంథము ముద్రణమున కీయఁగలిగితిని. అంత మిగుల నవసుఁడనై మిత్రులచే జీవితాశ లేదనిపించుకొంటిని గాని బ్ర॥ శ్రీ॥ శ్రీమాన్ సముద్రాల భాష్యకారాచార్యులవారి యనర్వచనీయ కరుణాకటాక్షముతోఁ గూడిన యమృతహస్తము నాపై సోకుటచేతనే యిప్పటికిటులు మనఁ గలిగితిని. నేను మంచముపట్టి సంశయపుజీవనుడనైన సమయము నా జీవితములోకెల్లఁ బరమనీచకాలము. అపుడు కుమార్తె ప్రసవ సమయము, నన్నుఁ జూడవచ్చు చుట్టములరాయిడి, దారిద్రము, అంతవఱకు నింటనుండిన యల్లుఁడలిగి పలాయితుఁడగుట, తలపోటుచే రాత్రులు నిద్రలేకపోవుట, నా యింటికి సమీపమున దేవయాన నాటకమును నేర్చుకొను శూద్రులు ప్రతిదినము రెండుమాసములు రాత్రి యొంటిగంటవఱకు మద్దిలతాళములతోఁ జెవులు బ్రద్దలగు నటులు ధ్వనిని జేయుట, అప్పులవాండ్రు తమ సొమ్ముఁ దెమ్మనుట మొదలగు నీతిబాధల సంకలితములైనవి. నేను రోగగ్రస్తుఁడనై యుండినపుడు పైయధికారివలెగాక బంధువువలె శ్రీ కోకా సుబ్బారావునాయుడుగారు నన్నుఁ బెక్కుసారులు చూడవచ్చి క్షేమమారసి యనేక విధములగు సహాయముఁ జేయుచు ధైర్యముఁ జెప్పుచుండు

వారు, భాష్యకారాచార్యులుగారు చేసిన యుపకృతి జన్మాంతము వఱకు మఱువరానిదేను. శ్రీ సత్తిరెడ్డిగారును, రెండుమూఁడు నాళులు "రామవరము" నుండి పిఠాపురము వచ్చి క్షేమమరసి పోవుచుండువారు, నా దరిద్రస్థితినిఁ దెలిసి శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు "అకాలవర్షము" కురిసినట్లుఁ దలఁపనితలంపుగా నూఱురూపాయిలు మనియార్డరుచేసి దరిద్రవిచ్ఛిత్తిఁ జేసిరి. కంటివైద్యమునకు మద్రాసు పోవలయు నని శ్రీ కోకా సుబ్బారావునాయుడుగారె సహాయసంపత్తితోఁ బ్రోత్సాహము కలిగించిరి. వారి ప్రోత్సాహపరచి పంపనిచో నేను సంపూర్ణాంధుఁడనై యుండుదును. శ్రీ దివాన్బహద్దరు మరిశేటి శేషగిరిరావుపంతులుగారు, దుగ్గిరాల ప్రకాశరావుపంతులుగారు కూడ నన్ను చెన్నపురికంపను సహాయముఁ జేసిరి. నాకు చెన్నపురిక్రొత్త నా కచట మిత్రులుగానుండిన కొత్తపల్లి సూర్యారావుగారు కాకినాడకుఁ గాపురము వచ్చిరి. కాని చూచిన వేళావిశేషముచే మ॥ రా॥ శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పరమమిత్రులై యవ్యాజకరుణను నాపైనుంచి పదియడుగులైన నడువలేని నన్ను "సెంట్రల్ స్టేషను" నకు వచ్చి తమ యింటికిఁ గొంపోయి డాక్టరు బి. సుబ్బారావుగారిచే నా కంటినిఁ బరీక్షచేయించి యశ్రమముగా నన్నుఁ గన్నాసుపత్రిలోఁ జేర్పించిరి. చేర్పించుటయెకాదు, దినమువిడచి దినమైనం దప్పక నన్నుఁ జూడఁ గొన్నిమైళ్లు నడచివచ్చి రోగగ్రస్తుఁడను గాన జిహ్వాచాపల్యముచే నవయుచున్న నాకుఁ గావలసిన భోజనపదార్థములఁ గూడ తెచ్చి యిచ్చుచుండిరి. వారు చేసిన యుపకృతికిఁ బ్రత్యుపకృతి గలదా?



అరవగోలెకాని పరిశుభ్రమగు తెనుఁగుమాట వినపడని యా యాసు

పత్రిలో సోమశేఖరశర్మగారి దర్శనము నాకు నిత్యదర్శనముగా నుండెడిది. వారితో నచట మహాభారతచారిత్రక సంభాషణములె జరుగుచుండెడివి. "జయస్వాలు, ఫ్లీటు" మొదలగువారు వ్రాసిన యంశములను వారు విని చెప్పెడివారు. దేశోద్ధారక శ్రీ నాగేశ్వర రావుపంతులుగారు, సర్. దివాన్‌బహద్దరు ఆర్. వేంకటరత్నము నాయుడుగారు, దుగ్గిరాల ప్రకాశరావు పంతులుగారు, సత్తిరెడ్డి గారు నాకు మద్రాసునందైన ఖర్చులను భరించి యనిర్వచనీయోప కృతిం జేసిరి. నేను భారతమును దలక్రిందుగ విమర్శించుటచేతనె నాకన్ను పోయినదను ప్రథ మా పిఠాపురములో వ్యాపించినది. ఎట్లయైన నేమి, "మేజర్, రైటు" దొరగారి యాజకులతోఁ గుడికన్ను పోయినను మొకమకంటితోనైన జీవింపఁగలిగితిని. తిరిగి పిఠాపురము వచ్చి "కృష్ణద్వైపాయనుఁడు, శ్రీకృష్ణుఁడు" అను భాగములను వ్రాయునప్పటికి మరల రోగగ్రస్తుఁడనై చెన్నపురి రెండుసారులేగి కంటివైద్యముఁ జేయించుకొనవలసినవాఁడనైతిని. ఈ రెండుసారులును, నాకు శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు, సర్, వేంకటరత్నము నాయుడుగారలే ద్రవ్యసహాయముఁ జేసి కాపాడిరి. సోమశేఖరశర్మ గారి సహాయమెప్పుడును నాకు కలుగుచుండునదియేను. రెండు మూఁడు సారులు మద్రాసు వెళ్ళినపుడు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభా కరశాస్త్రిగారి యమూల్యపరిచితి కలిగినది. ప్రతిసారియు మ॥ రా॥ శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి యాలోచనా సహాయము లేకుండగ నేను వైద్యముఁ జేయించుకొనలేదు. వారొకప్పుడు నా భారతచరిత్రమును దిలకించి యెట్లయినను నీచరిత్రను బూర్తిచేయు



వలయునని మిగుల ప్రోత్సహించిరి. కన్నాసుపత్రిలో నాకుఁబరిచితు

లైన శ్రీ డాక్టరు పి. నారాయణస్వామినాయుడు, డి. నరసింహ
రాజుగారు ననువారు నా భారతచరితమును విరమఁ దక్కినడాక్టర్లకో
వింతగ నా కథలఁ జెప్పుచు నా కపట నితరరోగులకంటె విశేషోప
చారములఁ జేయించిరి. కడపటిసారి కుడికంటిని దీయించుకొను నవ
సరము కలిగినపుడు మహాత్సంశయగ్రస్తుఁడనై యుండఁగా నవ్యాజ
కరుణాసమేతులై సర్. దివాన్‌బహద్దరు వేంకటరత్నమునాయుడు
గారు, డాక్టరు "కొమన్నాయరుగారి" తో నా విషయమై స్వల్పము
ముగాఁ జెప్పి నాభయమును వాపిరి. నేను రోగినిగానుండిన సమయ
మునసే నేను తునిలోఁ జదివిన వ్యాసమునకు ఖండనమును వ్రాసి
బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి సోమయాజిగారు, ఆం॥ సా॥
పరిషత్పత్రికలో "మహాభారతకథాతత్త్వనిర్ణయము" అను వ్యాసమును
వ్రాసిరి. దానికిఁ బ్రత్యుత్తరమును వ్రాయుటకు, పరిషత్పత్రికలో "భారత
మీమాంస" యను నింపగు పరిశోధకవ్యాసము విరళముగా "చర్ల
నారాయణశాస్త్రిగారు" వ్రాయుచుండుటచేఁ దావులేకుండెను. భారతీ
పత్రికవారు నా ప్రత్యుత్తరము పరిషత్పత్రికలోఁ బ్రచురించుట మంచి
దనిరి. తక్కిన మాసపత్రికలు విపులవ్యాసములఁ బ్రకటింపనోపవు.
అందువలన దానికిఁ బ్రత్యుత్తరము వ్రాయుటకంటె "మహాభారత
చరిత్ర" ను బూర్తిచేసినం దానిచేతనె ప్రత్యుత్తరముకూడ సిద్ధించు
నని యాయుద్యమమునుండి విరమించితిని. చర్ల నారాయణశాస్త్రి
గారి వ్యాసమె సోమయాజిగారి ఖండనమునకుఁ జాలవఱకుఁ బ్రత్యుత్త
రముగా నుండునని తలఁతును. తక్కినది యీపుస్తకముచేఁ జరితార్థ
మగునని తలఁతును. ఈయేఁడు "బళ్లారి" లోఁ జరిగిన పరిష



దుత్సవకాలమున "అనంతపుర" కలాశాలాంధ్రోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు "భారతవిశేషములు" అను పరిశోధనవ్యాసముఁ జదివిరి. అది సర్వవిధముల నా గ్రంథములోని "రచనావిధానము" ను భాగమునకు మాతృకయో పుత్రికయో యనఁ జెల్లును. కాని శ్రీ శాస్త్రిగారు పరిషత్పత్రికలోని నా వ్యాసముఁ జూడకపోవుటచే నట్లు వ్రాసితిననిరి. "నేననంతపురమున కేగినపు డచ్చటి కలాశాలలో మహాభారతచరిత్రముఁగూర్చి యొక యుపన్యాసముఁ గూడఁ జేయించిరి. "శతపథబ్రాహ్మణము" నేటి కాఱుమాసములకు ముందు నేను చూచియుండలేదు. దానిలోని విశేషములు మహాభారతమును గురించినవి కలవని విని మన్మిత్రులగు శ్రీ పుగ్గిరాల ప్రకాశరావుపంతులుగారికి వ్రాయఁగా వారు నాకై విశేషపరిశ్రమఁ జేసి "జూలియస్, యుగ్గ్లింగు" దొరగారి యాంగ్లీకరణములోని విశేషములను 8 పుటల యుత్తరముగా వ్రాసి పంపి మహోపకారముఁ జేసిరి. ఇంతలో శతపథబ్రాహ్మణమునుగూడ నొక మిత్రుఁడిచ్చుటచే మూలముఁగూడఁ జూచితినిగదా యని మిగుల నానందించితిని. శ్రీ కో. సుబ్బారావునాయుడుగారు పదేపదే నీవు వ్రాసెడి చరిత్ర మెంతయైనదనినన్నుఁ బ్రోత్సాహపరచుచు, కన్ను జాగ్రత్తపరచుకొనియే గ్రంథమును వ్రాయుమాయని దయతోఁ జెప్పుచుండెడివారు. అందఱికంటె నామాంద్యమునుసహించి నేనిచ్చిన గ్రంథాంశమును ముద్రింపించుచు పదేపదే యుత్తరములద్వారా నాకుఁ బ్రోత్సాహముఁ గలిగించెడి శ్రీ సత్తిరెడ్డిగారే గ్రంథరచనకు ముఖ్యకారకులని ముమ్మాటికిఁ జెప్పవలసియున్నది. అందుండిన దేశపటము శ్రీ సుసర్ల సూర్యప్రకాశముగారు వేసి నాకు సర్వవిధముల సహాయముఁ జేసిన పైని నుడువఁబడిన వారికి సదా కృతజ్ఞుఁడను. తల

క్రమముగాఁ గాన్పించు నా యీగ్రంథముచే మహాభారతముఁ జనప్రతతి కసహ్యము కలుగునని పెక్కండ్రు నన్ను నిరుత్సాహ పరచినవారును గలరు. కాని నాదృఢాభిప్రాయ మేమన నేనువ్రాసిన వ్రాతలలోని సత్యము గ్రహించుటకుఁ బెక్కండ్రు పదేపదే మహాభారతపఠనముఁ జేతురనియు దానివలన నేదేని యాముష్మికముండిన నది నాకుఁగూడ కొంత లభించుననియే నాతలంపు. సోమయాజులుగా రింతటివారు నావ్యాసమును ఖండించుటకై భారతముఁ జదివితినని వ్రాసిరిగదా? ఆపఠనములోని శతాంశమైన నాకుఁగలుగదా? ఏగ్రంథాంశమైన ఖండింపఁబడినదానిని "మండనముఁ" జేయఁ బెక్కురా గ్రంథముఁ జదువుదురనియు దానివలన నాగ్రంథముపై నభిమానము హెచ్చఁగ నుండుననియు ద్వైతాద్వైతాది మతగ్రంథములిటులే వ్యాప్తినొందిన వనియు నాతాత్పర్యము. ఇందువలన మహాభారతపఠనము హెచ్చగు నని తలఁతును.

## భాష

భాష మహాచారకల్పము. భాషాస్ఖాలిత్యము మహాచారస్ఖాలిత్య సదృశము. పూర్వాచారపరులకు నస్ఖలితమగు మడితోనె సత్కర్మలఁజేయు తలఁపుకలిగియుండును. శాస్త్రమర్యాదఁ దెలియకగాని తెలిసినదాని నాచరించుటలో దేశకాలపరిస్థితు లనుకూలింపనపుడు గాని చూడకగాని యనాచారయుక్తుఁడైనచో వాని నెల్లపు డనాచారముగా మసలువాఁడు నీవు స్ఖలితుఁడవైతివని గేలిసేయుట యుక్తము కాదు. నేనింటికడ నుండినపుడు స్నానసంధ్యలనాచరించి మడితోడనె భుజించుచుందును. కాని రోగగ్రస్తుఁడనై కంటికిఁ శస్త్రముఁ జేయించుకొని నపుడు తద్వ్యతిరిక్తముగాఁ జేయక తప్పినదికాదు. అటులనే కన్నులేక

యితరులచే వ్రాయించుకాలమునను వ్రాసినదానిఁ బరిశీలించు నోపిక లేకను పెక్కుభాషాస్ఖాలిత్యములిందుఁ బ్రవేశించినవి. నాతాత్పర్యము మాత్రము సలక్షణమగు భాషతోడను వ్రాయవలయుననియే, దీనిని రెండవసారి ముద్రింపించునవస్థ కలిగినచో (పాండవ వయోనిర్ణయాది) కథాస్ఖాలిత్యములతోఁబాటు భాషాస్ఖాలిత్యములఁగూడ దిద్దఁ బ్రయత్నింతును. ఈగ్రంథముఁ జదువువారు తొలిసారి చదివినంతమాత్రమున నాపైనలుగక విమర్శించినచో వారికిఁ గృతజ్ఞుడ నగుదును.

సుజన విధేయుఁడు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

పిఠాపురము

ది 28—2—28



# విషయానుక్రమ సూచిక



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 3 | క్లుప్త | క్లృప్త |
| 4 | 4 | వరకు | వఱకు |
| | 9 | గురించి | గుఱించి |
| 6 | 6 | పదునారు | పదునాఱు |
| | 19 | శనైశ్చరులు | శనైశ్చరుఁడు |
| | 11 | అయిదారు | అయిదాఱు |
| 8 | 3 | ఉల్లేఖితమగు | ఉల్లిఖితమగు |
| 10 | 16 | పాద్యమని | పాద్యమియని |
| 14 | 1 | నిర్న యించిన | నిర్ణయించిన |
| 15 | 5 | నూరేండ్లు | నూఱేండ్లు |
| | 16 | ఇరువది | యిరువది |
| 18 | 25 | పర్వం | పర్వము |
| | | అధ్యాయం | అధ్యాయము |
| 19 | 8 | పండితుఁడును | పండితుఁడు |
| 21 | 16 | యరువది | యఱువది |
| | 25 | శైశునాభాశ్చ | శైశునాగాశ్చ |
| 28 | 10 | ఎనిమిదివేల ఎనిమిది | ఎనిమిదివేల యెనిమిది |
| | 18 | అర్ధశతా | అర్ధశత |
| 31 | 20 | తెలిసికొనుట | దెలిసికొనుట |
| 38 | 20 | త్రినగ్ని | త్రీనగ్ని |
| 44 | 7 | వంశావతారణ | వంశావతరణ |
| | 17 | నేర్పుఱచె | నేర్పఱచె |
| | 23 | జఱుగు | జరుగు |
| 45 | 10 | సూర్యుః | సూర్యః |
| 47 | 16 | ఎదుఱఁబడి | ఎదురఁబడి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 47 | 21 | బాతి | బాలి |
| 48 | 13 | కొందరు | కొందఱు |
| 49 | 22 | తాత్పర్వం | తాత్పర్యము |
| 51 | 3 | పేర్కొనఁబడిన | పేర్కొనఁబడిన |
| | 9 | యోధులనుగా | యోధులుగా |
| | 18 | వ్రాసియుందుతేమో | వ్రాసియుందురేమో |
| 52 | 6 | పేఱు | పేరు |
| 54 | 20 | జొఱనిచ్చుట | జొరనిచ్చుట |
| 55 | 12 | మారకుండ | మాఱకుండ |
| 56 | 9 | గోత్రిక | గోటిక |
| 61 | 3 | సంతానముగోఱు | సంతానముగోరు |
| | 4 | సంతతిఁగనుమా? | సంతతిఁగనుము |
| 64 | 5 | శకటాసుకుని | నాతఁడు శకటాసురుని |
| 66 | 13 | సంబాధీకులను | సంబంధులు |
| 74 | ,, | పెఱుగగలదని | పెరుగగలదని |
| 76 | ,, | కేఁగు | కేగు |
| 78 | 3 | యుండేయే | యుండే |
| 79 | 3 | జెవత్తైన | జెవరైన |
| | 16 | పరులై | పరులపై |
| 83 | 19 | చకుని | చక్కని |
| 88 | 4 | బఱుగిడి | బరుగిడి |
| 90 | 8 | అజ్యేష్ట | అజ్యేష్ఠ |
| | 18 | భాండవుల | పాండవుల |
| | 24 | మోవసత | షోవసత |
| 96 | 22 | సంచిక | పంచిక |
| 99 | 1 | కపటిమే? | కపటిరమే |
| 101 | 6 | షాఱకుటకు | షారకుటకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 102 | 2 | కోటికె | కోరిక |
| 103 | 16 | బోతెను | బోరెను |
| 104 | 17 | క్షేత్రముం | క్షేత్రముగాం |
| 105 | 15 | తరుచు | తఱుచు |
| 111 | 17 | తివృషుకు | త్రివృషుకు |
| 115 | 17 | గృహాదారణ్యా | బృహదారణ్యా |
| 116 | 6 | సోమశుప్మాయణుండను | సోమశుష్మాయణుండను |
| 121 | 11 | ఇందరు | ఇందఱు |
| 122 | 21 | అరై్వవ | అదై్యవ |
| | 23 | శ్మ్రశూణి | శ్మశ్రూణి |
| 124 | 4 | ప్రాధానత | ప్రధానత |
| 128 | 8 | నోర్చుచుండెను | నోదార్చుచుండెను |
| 134 | 5 | తీసికొనిపోయిన | దీసికొనిపోయిన |
| 148 | 10 | కొన్పించునుగదా? | కొన్పించునుగదా! |
| 158 | 14 | జీవితా | జీవిత |
| 159 | 1 | లేదా? | లేదా! |
| 166 | 20 | అగ్నువిభక్తుఁడు | అగ్నునభక్తుఁడు |
| 171 | 9 | త్రాఁగుబోతేను | త్రాగుబోతే |
| | 14 | వాడు | వాఁడు |
| 172 | 2 | మొసగెనె | మొసఁగెను |
| | 3 | లేకనె | లేకయే |
| 173 | 11 | సంఖ్యాధిక్యత | సంఖ్యాధికత |
| | 13 | దృఢపరచు | దృఢపఱచు |
| 174 | 1 | యశ్వద్ధామచే | యశ్వత్థామచే |
| 176 | 5 | సంధీ | సంధి |
| | 10 | సత్రీస్థుఁడగు | సత్రీస్థుఁడను |
| 178 | 15 | సంబంధీకుఁడో | సంబంధియో |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 182 | 2 | సేయ లేకుండిన | చేయ లేకుండిన |
| | 4 | బిత్రు | బిత్రు |
| | 8 | సోఘానముగా | సోపానముగాఁ |
| 183 | 17 | నేత్రాదృశులగుఁ | నేతాదృశులగుఁ |
| 186 | 9 | తపస్సు | దపస్సు |
| | 15 | శరించి | చరించి |
| | 18 | విమర్శ చేసి | విమర్శన చేసి |
| 189 | 4 | శ్రీ | శ్రీ |
| 193 | 9 | శైలూషుండు | శైలూషుండ |
| 194 | 3 | నేఁటికిన్ని | నేఁటి |
| 196 | 8 | పార్థియసుట | పార్థియనులు |
| | 16 | యగ్గిహింగు | యగ్గిహింగు |
| | 18 | నాంగీకరించిన | నాంగ్లీకరించిన |
| 202 | 15 | ఒకటె | ఒకతె |
| | 18 | జిలితై | జితులై |
| 206 | 15 | లాగికొని | లాగుకొని |
| | 23 | మాకండం | మాకందీం |
| 207 | 6 | వటిచే | వంటిచే |
| 209 | 10 | బాల్యమైన బాల్యమైన | బాల్యమైన నబాల్యమైన |
| 224 | 11 | గాని | కాని |
| 225 | | సుఖమును | సుఖమును |
| | 15 | తలఁటురు | తలఁతును |
| 227 | 15 | బ్రష్టుఁడయ్యె | భ్రష్టుఁడయ్యె |
| 232 | 23 | పక్షపాని | పక్షపాతుఁడు |
| 236 | 8 | అంబస్థుఁడు | అంబష్ఠుఁడు |

తప్పొప్పుల పట్టికలో నొకసారి దిద్దినతప్పు మతి యున్న సారులు పుస్తకమువఁ గాన్పించినను [illegible] ప్రార్థితులు.

# పీ ఠి క

భారత భాగవత హరివంశ విష్ణుపురాణాద్యనేక గ్రంథపరిశీలన చేసి బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు తాము కనిపట్టిన క్రొత్తవిషయములను ఈ మహాభారత చరిత్రములో పొందు పఱిచియున్నారు. వీరు కడు శ్రద్ధతోను సూక్ష్మబుద్ధితోడను ఈకార్య మును నిర్వహించిరి. పాండవులు భారతీయులు గాక త్రివిష్టపదేశీయు లనియు, కౌరవరాజ్యాస్థులు కారనియు ద్రౌపది పంచభర్తృక కాదనియు ద్రౌపదీవస్త్రాపహరణగాథ యసత్యమనియు శ్రీకృష్ణుడు లోకోత్తరవ్యక్తి యనియు పూతన శకటాసురాదులు వ్యాధిగ్రహాదు లనియు దుర్యోధనాదులు ఉత్తమకౌరవులనియు ధర్మరాజు రాజనీతి పారంగతుఁ డనియును, ఈ పుస్తకమున సహేతుకముగ నిరూపింపఁ బడెను. ఇంకను ఎన్నియో విశేషాంశములు ఇందు కానవగును.

శ్రీ శాస్త్రిగారి క్రొత్తసిద్ధాంతములు పరీక్షార్హము లగును. విజ్ఞులు ఈపనికిఁ దొడంగుదురుగాక. బహు గ్రంథ పరిశీలనా ఫల మగుటచే ఈపుస్తకము జిజ్ఞాసువులకు ఆదరణీయ మగును.

ఇట్లు

విద్వాన్ గరిమెళ్ల సోమన్న

ఎం, ఏ. ఎల్, టి.



శ్రీరస్తు

# మహాభారత చరిత్రము



భారతీయవాఙ్మయమునందు స్మరణ దర్శన లేఖన పఠన పారాయణములచేఁ బురుషార్థము నర్థులకొసఁగునది మహాభారతమని యార్యులు నుడువుదురు. రామాయణ మహాభారతగాథ "ఆసేతుహిమాచలపర్యంతము" పెక్కువిధములఁ బాలగోపాలము గానముచేయఁదగిన సర్వజనసంపత్తికలవైయున్నవి. పాశ్చాత్యులుకూడ రామాయణ మహాభారతములఁ దమతమ భాషలలోని కనువదించుకొనుటయు మహాభారతము ననాగరకులుగాఁదలఁపఁబడు "మలయద్వీపగణవాసులు" కూడఁ దమ భాషలలో నొకటియగు "కవి" భాషలోని కనువదించుకొనుటయుఁ జూడ రామాయణమహాభారతముల ప్రాశస్త్యము జగద్విదితమని స్పష్టమగుచున్నది.

రామాయణమహాభారతగాథలు వీరులయొక్కయు మహాత్ముల యొక్కయుఁ బతివ్రతలయొక్కయుఁ జరిత్రలతోఁ గూర్పఁబడుటచేతను, నాయికానాయకుల చరిత్రములు దేవమహిమలతోను, సత్యముకొఱకుఁ గష్టపరంపరలనొంది తుదకు మహాయుద్ధములలో జయమునొందుటచేతను, నానాజాతులవారికి నింపగు "సతీవృత్తములు" కలవై యున్నవి.

భారతరామాయణములను రచించిన కవులు కూడ నద్వితీయ ప్రతిభాశాలురు. ఒకఁడు వేదవిభాగకర్త. మఱియొకఁడు కవికులగురువు. రామా [illegible] మాత్రము

పరిగణింపఁ బడక, "పంచమవేదము" గాఁ బరిగణింపఁబడినది. కేవల వేదమాత్రమె కాదు! ధర్మశాస్త్రము అర్థశాస్త్రము మోక్షశాస్త్రము గాఁ గూడ తలఁపఁబడినది. చూడుఁడు.

(1) అమితబుద్ధిగల వ్యాసునిచే నిది పుణ్యమైన ధర్మశాస్త్రముగాను, ఉత్కృష్టమగు, నర్థశాస్త్రముగాను, పవిత్రమైన మోక్షశాస్త్రముగాను నిపుడు చెప్పఁబడుచున్నది. అట్లే ముందు రాఁబోవువారు వినఁగలరు—

రామాయణమును రచించి వాల్మీకి చింతింపలేదు కాని భారతమును రచించి వ్యాసుఁడు విచారించెననియుఁ దచ్చింతా శాంతికొఱకు, నారదోపదేశముచే, భాగవతమును రచించెననియు, శ్రీమద్భాగవతముయొక్క ప్రథమస్కంధమునం గలదు. భారతమును రచించి చింతించుటకుఁ గారణ మేమైయుండును? మఱియు శిష్టులు రామాయణము నంతయుఁ బారాయణము చేయుచుండినటుల మహాభారతము నంతయుఁ బారాయణముఁ జేయుక భగవద్గీతను మాత్రము పారాయణముఁ జేయుచుందురు. కారణ మేమైయుండును?

రామాయణ మహాభారతములు పాశ్చాత్యవిద్యాపద్ధతి ననుసరించి బహిరంగ పరీక్షకు లోనగుచున్నవి. అంతరంగ పరీక్షకంటె బహిరంగపరీక్ష జనసామాన్యదృష్టి నాకర్షించి, విశేషవివాదములకుఁ గారణమగును. (బహిరంగపరీక్ష యనఁగా గాథజరిగిన కాలము, కవికాలము, గాథావిశేషములు మొదలగువాని విమర్శనము. అంతరంగ పరీక్ష యనఁగా శబ్దార్థాది విమర్శనా విశేషములు) కాని యీవివాద

(1) శ్లో. ధర్మశాస్త్ర మిదం పుణ్య మర్థశాస్త్ర మిదం పరం
మోక్షశాస్త్ర మిదం పుణ్యం వ్యాసేనా మితబుద్ధినా
సంప్రత్యాచక్షతేచేదం తథా శ్రోష్యంతిచాపరే.
మహాభారతము ఆదిపర్వము 53 అధ్యాయము

ములవలన గ్రంథావలోకనము విశేషముగఁ గలుగుట యను ఫలము కలుగును గాన నా శక్తికొలఁది మహాభారతమును బహిరంగపరీక్షచే క్లుప్తముగ విమర్శించుచున్నాఁడను. గాథావిమర్శనమునకు ముందు మహాభారతగాథ జరిగిన కాలమెపుడు? మహాభారతగ్రంథ మెపుడు రచింపఁబడెను? అను సంశయములను గొంత విమర్శించెదను.

## —:మహాభారత యుద్ధకాలము:—

మహాభారతగాథ సూత్రకాలమున జరిగెనని చారిత్రకు లూహించుచున్నారు. సూత్రకాలముయొక్క తుదిని రచింపఁ బడెనని తలఁపఁబడు "అథర్వ" సంహితలోఁ బాండవవంశవర్ధనుఁడును నర్జునుని పౌత్రుఁ డగు పరీక్షితుని ప్రశంస కలదు. పరీక్షిత్తనయుఁ డగు జనమేజయుఁ డశ్వమేధయాగకర్తలలో ముఖ్యుఁడని, మైత్రేయ బ్రాహ్మణమునఁ గలదు. జనమేజయునియందు నాఁటివారికి విశేషగౌరవ ముండెడిది. అందువలన నాతఁడు మృతినొందినతరువాత నాతఁడేలోకమున నుండెనని ప్రశ్నల నడుగుచుండినటుల "బృహదారణ్యకోపనిషత్" (౫—౩—౧) లో గలదు. కాని పాండవధార్తరాష్ట్రుల పేరులు గాని వారి చరిత్ర కాని, వైదికవాఙ్మయమునఁ గాన్పింపవు. సూత్రకారులగు "శాకటాయన పాణిన్యాచార్యులు" మాత్రము భారతయుద్ధ వీరుల పేరుల నుచ్చరించుటయే కాక వాసుదేవార్జునుల యందునాఁటివారు భక్తితత్పరులై యుండిరని కూడ తమ వ్యాకరణములయందు సూచించియున్నారు. వైదికగ్రంథములు పాండవధార్తరాష్ట్రులఁ బేర్కొనకుండుటకుఁ గల కారణములను ముందు వ్రాయఁగలను. సూత్రకాలాంత్య వాఙ్మయములో, పరీక్షిజ్జనమేజయులు పేర్కొనఁబడుటచే నంతను ముందు  ండవులుందు

రని చెప్పవలసియున్నది. కాని సూత్రకాల మెప్పటిది యను సందేహము చాలమందిని బాధించును. ఆంగ్లేయభాషాకోవిదులు సూత్రకాలము క్రీ. పూ. 1400సం॥రముల మొదలు క్రీ. పూ. 1000సం॥ రములవరకు నని నిశ్చయించిరి కాని బాలగంగాధర తిలకుగారు క్రీ. పూ. 2000సం॥ రములు మొదలుకొనియే సూత్రకాలమై యున్నదని వ్రాసియున్నారు. నాతలంపు కూడ తిలకుగారి యభిప్రాయము ననుసరించియున్నది. వేదవాఙ్మయముచే గాని సూత్రవాఙ్మయముచే గాని, కురుపాండవుల కాలమును నిర్ణయింపలేము కాని, మహాభారతములోని వర్ణనావిశేషముల చేతను, విష్ణుభాగవతపురాణములలో గురుపాండవుల కాలమునుగురించి వ్రాసిన వ్రాతలచేతను, కురుపాండవుల కాలము, అనగా మహాభారతయుద్ధకాలము నిర్ణయింపవలసియున్నది. అంను మహాభారతములోని వర్ణనాంశములను ముందుగ బరిశీలింతము. శ్రీకృష్ణుఁడు సంధికి బోయిన నక్షత్రము "రేవతి" యనియు దుర్యోధనుఁడు కురుక్షేత్రమునకు సైన్యములను నడపించినది "పుష్యమిా" నక్షత్రమనియు, బలరాముఁడు తీర్థయాత్రకు బోయినదియు నాపుష్యమిానక్షత్రమే యనియు, బలరాముఁడు తీర్థయాత్రను ముగించుకొని, భీమ దుర్యోధనుల గదాయుద్ధముఁ జూచుటకు వచ్చిననాఁడు "శ్రవణా" నక్షత్ర మనియు, నాఁటికి, పదునెనిమిది దినముల క్రితము యుద్ధప్రారంభమనియు, యుద్ధారంభమునుండి పదునాలుగవ నాఁటి రాత్రి కూడ యుద్ధమైనదనియు, నాఁటిరాత్రి రెండువంతులైనపిమ్మటఁ జంద్రోదయ మైనదనియు, నారాయణభట్టుములయందు వర్ణింపఁబడియున్నది. మఱియు నుభయసైన్యములు, కురుక్షేత్రముఁ జేరిన పిమ్మటను, వ్యాసులవారు ధృతరాష్ట్రునితో నప్పటి "యుత్పాతములను" వర్ణించుటలో కొన్ని జ్యోతిశ్శాస్త్రసంబంధములఁగూడ సూచించియున్నారు. అందుక్రింది వి ముఖ్యములు.

(1) అరుంధతికి వసిష్ఠుఁడు వెనుకకైనాఁడు. శనైశ్చరుఁడు రోహిణియం దుండి, పీడించుచున్నాఁడు. (2) మాటిమాటికి భూమి కంపించుచున్నది. రాహువు సూర్యునిఁ బొందుచున్నాఁడు. శ్వేతగ్రహము "చిత్ర" నతిక్రమించియున్నది.

(3) మహాఘోరమగు ధూమకేతువు "పుష్యమి" నాక్రమించియున్నది. ఇది సైన్యముల కమంగళముఁ జేయును. "మఘానక్షత్రముల యం దంగారకుఁడును, శ్రవణమున బృహస్పతియు" వక్రించిరి. సూర్యపుత్రునిచే నుత్తరానక్షత్ర మాక్రమింపఁబడి పీడింపఁబడుచున్నది.

శుక్రుఁడు పూర్వాభాద్రయందుఁ బ్రకాశించుచున్నాఁడు కాని, యుత్తరాభాద్రలోఁ గూడఁ బ్రకాశించుచున్నటుల నున్నాఁడు.

(4) శ్వేతగ్రహము పొగతోఁ గూడిన యగ్నివలె జ్యేష్ఠానక్షత్రము నాక్రమించి ప్రజ్వలించుచున్నది......శశి భాస్కరులు రోహిణీ

---

(1) శ్లో. అరుంధతీ తయాప్యేష। వసిష్ఠః పృష్ఠతః కృతః
రోహిణీం పీడయత్యేవ స్థితో రాజన్ శనైశ్చరః॥
(2) ,, అభీక్ష్ణం కంపతే భూమి రర్కం రాహు స్తథైవ చ
శ్వేతో గ్రహ స్తథా చిత్రాం సమతిక్రమ్య తిష్ఠతి॥
(3) ,, ధూమకేతు ర్మహాఘోరః పుష్యం చాక్రమ్య తిష్ఠతి
సేనయో రశివం ఘోరం కరిష్యతి మహాగ్రహః॥
మఘాస్వంగారకో వక్రః శ్రవణే చ బృహస్పతిః
భగం నక్షత్ర మాక్రమ్య సూర్యపుత్రేణ పీడ్యతే॥
శుక్రః ప్రోష్ఠపదే పూర్వే సమారుహ్య విరోచతే
ఉత్తరే తు పరిక్రమ్య సహితస్సముదీక్ష్యతే॥
(4) శ్వేతో గ్రహః ప్రజ్వలిత స్సధూమ ఇవ పావకః ఐంద్రం తేజస్వి నక్షత్రం జ్యేష్ఠా మాక్రమ్య తిష్ఠతి.........రోహిణీం పీడయంతా వుభౌ చ శశిభాస్కరౌ॥ చిత్రాస్వాత్యంతరే చైవ ధిష్ఠితః పరుషగ్రహః॥ వక్రానువక్రం కృత్వా చ శ్రవణం పావకప్రభః బ్రహ్మరాశిం సమావృత్య లోహితాంగో వ్యవస్థితః॥.........సంవత్సరస్థాయినౌ చ గ్రహౌ ప్రజ్వలితా వుభౌ విశాఖాయా స్సమీపస్థౌ బృహస్పతి శనైశ్చరౌ॥.........చతుర్దశీం పంచదశీం భూతపూర్వాం చ షోడశీం చంద్రసూర్యావుభౌ గ్రస్తా వేకమాసీం త్రయోదశీం॥

నక్షత్రమును బీడించుచున్నారు. పరుషగ్రహము, చిత్రాస్వాతుల నడుమ నున్నది. అగ్నివంటి కాంతిగల యంగారకుడు శ్రవణములో వక్రించి వక్రించి బ్రహ్మరాశి యందున్నాడు. సంవత్సరమునకు "అను నించి" "బృహస్పతి శనైశ్చరులు" విశాఖకు, సమీపించుచున్నారు... ......చంద్రసూర్యగ్రహణములు, ఒకదాని తరువాత నొకటి పదునాలుగు, పదునేను, పదునారు, పదమూడు దినములలో వచ్చినవి.

పై వర్ణనల యందు గొన్నియసందర్భములు కాన్పించుచున్నవి కాని, యాఘట్టమునందే స్థలాంతరమునందు "కార్తికశుద్ధ పూర్ణిమ నాడు చంద్రుడు పద్మవర్ణము గల నభమునం దగ్నివర్ణము కలవాడై కళాహీనుడుగా నుండెననుటచేతను పైయుత్పాతములు కార్తికమార్గశిరమాసములలోనై యుండెననుట స్పష్టము. పైవర్ణనములలోని "శ్వేతగ్రహ మెదియో తెలియకున్నది. అట్టిదియే "పరుషగ్రహమును" ఒకచో "అంగారకగ్రహము" మఘానక్షత్రములయందు వక్రించి యున్నాడనియు, మఱియొక చోటున శ్రవణమున వక్రించివక్రించి బ్రహ్మరాశి (ధనుస్సు) నున్నాడనుటచే నావత్సరమున నంగారకుడు రెండుసారులు వక్రమును బొందియుండెనని తోచుచున్నది. బృహస్పతి శ్రవణమున వక్రించెనని మొదట జెప్పి, మఱియొక చోటున విశాఖను బృహస్పతి శనైశ్చరులు, సమీపించుచున్నా రనుటయు, శనైశ్చరులు రోహిణిని బీడించుచున్నాడని యొక చోటునను మఱియొకచోట నుత్తరలో నున్నాడనియు విశాఖను సమీపించుచున్నాడని వేఱొక చోటున, నుడువుటయు గార్తిక మార్గశిరమాసములలో "శశి, భాస్కరులు" అందు, భాస్కరుడు, రోహిణిని బీడించుచున్నా డనుటయు, శుక్రుడు కార్తికమాసమున బూర్వోత్తరాభాద్రలలో నునగా, సూర్యునికంటె నాలుగు లేక యైదురాసులు ముందుండుటయు విచారణీయాంశములై యున్నవి. రోహిణిని భాస్కర శనైశ్చరులు

పీడించుచున్నారని చెప్పుటలో "వేధించుచున్నా" రని తాత్పర్యమై యుండును. కాని శనైశ్చరుఁ డుత్తరానక్షత్రముునుండి విశాఖకు సమీపించుటయు శ్రవణమునుండి మైదు నక్షత్రములు వెనుకకు వక్రించుటయు సరిపడుట లేదు. మఱియు నావత్సరము, పదునాలుగు పదునేను పదునారు పదమూఁడు దినములలో చంద్రసూర్యగ్రహణములు కలుగుటకూడ విచారణీయమే. మహాభారతమునందే యావత్సరము మార్గశిరమాసమున నొకపక్షములో రెండుక్షయతిథులు కలిగిననని చెప్పుటచే పదమూఁడు దినములలోఁ బూర్ణిమామావాస్యలు సంభవించి యప్పుడే సూర్యచంద్ర గ్రహణములుకలిగియుండిననుటకు సందేహింప నవసరము లేదు. పరుష శ్వేత గ్రహము లెవ్వి? రవికిశుక్రుఁడు నాలుగైదు రాసుల నతిక్రమించి ముందు వెనుకలుండునా? గురుఁడయిదారు నక్షత్రములను వక్రించునా? శని మూఁడు నాలుగు నక్షత్రముల నెనిమిదితొమ్మిది మాసములలో నతిక్రమించునా? యను నంశములను జ్యోతిశ్శాస్త్రజ్ఞు లాలోచింపవలసిన యంశములై యున్నవి. ఇదివఱకు వ్రాసిన యంశములవలన మహాభారతయుద్ధకాలమును నిర్ణయింప నైతి గాను న్నది మహాభారతములోని యింకొక యంశమును విచారింతము.

మహాభారతవ్యాఖ్యాతలలో "నీలకంఠాచార్యుఁడు" ముఖ్యుఁడు. అతని వ్యాఖ్య ననుసరించియే మద్రాసునందు నేటి కేబదినాలుగు సంవత్సరములకుఁ బూర్వమున నే వేంకటసుబ్బాశాస్త్రుల వారును, రమారమి యిరువది యేండ్లకుఁ బూర్వము కుంభకోణమున, ఆర్ కృష్ణమాచార్యులవారును మహాభారతముఁ బరిష్కరించి యాంధ్రసంస్కృతాక్షరములతోఁ దమ సంస్కృతభారతములఁ బ్రకటించిరి. (ఆరెండు ప్రతులనే విశేషముగ నేనాధార పఱచుకొనుచున్నాఁడను. మఱియు కలకత్తాలోని ప్రతాపచంద్రరాయిగారి ప్రతియొకటియు శ్రీపిఠాపురపు మహారాజావారి పుస్తకాగారమునం దుండిన వ్రాతప్రతియు, ఆంధ్ర

పరిశోధక మహామండలికి "శ్రీ చలికాని లచ్చారావు" గారిచే సంపాదింపఁబడిన వ్రాతప్రతియుఁ గూడ నాచేఁ బరిశీలింపఁ బడుచున్నవి) ఆ రెండు ప్రతులలో నుల్లేఖితమగు సంశములఁ జూడఁగా నీలకంఠాచార్యుఁడు భారతయుద్ధారంభ మేమాసమున నేతిథియం దారంభింపఁబడి యున్నదను దానిఁగూర్చి కొంత విచారణను సలిపిన సంగతి తెలియనగును. ఆచ్చు భీష్మపర్వము పదునేడవయధ్యాయము యొక్క రెండవ శ్లోకమగు "మఘావిషయగస్సోమః" అనుదానికి సంబంధించియున్నది. (1) "మఘ" యన, పితృదేవతాక నక్షత్రము. దానియొక్క "విషయః" మన దేశము అనగా పితృలోకము దానిని సోముఁడు పొందెను. అదియే కురుపాండవ యుద్ధారంభదినము. భారతసావిత్రియందు—హేమంతర్తుప్రసంగః మార్గశిరశుద్ధ త్రయోదశియందు యమదైవత నక్షత్రమున యుద్ధమారంభింపఁబడెను.

---

(1) "మఘావిషయగస్సోమస్తద్దినం ప్రత్యపద్యత" మఘా పిత్ర్యం నక్షత్రం తస్య విషయో దేశః పితృలోకః తద్గతస్సోమః కురుపాండవ యుద్ధారంభదినముక్తం భారత సావిత్ర్యాం. శ్లో. హేమంతే ప్రథమేమాసే శుక్లపక్షే త్రయోదశీ ప్రవృత్తం భారతం యుద్ధం నక్షత్రే యమదైవతే "ప్రథమే మార్గశీర్షే అత్ర త్రయోదశీశబ్దేన తద్వ్యక్తా చతుర్దశ్యేవ గ్రాహ్యా" శ్లో. అర్జునేన హతో భీష్మో మాఘమాసే సితాష్టమీ త్రయోదశ్యాంతు మధ్యాహ్నే భారద్వాజో నిపాతిత ఇతి. తత్రైవ యుద్ధస్య—దశమే పంచదశేహ్ని హతయోర్భీష్మద్రోణయోః కష్టమీత్రయోదశీ సంయోగదర్శనాత్ అత్ర పుష్యేపి మాఘశబ్దో మకరాయనాభిప్రాయేణ. తదానీం తత్సంభవాత్—అన్యథా సప్తమీ ద్వాదశ్యోరేవ తయోర్హననం-యత్తు అమావాస్యాయాం దుర్యోధన హననం తత్రైవోక్తం- తత్రాప్యమావాస్యాశబ్దః ఇష్టిదినే ప్రతిపద్యేవ ప్రయుక్తో వేదితవ్యః-యమదైవత ఇతి భరణీనగ్రాహ్యా-కింతు యుగ్మదైవతం మృగశీర్ష మేవ గ్రాహ్యం-తస్యహి పూర్వదళం శుక్రదైవత్యత్వా దాసురం-ఉత్తరార్థంతు బుధదైవత్యత్వా ద్దైవం తేన తత్రాసురాణా ముపరమో దేవానా మభ్యుదయశ్చ సిద్ధ్యతి-కించ శ్లో. చత్వారింశ దహాన్యద్య ద్వేచమే నిస్సృతస్యవై పుష్యేణ సంప్రయాతోస్మి శ్రవణే పునరాగతః ఇతి యుద్ధారంభా దష్టాదశేహ్ని తీర్థయాత్రాత్ ఆగతస్య బలదేవస్య వచనాత్-శ్రవణే యుద్ధసమాప్తిర్దృశ్యతే-తతః ప్రాచీనే అష్టాదశే దినే మృగశీర్ష ఏవ యుద్ధారంభస్సంభవతి-

(ఉత్తరదేశీయులు బహుళపాడ్యమి మొదలు పూర్ణిమాంత
ము నొక మాసముగా లెక్కింతురు. మార్గశిరమాస మనఁగా నాం
ధ్రులయొక్క కార్తికబహుళ పాడ్యమి యని తలఁపవలెను. ఈక్రింద

---

వత్యేకవింశే భరణ్యాం అష్టాదశదినయుద్ధస్య నక్షత్రత్రయ క్షయస్య కల్పయితు మయుక్తత్వాత్-కార్తికీ కృత్తికాయోగానుపాతేన చతుర్దశ్యాం మృగస్యైవ సంభావనాచ్చ--ఏతేన యుద్ధారంభం ప్రకృత్య-మఘావిషయగస్సోమ స్తద్దినం ప్రతిపద్యతేతి భీష్మపర్వణి సంజయ వాక్యా న్మఘానాం యుద్ధారంభ ఇత్యపి నిరస్తం-బలదేవవాక్య విరుద్ధత్వాత్-శబ్దార్థస్తు-మఘాశబ్దేవ తత్సహచరాః పితరోలక్ష్యంతే-తేన యుద్ధే మృతానాం ఉత్తమదేహప్రదానార్థం చంద్ర స్తదా పితృలోకే సన్నిహితోభూదితి-స్వర్గిణాం దివ్యదేహలాభః చంద్రాధీనఇతి శాస్త్రప్రసిద్ధః--తథా ద్వాదశరాత్రియుద్ధే చంద్రోదయకాలేః శ్లో॥ త్రిభాగమాత్రశేషాయాం రాత్రౌ యుద్ధమవర్తతేత్యుక్తం-తత్ర త్రిభాగేత్యస్య త్రిముహూర్తశేషాయామిత్యర్థః-తథా శ్లో॥ అష్టపంచాశతం రాత్ర్యః శయానస్యాద్య మే గతాఇతి భీష్మవచనంతు శ్లో॥ మాఘోయం సమనుప్రాప్తః...త్రిభాగమాత్రః పక్షోయమితి వాక్యశేషానుసారాత్. అశీతం, శతహీనం యథాస్యాత్తథాష్టపంచ అష్టపంచాశద్రాత్రయో వ్యతీతాఇత్యర్థః. తథాచ పౌషకృష్ణాష్టమీతో మాఘశుక్లపంచమ్యాం తావతీదివసంఖ్యా పూర్యతే పక్షస్యచ తృతీయోభాగో గతోభవతి. తత్రాప్యేకతిథిక్షయాత్ పంచమ్యా ద్విచత్వారింశత్తమత్వం జ్ఞేయం-శేషోభవితుమర్హతీత్యత్ర కార్యశేషో దేహత్యాగాదిరేవ శేషో నతుపక్ష శేషఇతి వ్యాఖ్యా జ్ఞేయా-తత్రాయంనిష్కర్షః-కార్తికశుక్లద్వాదశ్యాం రేవత్యాం కృష్ణప్రయాణం-తతో మార్గశీర్ష కృష్ణపంచమ్యాం పుష్యే సేనయోర్నిర్యాణం-తతః పంచమ్యాఉపరి షష్ఠీమారభ్య సప్తదినాని గణయిత్వా తదుపర్యష్టమేహ్ని అమావాస్యాభవిష్యతీత్యనేన త్రయోదశదినాత్మకోయం కృష్ణపక్షో మహోత్పాతజనకఇతి సూచితం-క్షీణయోశ్చతిథ్యోః పక్షాంతరే పునర్వృద్ధ్యా సంఖ్యాపూరణంభవతీతి మార్గశీర్ష కృష్ణపంచమీమారభ్య పౌషశుక్లప్రతిపత్ ద్విచత్వారింశత్తిథిః భవతీతి బలదేవవాక్యోక్తా దివసంఖ్యాచానుగృహీతా భవతి-యత్తు॥ శ్లో॥ సప్తమాచ్చాపి దివసా దమావాస్యాభవిష్యతి। సంగ్రామంయోజయేత్తత్ర తాం హ్యాహు శ్శక్రదేవతాం "ప్రయాతవై కురుక్షేత్రం పుష్యేద్యేతి పునఃపున" రితి దుర్యోధనవాక్యం—తత్ర సంగ్రామమిత్యనేన సంగ్రామే జయసాధనంకర్మ తస్యాంయోజయేదిత్యుక్తం శక్రదేవతామిత్యనేన తస్యాం జ్యేష్ఠానక్షత్రయోగ ఉచ్యతే-సచ తిథిద్వయక్షయా త్తత్రాసంభవన్నపి తత్ర తిథిపదేవ నక్షత్రక్షయాద్వా తిథినక్షత్రయో రాద్యంతయోగాద్వా జ్ఞేయ ఇతి సర్వసమంజసం—

సప్తలెక్కయే చెప్పఁబడినది) మార్గశిరమాసమున శుద్ధ త్రయోదశి యనఁగా చతుర్దశి యని గ్రహింపవలెను. ఏమనఁగా ఆభారతసావిత్రియందే, అర్జునునిచే భీష్ముఁడు మాఘశుద్ధాష్టమి యందును, త్రయోదశినాఁటి మధ్యాహ్నమున ద్రోణాచార్యుఁడును గొట్టఁబడి రనుటచేతను యుద్ధారంభమైన పదియవనాఁడును బదునేనవనాఁడును గొట్టఁబడిన "భీష్మద్రోణుల" అష్టమీ త్రయోదశీ సంబంధము చూపఁబడుటవలనను, ఇక్కడ పుష్యమాసము నందును, మకరాయనాభిప్రాయముచే మాఘశబ్దము గ్రహింపఁ బడెను. అపుడు పుష్యమాసమున మకరసంక్రమణము సంభవించుటచేతను (ఒక్కొకప్పు డాంధ్రులకు పుష్యబహుళమున సంభవించిన మకరసంక్రాంతి నోత్తరాహులు, మాఘమాసమునందైన మకరసంక్రమణమందురు. కాని భారతయుద్ధవత్సరమున పుష్యశుద్ధముననె మకరసంక్రమణమై యున్నదని వ్యాఖ్యాత తాత్పర్యము) లేకుండిన సప్తమీద్వాదశీ దినములలోనే భీష్మద్రోణుల హననమై యుండును. అమావాస్యయందు దుర్యోధనుఁడు చంపఁబడెనని భారతసావిత్రి యందే కలదు. అమావాస్య శబ్దము "ఇష్టిదినమగు" పాడ్యమని గ్రహింపవలెను. యమదైవతనక్షత్రమున యుద్ధారంభమనుటలో "భరణీ నక్షత్ర" మని గ్రహింపరాదు. ఇఁక నేమనఁగా—యుగ్మదైవతమగు మృగశిరా నక్షత్రముగా గ్రహింపవలెను. మృగశిరా నక్షత్రములో పూర్వార్థభాగము "వృషభరాశి" లోనిదై శుక్రదైవతాకమును, ఉత్తరార్థభాగము మిథునరాశిలోనిదై బుధదైవతాకమునై పూర్వార్థమాసురము; ఉత్తరార్థము దైవతమునై, రాక్షసాంశ సంభూతులగు దుర్యోధనాదులకు నష్టమును, దేవాంశసంభూతులగు పాండవులకు జయమును సంపాదించు నక్షత్రమైనది. ఇంతియకాదు. యుద్ధారంభమైన పదునెనిమిదవనాఁడు; భీమదుర్యోధనుల గదాయుద్ధము చూచుటకు తీర్థయాత్రనుండి వచ్చిన

బలరాముఁడు, నేను నేఁటికి నలువదిరెండు దినములకుఁ బూర్వము, పుష్యమీనక్షత్రమునందు ప్రయాణమై వెడలితిని. ఈనాఁడు శ్రవణా నక్షత్రమునందు మరల వచ్చితి ననుటచే శ్రవణా నక్షత్రమునందు యుద్ధసమాప్తి కాన్పించుచున్నది. అందువలన గత పదునెనిమిదవ నక్షత్రమగు మృగశిరయందే యుద్ధారంభమగుచున్నది కాని కడచిన యిరువదియొకటవ నక్షత్రమగు భరణిలో, యుద్ధారంభము కాదు. పదునెనిమిది దినములలో మూఁడు నక్షత్రములు క్షయించిన వని కల్పించుట యుక్తము గానిది. కార్తీకశుద్ధ పూర్ణిమ కృత్తికా నక్షత్రముతోఁ గూడిన దగుట వలన మార్గశిర చతుర్దశి యందు మృగశిరా నక్షత్రము సంభవించినది. ఈ హేతువుచే, భీష్మపర్వము నందు, మఘయందు యుద్ధారంభ మని సంజయుఁడు చెప్పిన వాక్యము నిరస్తమగుచున్నది. ఏమనఁగా బలదేవుఁడు చెప్పినమాటకీ సంజయవాక్యము విరుద్ధమగుట చేతను—శబ్దార్థ మేమనఁగా మఘాశబ్దముచే, తత్సహచరులగు పితృదేవత లూహింపఁ బడుచున్నారు. అందుచే యుద్ధమృతుల కుత్తమదేహముల నిచ్చుటకుఁ గాను చంద్రుఁ డపుడు, పితృలోక సన్నిహితుఁడై యుండెనని తలఁపవలెను. స్వర్గస్థులకు దివ్యదేహలాభము చంద్రాధీనమని శాస్త్రప్రసిద్ధము కలదుగదా-మఱియు ద్వాదశి నాఁటి రాత్రియుద్ధమునందు-చంద్రోదయకాలమునందు-మూఁడవవంతు రాత్రి మిగిలియుండఁగా యుద్ధము జరిగినది. అని చెప్పఁబడెను. అక్కడ మూఁడవవం తనఁగా మూఁడుముహూర్తముల కాలముండఁగా నని గ్రహింపవలెను. అట్లే "అష్టపంచాశతంరాత్ర్యః" "మాఘోయం సమనుప్రాప్తః" అను నానుశాసనికపర్వాంతమున భీష్మునిచే చెప్పఁబడిన వాక్యములలోని యర్థము కూడ మార్గశిరశుద్ధ చతుర్దశినాఁడే యుద్ధప్రారంభ మను దానికి సరిపోవుచున్నది. భీష్ముఁడు చెప్పిన "అష్టపంచాశతం [illegible] యవలెను.

గణితశాస్త్రమర్యాద ననుసరించి కుడినుండి యెడమునకు నంకెలను వేయు దురు గాన, 'అష్ట' యన నెనిమిది 'పంచ' యన నైదు. అనఁగా యేబది యెనిమిది 'అశీతం' నూటికి తక్కువ. అనఁగా నలువది రెండ గును. ఇదిమాఘోయం అను శ్లోకములోని "త్రిభాగమాత్రపక్షము" పం చమి గాన, భీష్ముఁడంపశయ్యపైఁ బడిన పుష్యబహుళాష్టమికి, మా ఘశుద్ధ పంచమి నలువది రెండవదిన మగుచున్నది. (వెనుకను వ్రాసిన పద్ధతి ప్రకారము పుష్యబహుళాష్టమి యన మార్గశిర బహుళాష్టమి యుగాంధ్రుల కగునని తెలియవలెను.) పైవాక్యార్థముల సారాంశ మేమ నఁగా కార్తీకశుద్ధ ద్వాదశిని రేవతిలో, కృష్ణుఁడు సంధికి హాస్తిపురి కేఁగెను. మార్గశిర బహుళ పంచమిని పుష్యమిలో, ఇరుసేనలు ప్ర యాణమైనవి. ఆపట్టి మొదలు యేడవనాఁ డమావాస్య యనుటచే రెండు తిథులు క్షయించిన పదమూఁడు దినములైన పక్షమిదియే. అదిమహోత్పాత జనకమని వ్యాసుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పి యున్నాఁడు. క్షీణతిథులు, పై పక్షములలో మఱల వృద్ధి నొందును గాన మార్గశిర బహుళ పంచమినాఁడే, తీర్థయాత్రకుఁ జనిన బలదేవు నకు పుష్యశుద్ధ పాడ్యమి లోని శ్రవణానక్షత్రము నలువది రెండవ దినములోని దగుచున్నది. మఱియు నేడు దినములలో నమావాస్య జ్యేష్ఠా నక్షత్రముతోఁ గూడిన దగుచున్నది. నాఁడే యుద్ధారంభముఁ జేయవలెనను దుర్యోధన వాక్యము. యుద్ధాదియందు జేయఁదగిన జయసాధనకర్మ యని తెలియవలెను. (అయితే కార్తీకపూర్ణిను కృత్తి కా నక్షత్రముతోఁ గూడినదిగదా- రెండుతిథులు క్షయించిన యనంత ర బహుళామావాస్యకు జ్యేష్ఠానక్షత్ర మెట్లు లగునను శంక తీరిపుట్ట వది) తిథులు క్షయించినటులనే, నక్షత్రములు కూడ క్షయింపవచ్చు ను. లోక[illegible] గడియ లుండి

యమావాస్యాంతమునకు జ్యేష్ఠాదిలోఁ గొన్ని గడియలు కలియవచ్చు నని తలఁపవలసి యున్నది. ఇట్లు సరిపెట్టుకొనుటమంచిది.

ఇట్లు వ్యాఖ్యాత "ఉద్యోగ భీష్మ, శల్యానుశాసనిక" పర్వములలోని భాగములను సరిపెట్టినను "శాంతిపర్వము, ఏకపంచాశదధ్యాయము, పదునాల్గవ శ్లోకమగు" "పంచాశతం షట్చ" అను శ్లోకమునకు వ్యాఖ్యానమును వ్రాయుచు, భీష్ముఁడు శరతల్పగతుఁడైన యిరువది తొమ్మిదవ దినమున కృష్ణుఁడు పాండవులతో భీష్ముఁ జూచుటకు వచ్చి, నేఁటికి ముప్పదవనాఁడు నీవు స్వర్గస్థుడ వగుదువని చెప్పినటుల నర్థముఁ జేసియున్నాఁడు. మన లెక్కను భీష్ముఁడు శరతల్పఁగతుఁ డగుట మార్గశిర బహుళ సప్తమి. కృష్ణుఁడు భీష్మునితో మాటలాడిన దినము పుష్య బహుళ షష్ఠి. నాఁటికి నెలయగు దినము, మాఘబహుళ షష్ఠి కావలసి యున్నది కాన, వ్యాఖ్యాతాభిప్రాయము సరిగా లేదని తలఁతును. మూలమైన నొకదానితో నొకటి సరిపడి యుండ లేదు. కార్తీకబహుళామావాస్య జ్యేష్ఠా నక్షత్రాదితోఁ గలిసినను, మకరసంక్రమణ "ముత్తరాషాఢా" ద్వితీయపాదమున సూర్యుఁడు ప్రవేశించుటయే యైనచోఁ పుష్యబహుళ పంచమీప్రాంతముననే, మకరసంక్రమణమగును. ఈయన్యోన్యాశ్రయ దోషపుంజముల ననుసరించి, మకరసంక్రమణము ననుసరించి, భారత యుద్ధకాలమును నిర్ణయింప వీలుకాకున్నది. అన్యోన్య విరుద్ధములుగ భారతశ్లోకము లుండుటకుఁ గల కారణము "భారతగ్రంథకాలము" అను నంశమునఁ గొంతవిమర్శింతును. భారతశ్లోకములచే భారత యుద్ధకాలమును నిర్ణయించుటకంటె, విష్ణు భాగవతపురాణములలో, భవిష్యత్కాల చరిత్రమును వ్రాయు సందర్భమునను, "కల్హణమహాకవి" రాజతరంగిణి యందును, కాశ్మీరరాజకాలనిర్ణయ సమయముననూ, మహాభారత యుద్ధకాల నిర్ణయమును జేసి యున్నాయమునను, భాగ

వశము ననుసరించి వ్రాసెదను. విష్ణుభాగవతపురాణములలో నిర్ణయించిన విధాన మొకటిగానే యున్నది. రాజతరంగిణిలోని స్వల్పము గా వ్రాసిన దానిని గూడ వ్రాసెదను.

శ్రీమద్భాగవత ద్వాదశస్కంధ ప్రథమాధ్యాయము నందు "భావికాలగతులు" అను శీర్షికలో, క్రిందిసంగతులు కలవు.

* "మగధ రాజ్యము నేలిన జరాసంధ వంశజులలోఁగడపటివాఁడగు" "పురంజయుని" ఆతని మంత్రియగు "శునకుఁడు" చంపి తన కుమారుఁడగు "ప్రద్యోతునికి" మగధ రాజ్యపట్టముఁగట్టెను. ప్రద్యోతుఁడును నాతని సంతతివారు నలువురును మొత్తమైదుగురు నూటముప్పది యెనిమిది (138) సంవత్సరములు మగధరాజ్యము నేలిరి. ప్రద్యోతనవంశజులలోఁ గడపటివానిని శిశునాగుఁడు వధించి, మగధ నాక్రమించెను. (శిశునాగునకు శిశునాభుఁడని మఱియొక పేరుకలదు.) శిశునాగుఁడు మొదలు పదిమంది యీవంశజులు మగధ రాజ్యము నేలిరి. (ఈశిశునాగవంశజులలో నైదవ వాఁడగు "బింబుసారుఁడు" మగధరాజ్యము నేలుచుండి నపుడే బుద్ధభగవానుఁడు "రాజగృహ మను" మగధరాజధానికి వచ్చి, బిందుసారునికి బౌద్ధమతదీక్ష నిచ్చి యున్నాఁడు.) శిశునాగవంశజులు పదిమంది మూఁడు వందల

---

* "యోంత్యః పురంజయోనామ భవిష్యో బార్హద్రథః" శ్లో॥ తస్యామాత్యస్తు శునకః। హత్వాస్వామినమాత్మజం। ప్రద్యోతసంజ్ఞం రాజానం కర్తాయత్పాలకమ్సుతః...... పంచప్రద్యోతనాఇమే...అష్టత్రింశోత్తరశ్శతం...భోక్ష్యంతి పృథివీం నృపాః శిశునాభస్తతోభావ్యః కాకవర్ణస్తుతత్సుతః...శైశునాభాద్దశైవేతే షష్ట్యుత్తరశతత్రయం సమాభోక్ష్యంతి పృథివీం కురుశ్రేష్ఠకలౌనృపాః। మహానందసుతోరాజన్ శూద్రాగర్భోద్భవోబలీ మహాపద్మపతిఃకశ్చి న్నందః క్షత్రవినాశకృత్ ...తస్యచాష్టౌభవిష్యంతి సుమాలి ప్రముఖాస్సుతాః యఇమాంభోక్ష్యంతిమహీం రాజానశ్చ శతంసమాః। నవనందాన్ ద్విజః కశ్చి త్ప్రపన్నానుద్ధరిష్యతి॥ తేషామభావేజగతీం మౌర్యాభోక్ష్యంతివైకలౌ సఏవచంద్రగుప్తంవై ద్విజోరాజ్యేభిషేక్ష్యతి........మౌర్యాహ్యేతేదశనృపాః సప్తత్రింశ చ్ఛతోత్తరం

యఱువది (360) సంవత్సరములు పాలించిరి. శైశునాగులలోఁ గడపటి వాఁడగు "మహానందునకు" శూద్రస్త్రీ యందు "మహాపద్మనందుఁడు" పుట్టెను. ఆమహాపద్మనందునకు "సుమాలి" మొదలగు నెనమండ్రు కుమారులు గలరు. మహాపద్మనందుఁడు నాతని కుమారులు, నూరేండ్లు మగధను పాలించిరి. ఆనవనందులను, బ్రాహ్మణుఁ డొకఁడు (చాణక్యుఁడు) చంపి "మౌర్య్యవంశస్థుఁడగు చంద్రగుప్తుని" మగధరాజ్యమునకుఁ బట్టము గట్టెను. మౌర్య్యవంశస్థులు పదిమంది మగధరాజ్యమును పాలించిరి.

పై యంశముల వలన మౌర్య్యచంద్రగుప్తుని రాజ్యారంభమునకుఁ బూర్వము "అయిదువందల తొంబది యెనిమిది (598) సంవత్సరముల నాఁడు జరాసంధ వంశస్థుల రాజ్య మంతరించి యున్నదని తెలియవచ్చుచున్నది. మఱికొందఱు విమర్శకులు మహాపద్మనందుఁడు నాతని కుమారులు రాజ్యమేలిన నూరుసంవత్సరకాలమును, శైశునాగుల రాజ్యకాలమగు (360) సంవత్సరములలోనే యిమిడియున్నదనుచున్నారు. అట్లయినను క్రీస్తుశకమునకుఁ బూర్వము (320) మూఁడు వందలఇరువదిసంవత్సరముల నాఁడుప్రారంభింపఁబడినచంద్రగుప్త రాజ్య సంవత్సరములతోఁ బై (498) నాలుగువందల తొంబది యెనిమిది సంవత్సరములఁ గలుపగా క్రైస్తవ శకమునకుఁ బూర్వము (818) ఎనిమిదివందల పదునెనిమిది సంవత్సరముల నాఁడే జరాసంధవంశజుల రాజ్య మంతరించి యున్నది. మఱియు శ్రీమద్భాగవతము, నవమస్కంధము నందు భవిష్యద్రాజేతి హాసముఁ జెప్పు సందర్భమునందు "శ్రీశుకుఁడు" (౧) "బృహద్రథుని" సంతతివారగు నేరాజులు కలరో వారు, వేయిసంవత్సరములు మగధదేశముఁ బాలింతురు" అని చెప్పుటచే క్రీ. పూ. (818) సం॥ రమున నంతరించినట్టియు, బృహద్రథుని

(౧) యే బార్హద్రథభూపాలా భావ్యాస్సాహస్రవత్సరం

సంతతిలో గడపటి వాడైన పురంజయునకు బార్హ్వము వేయిసంవత్సరములు మగధను బార్హద్రధులు పాలించియుండిరి. కనుక బార్హద్రధ సంతతివారి రాజ్యము, వేయివత్సరములును, ప్రద్యోతనశైశునాగమౌర్య వత్సరములు క్రీ. పూ. (818) ఎనిమిదివందల పదునెనిమిది కాక (918) తొమ్మిదివందల పదునెనిమిది కాని కలుపఁగా 1000 + 818 = 1818 లేక 1919 క్రీస్తునకుఁ (బూర్వము 19, 20, శతాబ్ద ప్రాంతములలో) మగధను, బార్హద్రధ భూపాలు రేలుట కారంభించి యున్నా రని స్పష్టమగుచున్నది. దీనిని మగధదేశమని మనమిపు డనుచుంటిమో దానిని, ఋగ్వేదకాలఋషులు "కీకటదేశ" మనుచుండిరి. భాగవత ప్రథమస్కంధవ్యాఖ్యలోఁగూడ కీకటదేశము మధ్య గయాప్రదేశ మని కలదు. ఋగ్వేదమున కీకటదేశ మనార్యప్రదేశము దాని "నుపరిచరవసువు" యొక్క కుమారుఁ డగు "బృహద్రథుఁ డేలుట కారంభించెను బృహద్రధుని కుమారుఁడు "జరాసంధుఁడు" జరాసంధుఁడు కృష్ణునిఁ గూడ మహాయుద్ధముఁ బరుగిడునటులఁ జేసిన శూరుఁడు. జరాసంధుఁడు కంసునకు మామగారగుటచేఁ బాండవులకంటెఁ గూడ వయస్సునఁ బెద్దవాఁడు. మగధరాజ్యమును బృహద్రథుఁ డేలుటకు "ఉపరిచరవసువు" నియమించి నటు లుండుటచేతను, బార్హద్రధభూపాలుగు మగధదేశమును వేయేండ్లు పాలించిరను స్థలమున బృహద్రథుఁడు మొదలుకొని, పురంజయాంతము, వేయేండ్లు పాలించిరని చెప్పుట యుక్తమగు నర్థమగును. అందువలన మగధరాజ్యమున నార్యరాజ్యాధిపత్యము క్రీ. పూ. (1918) ఇరువదవశతాబ్దమునకై యున్న దని చెప్పుట న్యాయవిరుద్ధము కాదు. బృహద్రధుని "సావత్నీసోదరి" యగు "మత్స్యగంధి" శంతనుని భార్య. పాండవులకుఁ బ్రపితామహి. భారతయుద్ధకాలమీ పద్ధతిని క్రీ. పూ. 17, 18 శతాబ్దములలోనై యుండునని తోఁచుచున్నది. ఇంకొకపద్ధతి కలదు అదియును భాగవతము

శ్రీమద్భాగవత ద్వాదశస్కంధ ద్వితీయాధ్యాయమున, నిట్లునున్నది. శ్రీశుకుఁడు, పరీక్షిత్తుతో, నిట్లనుచున్నాఁడు (1) ఓ పరీక్షిత్తా నీజన్మము మొదలు నంద పట్టాభిషేకము వఱకు పదునొకండువందల పదునేను (1115) సంవత్సరము లగును—

(2) సప్తర్షులలో నాకాశమునందు పూర్వదిక్కున నుదయించు రెండు నక్షత్రము "లశ్విన్యాది" నక్షత్రములలో నేనక్షత్రమునకు సమముగా నుండునో, సప్తర్షులా నక్షత్రమున నుండినట్లులఁ దలఁపవలయును. ఒక్కొక నక్షత్రము నందు సప్తర్షులు, నూరేసి సంవత్సరము లుందురు. ఆసప్తర్షు లిపుడు, "మఘానక్షత్రము" నాశ్రయించియున్నారు. ఎపుడు మఘను వదలి (క్రమముగా) పూర్వాషాఢను సప్తర్షులు పొందుదురో, అపుడు "నందుఁడు" రాజగును. అది మొదలుకొని కలియుగము వృద్ధియగును—పై నంద పట్టాభిషేకము "మహాపద్మనందుని దని" తోఁచును. మహాపద్మనందుని పట్టాభిషేకమునకుఁ బిమ్మట నూఱేండ్లకు చంద్రగుప్త రాజ్యాభిషేక మని తెలియుచున్నది. గాన, పరీక్షిన్నందుల మధ్యకాలము (1115 సం॥రములు) నందపట్టాభిషేక చంద్రగుప్త పట్టాభిషేకముల మధ్యకాలము (100 సం॥ రములు) కలుపఁగా (1115 + 100 = 1215) చంద్రగుప్తుని రాజ్యారంభమునకుఁ బూర్వము పదిరెండువందల పదునేను వత్సరములకుఁ బూర్వము, పరీక్షిజ్జననమనియు, క్రీ. పూ. 320 సంవత్సరముల నాఁడగు, చంద్రగుప్తరాజ్యా

---

(1) ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనం। ఏతద్వర్ష సహస్రంతు శతంపంచదశోత్తరం॥

(2) సప్తర్షీణాంతుయౌ పూర్వౌ దృశ్యేతేఉదితౌదివి। తయోస్తుమధ్యేనక్షత్రం దృశ్యతే యత్సమం నిశి తేనైవ ఋషయోయుక్తా స్తిష్ఠంత్యబ్దశతంనృణాం తేత్వదీయే ద్విజాఃకాలే అధునాచాశ్రితామఘాః। యదామఘాభ్యోయాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః। తదానందాత్ప్రభృత్యేవ కలిర్వృద్ధింగమిష్యతి॥

రంభ సంవత్సరములఁ గలుపఁగా క్రీ. పూ. (1535) వసునేను సంవల ముప్పదియైదవ సంవత్సరము నందు పరీక్షిజ్జనన మనియు, స్పష్టమగు చున్నది. మఱియు "ఖగోళము" నందలి సప్తర్షి సంచార నిదర్శనము తోఁ గూడిన విశేషాంశములు. పరమప్రమాణములై యున్నవి. కాని నేటి పాశ్చాత్యపరికరముల చే, ఖగోళమును శోధించు శోధకులు, సప్తర్షి మండలము చలింప దనుచున్నారు. దీని నెటుల సమాధాన పఱుపవలెను! పైదానిని, బట్టి పరీక్షిజ్జన్మకాలమునకుఁ బూర్వము నాలుగైను మాసములలోనైన మహాభారతయుద్ధముకూడ, క్రీ. పూ. 1535, సం॥ రమునసగుచున్నది. వంగ దేశీయుఁడును, శ్రీకృష్ణచరిత్రమునాంగ్లభాష లోవ్రాసిన ,ధీరేంద్రపాలు అనుశోధకుఁడుకూడ, శ్రీకృష్ణుఁడు క్రీ. పూ. 16,15శతాబ్దములనడుమనుండెనని వ్రాసియున్నాఁడు.ఆతని లెక్క-భాగవత విష్ణు పురాణముల ననుసరించియే సరిపోయినది. కాని "పంచాంగములఁ" జేయుమనజ్యోతిశ్శాస్త్రజ్ఞులు పాండవులు "కలి" ప్రారంభముననుండుటచే "కలియుగాబ్దములె" పాండవాబ్దములు గావలెఁ బి నేటికైదువే లేండ్లకుఁ బూర్వమె పాండవులు కలరని వ్రాయుచుందురు. కాని పాండవులుండి నపుడే కలియుగము ప్రవేశించి యున్నదని, మహాభారతమునఁ బెక్కుచోటులను, శ్రీమద్భాగవతమునను, వ్రాయఁబడి యుండుటచే కలియుగము ప్రవేశించు నాఁటికే, పాండవు లుండి రనుటకువీలు కాదు. పాండవులు కలియుగములోని వారే యనియు కురుపాండవ యుద్ధము కలియుగములోనిదే యనియు, నీక్రింది ప్రమాణములఁ బట్టి యూహింపనగును.

"(1) నేనీ కలియుగమున నుంటిని. ధర్మములు సంకీర్ణ మగుచుండగా నింకే నేమి మిగులును. ఇంకను వినఁ గుతూహలము కలదు

---

(1) అస్మిన్ కలియుగేత్వస్మి పునః కౌతూహలంమమ! సమాకులేషు ధర్మేషు కిన్నుశేషం భవిష్యతి [illegible]

(చెపుమా)" ఇది ధర్మజుఁడు "మార్కండేయు" నడిగిన ప్రశ్న. మఱియు శల్యపర్వము (61) అధ్యాయమున, శ్రీకృష్ణుఁడు బలదేవ కోపోపశమ నసందర్భమున, నిటు లనుచున్నాఁడు.

(1) "(బలదేవా) "పొందఁ బడిన కలియుగమును, భీముని ప్రతిజ్ఞను దెలిసికొనుము" ఇది కలియుగము గాన యుద్ధ శాస్త్ర విరుద్ధముగా భీముఁడు, దుర్యోధనుని తొడలను విఱుగఁ గొట్టవచ్చు నని కలియుగమునఁ దా ముండినటుల సమర్థించుచున్నాఁడు. "కల్హణ" పండితుఁడును "రాజతరంగిణి" యను "కాశ్మీరరాజ" చరిత్రమున నిటుల వ్రాసెను.

(2) "కురుపాండవులు, భూలోకము నందు, కలియుగములో "నాఱువందల యేబది మూఁడు" సంవత్సరములు గతించిన పిమ్మట నుండిరి."

శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమునం దిటులఁ గలదు.

(3) "భగవంతుఁడగు విష్ణుని కిరణమగు (అంశము) శ్రీకృష్ణుఁడు స్వర్గస్థుఁ డైనపుడే పాపమునందు రమించు మనస్సుగల కలియుగము ప్రవేశించినది"

"ఎంతవఱకు శ్రీకృష్ణుఁడు తన పాదములచే, భూమిని స్పృశించు చుండెనో అంత కాలము కలి భూమియందు, పరాక్రమింపలేదు"

"ఏదివమున శ్రీకృష్ణుఁడు స్వర్గము నొందెనో యా దివమున నే

---

(1) "ప్రాప్తం కలియుగం విద్ధి ప్రతిజ్ఞాం పాండవస్యచ" శల్యపర్వం.౬౧అధ్యాయం.

(2) శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషుచ భూతలే। కలేర్గతేషు వర్షాణాం। అభవన్ కురుపాండవాః॥ రాజతరంగిణి।

(3) విష్ణోర్భగవతో భానుః కృష్ణాఖ్యోసౌ దివంగతః। తదావిశత్కలిర్లోకం। పాపే యద్రమతే జనః — యావత్స పాదపద్మాభ్యాం స్పృశన్నాస్తే రమాపతిః। తావత్కలిర్వై పృథివీం పరాక్రాంతుం నచాశకత్ — యస్మిన్ కృష్ణో దివంయాతః। తస్మిన్నేవ తదాహని। ప్రతిపన్నం కలియుగమితి ప్రాహుః పురావిదః —

కలియుగము ప్రవేశించె నని ప్రాచీను లనుచున్నారు"

పై శ్లోకతాత్పర్యములు కలియుగారంభము, శ్రీకృష్ణుని మరణము, నేకదినమని కొందఱిమతమై యున్నదనుట స్పష్టమగుచున్నది గాని, భాగవతగ్రంథకర్త మతమది కాదని "ప్రాచీను లనుచున్నారు" అనుటచేతను, శ్రీకృష్ణుఁ డుండఁగ, కలి, పరాక్రమింప లేదనుట చేతను వెల్లడియగుచున్నది. శ్రీమద్భాగవత వ్యాఖ్యాత యగు శ్రీధరాచార్యుఁడును, కలిభూమిపైఁ బరాక్రమింప లేదను చోటన నిటుల వ్రాయుచున్నాఁడు

(1) "శ్రీకృష్ణుఁడు భూమియం దుండినపుడే కలియుగము సంధ్యారూపముచేఁ బ్రవేశించియే యున్నది. నిజమే. అయినను, కలి పరాక్రమింపలేదు"

భాగవతమున నాఘట్టముననే, కలియుగ ప్రవేశమునకు ఖగోళ నిదర్శన మిటుల వ్రాయఁబడినది.

(2) "ఎపుడు సప్తర్షులును మఘానక్షత్రముల యందు సంచరింతురో అపుడు పదిరెండువందల సంవత్సరముల స్వరూపము గల కలి ప్రవృత్తి యైనది" "ఎపుడు మఘానక్షత్రములనుండి సప్తర్షులును, పూర్వాషాఢను బ్రవేశింతురో అపుడు "నందుఁడు" మొదలుకొని కలివృద్ధిఁ గనును"

పై కారణములలో కల్హణుఁడు పరిశోధించి, కలియుగాబ్దములను స్పష్టముగా చెప్పుట గమనింపఁ దగియున్నది. భాగవతమున, "పది

---

(1) "నను శ్రీకృష్ణే పృథివ్యాం వర్తమానేపి సంధ్యారూపేణ కలిః ప్రవిష్ట ఏవాసీత్. సత్యం. తథాపి తావత్ తస్య పరాక్రమో నాభవత్"

(2) యదా దేవర్షయస్సప్త మఘాసు విచరంతిహి। తదా ప్రవృత్తిస్తు కలిర్ద్వాదశాబ్ద శతాత్మకః—యదా మఘాభ్యో యాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః తదా నందా ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి"—

రెండువందల" సంవత్సరములు మఘానక్షత్రమున సప్తర్షు లుండు నప్పుడు కలిలోఁ బ్రవృత్తమైనదనుటచే, మఘానక్షత్రమున సప్తర్షులుండుకాలము పరీక్షిజ్జన్మకాలము గాన నాఁటికి అనఁగా భారతయుద్ధకాలము నాఁటికి, కలియుగములోఁ "బదిరెండు వందల" సంవత్సరములు గడచినవని భాగవతకారుని తాత్పర్యమై యున్నది. ఇంకొక లెక్క—ఇది శ్రీమద్భాగవత వ్యాఖ్యాత యగు శ్రీధరాచార్యుని మతము. ఆతఁడు "ఆరభ్య భవతో జన్మ" అను శ్లోక వ్యాఖ్యలో నిటులని నాఁడు.

(1) "పదునొకండువందల పదునేను సంవత్సరము లని యేకార్ణముచే చెప్పఁబడినది. వాస్తవముచే—"పరీక్షిన్నందుల" మధ్యకాలము పదునాలుగువందల తొంబదియెనిమిది. ఎందువలన ననఁగా—పరీక్షిత్తునితో సమకాలీనుఁడై, మగధనేలుచుండిన జరాసంధ పౌత్రుఁడగు "మార్జారి" మొదలు, పురంజయాంతము, ఇరువది యిరువదిమంది రాజులు వేయివత్సరములు భూమి నేలుదు రని "నవమస్కంధము" నఁ గలదు. బార్హద్రధులు వేయిసంవత్సరము లేలినపిమ్మట "ప్రద్యోతనులు" నూట ముప్పది యెనిమిది సంవత్సరములు, శైశునాగులు మూఁడు వందల యరువది సంవత్సరములు నేలిరని యచటనే చెప్పియుండుటచేతను———పదునాలుగువందల తొంబదియెనిమిది యైనది. ఈ ప్రకారముచే నైనను కలియుగారంభమునఁ బాండవులు లేక, కలిలో (1182) పదునొకండు వందలయెనుబదిరెండు సంవత్సరములు గడచినతరువాతను,

---

(1) ఆరభ్యేతి, వర్ష సహస్రం పంచదశోత్తరం శతంచేతి కయాపివివక్షయా అవాంతరసంఖ్యేయం వస్తుతస్తు—పరీక్షిన్నందయోరంతరం ద్వాభ్యామూనం వర్షాణాం సార్ధం సహస్రం భవతి. యతఃపరీక్షిత్సమకాలం మాగధం మార్జారిమారభ్య రిపుంజయాంతాః వింశతిరాజానః సహస్రంసంవత్సరాన్ భోక్ష్యంతీత్యుక్తం నవమస్కంధే-యే బార్హద్రధభూపాలా భావ్యాస్తే సహస్రవత్సరమితి. తతః పరంచ ప్రద్యోతనా అష్టత్రింశోత్తరశతం. శైశునా [illegible] వోత్తరాన్.

పాండవు లుండినటుల స్పష్టమగుచున్నది. అయినను, పరీక్షిజ్జన్మ మొక టి నందపట్టాభిషేకము వఱకు పదునొకండు వందల పదునేను (1115) అని ఖగోళ నిరర్శనమునఁ జెప్పిన సంఖ్యయే పరమ ప్రమాణముగా నెంచవలసి యున్నది. "బార్హద్రథ భూపాలాః సహస్రవత్సరం" అను చోటున జరాసంధుని తండ్రి మొదలుకొని పురంజయాంతము వేయి వత్సరములకు నర్థము సరిపోవును. గాన "మార్జారి" మొదలు వేయి వత్సరములని యింకొక (498) నాలుగువందల తొంబది ఎనిమిది సంవత్సరములఁ గలుపనవసరము కాన్పింపదు. పై చర్చవలన క్రీ. పూ. పదునేను పదునారు శతాబ్దముల మధ్యను మహాభారతయుద్ధమై యున్నదని, "ధీరేంద్రనాథపాలు" గారితో నామత మేకీభవించుచున్నది. ఇందును గురించి లోకమాన్యతిలకు టూకీగా పదునాల్గవశతాబ్దమున యుద్ధమై యుండుననుట తాత్పర్యము—



# మహాభారత చరిత్రము



## మహాభారత రచనావిధానము

వేదములోని ఛందోనియమములను, లౌకికమునకుఁ దెచ్చిన వాఁడు 'వాల్మీకి' సంస్కృత వాఙ్మయమున నాతని రామాయణమునకుం గల "కవితావైశద్యము" మహాభారతమునకు లేదు. కాళిదాసమహాకవి సర్వవిధముల వాల్మీకి ననుసరించియే కవిత్వముఁ జెప్పెనని కవితావిమర్శకులు తలఁతురు. రామాయణములోని యుత్తరకాండ కాక తక్కిన కాండల నొక్కఁడే రచించియుండెనని, కవితాపద్ధతి వెల్లడి చేయుచున్నది. భారత మట్లు లేదు. కర్ణపర్వములోని, కర్ణవధఘట్టము కాక, మిగిలిన మహాభారత మంతయుఁ గవిత్వపు విశేషములను స్ఫురింపఁ జేయదు. లక్ష శ్లోకపరిమితి గల మహాభారత మంతయు "శతసహస్ర్యాం వై యూసిక్యాం" అనుటచే దానికి వ్యాసుఁడే కర్తయని స్థూలదృష్టికి గాన్పించును కాని సూక్ష్మదృష్టితో నాలోచించినచో, వ్యాస, వైశంపాయన, సౌతి, యను వారలు, జయభారత మహాభారతములను గ్రంథములుఁ జేసిరనియు, వ్యాసుని "జయ"మును వైశంపాయనుఁడు వ్యాస, వైశంపాయనుల గ్రంథములను, సౌతియుఁ దమ గ్రంథములలోఁ గలిపివేసి, యేది వ్యాసకృతమో, యేది వైశంపాయనకృతమో, యేది సౌతి, కృతమో తెలియకుండఁగఁ జేసిరనియు, విశదము కాఁగలదు. ఇందులకు మహాభారతముననే, నిదర్శనములు కలవు. మనకుఁ గాన్పించు మహాభారతము గాక, వ్యాసుని శిష్యులగు "సుమంతుఁడు, జైమిని, పై[illegible], శుకుఁడు, వైశంపాయనుఁడు" గూడ మహాభారతసంహితలఁ జేసిరని యీ క్రింది శ్లోకార్థములు చెప్పుచున్నవి.

(1) వ్యాసుఁడు—వేదములను, భారతమును "సుమంతుఁడు, జైమిని, పైలుఁడు, శుకుఁడు, వైశంపాయనుఁడు" అను నైదుగురు శిష్యులచేఁ జదివించెను. వా రైదుగురు నైదు భారతసంహితలఁ బ్రకాశింపఁ జేసిరి.

మఱియు క్రీ. పూ. నాలవశతాబ్ద ప్రాంతమున నుండెనని తలఁపఁబడు "ఆశ్వలాయనుఁడు" తన గృహ్యసూత్రములలో భారత మహాభారత గ్రంథములు వేఱుగా నుండెననియు, "సుమంతా"ది వ్యాస శిష్యులు భారతగ్రంథకర్తలనియుఁ జెప్పుచున్నాఁడు. చూడుఁడు.

(2) సుమంతుఁడు, జైమిని, వైశంపాయనుఁడు, పైలుఁడు, సూత్రభాష్య భారత మహాభారత ధర్మాచార్యులు—

"జయ" మనునది వ్యాసకృతమనుట కారంభశ్లోకమె (3)సాక్ష్యము. ఈజయశబ్ద మచటచట సూచించియున్నాఁడు. (4) సుమంతు, పైలాదుల భారతము లిపుడంతర్హితములైనవి. జైమిని భారతములోని యశ్వమేధపర్వమె నిలిచియున్నది. "వైశంపాయనకృత" మను భారతమె నేఁడు మనచేఁ బఠింపఁబడుచున్నదఁట. నేఁడు కాన్పించు మహాభారతములోనె "వ్యాస, వైశంపాయన, సౌతి" కృతి భాగములున్నవని వ్రాసియుంటిని. కవిత్రయకృత సంస్కృతమహాభారతము నాంధ్రీకరించు

---

(1) వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్ సుమంతుం జైమినిం పైలం శుకం చైవ స్వమాత్మజం॥ ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయనమేవచ సంహితాస్తైః పృథక్త్వేన భారతస్యప్రకాశితాః. ఆదిపర్వం ౬౩—౯౦

(3) సుమంతు జైమిని వైశంపాయన పైల సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యాః ఆ. గృ. ౩—౪—౪

(3) నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం, దేవీం సరస్వతీం వ్యాసస్తతోజయ ముదీరయేత్.

(4) జయో[illegible] ౫ అధ్యా.

టనోఁ గూడ కవిత్రయసంబంధమె కలుగుట యాశ్చర్యకరము. ఆంధ్రీకృత మహాభారతములోని కవిత్రయభాగములను విభజించి నట్టులు సంస్కృతమహాభారతము లోని వ్యాస వైశంపాయనాదులభాగములను విభజింపలేము. కారణ మేమనఁగా వ్యాసునిజయమును, వైశంపాయనుఁడు తాను రచించుభారతమున కనువగునట్టుల మధ్యమధ్యను జేర్చుకొనినాఁడు. అట్టులనే సౌతి, వ్యాసుని జయముతోఁ మిశ్రితమైన వైశంపాయన భారతమును తన మహాభారతములోఁ జేర్చుకొనినాఁడు. అందువలన వ్యాస, వైశంపాయనుల "జయభారతముల"ను విభజింప శక్యము కాకున్నది. కాని, సౌతి శౌనకాదులకును వైశంపాయన జనమేజయులకునునైన ప్రశ్నోత్తరములు మాత్రము వ్యాసునిజయములోనివి కావని, సూక్ష్మముగాఁ జెప్పవచ్చును. ఆశ్వలాయనుని కాలమునకు (క్రీ. పూ. 4శతాబ్ద ప్రాంతము) వ్యాసుని జయము కానుండినను, భారత మహాభారతములుమాత్రము వేర్వేఱుగనుండినట్టులనాతనిగృహ్యసూత్రమె సాక్ష్యమిచ్చుచున్నది. క్రీ. శ. నాలవశతాబ్దమునకు, జయ భారత మహాభారతము లిప్పటివలె కలిసియేకరూపముగా లక్షశ్లోకపరిమితి కలవిగా నున్నవని క్రీ. శ. (౫౩౩) సంవత్సరపు "గుప్త" శాసనముచే నూహింపఁబడుచున్నది. ఆ "శిలాశాసనము" యొక్క సంపూర్ణప్రతిబింబమును పురాతనపుశాసనశోధకులు ప్రకటించియున్నారు. మఱియు "భాసమహాకవి" నాఁటికి నేఁటి భారతరూపమేర్పడియె యుండునని యాతని నాటకములె సాక్ష్యమిచ్చుచున్నవి. ఆమహాకవిభారతములోని "వనపర్వము" నుండి శల్యపర్వాంతము వఱకు నుండినగాథ "నాఱు" నాటకములనుగా రచించియున్నాఁడు (1) మధ్యమవ్యాయోగము. ఇది పాండవు లరణ్యమున నుండఁగ భీమఘటోత్కచులకుఁ జరిగినగాథ. మఱియు నాదిపర్వములోని ఘటోత్కచజన్మాదికమును, సభాపర్వములోని ద్యూతవిజితులగు పాండవులు వనవాసమున కేఁగుటయును సూచించుచున్నది. (2) పంచరాత్రము ఇది పాండవు లజ్ఞాతవాసమున

నుండునప్పుడైన, కీచకవధ, గోగ్రహణము, అభిమన్యు వివాహాదికము మొదలగు వానిని సూచించుచున్నది. (3) దూతవాక్యము ఇది శ్రీకృష్ణరాయబారముఁ జెప్పుచున్నది. (4) దూతఘటోత్కచము. ఇది భీష్మపర్వాదిగాథను సూచించుచున్నది. (5) కర్ణభారము. ఇది యరణ్యపర్వాంతగాథనుఁ గర్ణపర్వగాథతోఁ గలిపి చెప్పుచున్నది. (6) ఊరుభంగము ఇది శల్యపర్వాంతగాథనుఁ జెప్పుచున్నది. మఱియు "బాలచరితము" అను నింకొక నాటకమునుం భాసమహాకవి రచించియుండెను. ఆనాటకగాథ, హరివంశములోని గోపికలను బాలకృష్ణునకు నైన కథలఁగూడఁ జెప్పుచున్నది గాన, హరివంశము కూడ భాసునినాటికిఁ గలిగి యున్నదని స్పష్టమగుచున్నది. అయితే భాసుఁడెప్పటివాఁడు? కాళిదాసు కూడ మాళవికాగ్నిమిత్రమునందు భాసునిఁ దలఁచుటచే నంతకుఁ బూర్వుఁడు. స్వప్నవాసవదత్త నాటకపు పీఠికలో, శ్రీ. గణపతిశాస్త్రులవారు భాసుఁడు చాణక్యునికంటెఁ గూడ ప్రాచీనుఁడని వ్రాసియున్నారు. కారణమేమనఁగా భాసునినాటకములోని శ్లోకమొకటి "కౌటిల్యుని" (చాణక్యుని) యర్థశాస్త్రమున "నుల్లిఖింపఁబడి" యున్నదఁట. కౌటిల్యుఁ డచట నిది యన్యుని శ్లోకమని సూచించియున్నాఁడఁట. కాన కౌటిల్యుఁడు భాసుని నాటకములోని శ్లోకమునే యుదాహరించి యుండునని, గణపతిశాస్త్రులవారి యభిప్రాయమై యున్నది. మఱియు భాసుని ప్రయోగములలోఁ గొన్ని "పాణిని" విరుద్ధములుగా నున్నవి గాన భాసుఁడు పాణినికంటె గూడ పూర్వుఁడని కొందఱందురు గాని క్రీ. పూ. 7 శతాబ్దప్రాంతమున నుండిన "ఉదయనుని" గాథను భాసుఁడు నాటకముగా రచించియుండుటచేఁ "బాణిని" కంటె భాసుఁడు పూర్వుఁడనుటకు వీలులేదు కాని, చాణక్యుని కంటెఁ బూర్వుఁడై క్రీ. పూ. 5 శతాబ్ద ప్రాంతమున నుండిన నుండవచ్చును. నాటికి భాంత మహాభారతగాథలు వెవ్వేఱుగ నుండెనను నుండవచ్చును. వ్యాసుని భారతము సాక్షి

కథావృత్తాంతము వలెనే యని ముందు వ్రాయఁబోవు నాపద్ధతిలోని భారతిగాథనే భాసుఁడాఱునాటకములనుగా రచించి, మహాభారతములోని గాథను గూడ నాటకమునుగా రచించియుండె ననుటకుఁ గాను తదంతర్గత మగు యెన్నఁబడు హరివంశగాథను "బాలచరితము" నుగా రచించియుండును. లోకమాన్యతిలకు, భాసుఁడు కాళిదాసునికంటెఁ బూర్వుఁడై నైనను క్రీ. శ. 1, 2 శతాబ్దములనాఁటివాఁడై యగునని తలఁచుచున్నాఁడు. గణపతిశాస్త్రులవారి శ్లోకదృష్టాంత పూర్వక మగు సిద్ధాంతము, లోకమాన్యుని తలఁపుకంటెఁ బ్రమాణము. క్రీ. శ. నాలవశతాబ్దములోని గుప్తరాజులనాఁటికి, లక్ష శ్లోకపరిమితి గల భారతముండుటయు ఆశ్వలాయన, భాసమహాకవులనాఁటికి, భారత, మహాభారతగ్రంథములు వేఱుగ నుండుటయు నిశ్చయ మని నాతలఁపు. వ్యాసుఁడు లెప్పుడు జయాదులను రచించెను? వారి గ్రంథముల సాద్యంతము లెచట నెటులనై యుండునని? అనుదానిని గుఱించి విమర్శింతము.

వ్యాసుఁడు భారతయుద్ధమైన నగుననఁగా, ధృతరాష్ట్రుని కడకు వచ్చి, మహాభారతావృత్తములను వర్ణించి యుద్ధము ఘోరముగ తప్పక యగుననియు, అందు కౌరవులు నశింతురనియు, వారికీర్తిని గ్రంథరూపముతో లోకమున వ్యాపింపఁ జేతునని యుఁ జెప్పి, యుద్ధవృత్తాంతములఁ జెప్పుటకు సంజయుని నియోగించి హిమాలయారణ్యమున కేగెను. అతఁడచట మూఁడేండ్లు భారతమును రచించెననియు, అవి (8800) యెనిమిదివేల యెనిమిదివందల శ్లోకము లుండుననియు భేదింప శక్యము కాకుండు ననియు నీక్రింది శ్లోకార్థములు చెప్పుచున్నవి.

(1) కృష్ణద్వైపాయనుఁడు మూఁడేండ్లుదీక్షకలవాఁడై యీమహా

---

(1) త్రిభిర్వర్షైస్సదోత్థాయీ కృష్ణద్వైపాయనోమునిః। మహాభారత మాఖ్యానం కృతవానిద ముత్తమం (ఆదిపర్వం. ౬౨—౫౨)

భారతమును సప్రభాగముగ సాఖ్యానమునుఁ జేసియున్నాఁడు—(ఇది వైశంపాయనవాక్యము)

(1) వ్యాసుఁడు గూఢముగ గ్రంథగ్రంథినిఁ గుతూహలముతో; దేనినిఁ బ్రతిజ్ఞ చేసెనో దానిఁ జేసెను—

(ఆగ్రంథము) ఎనిమిదివేల యెనిమిదివందల శ్లోకములు కలది. దీనిని నేనెఱుఁగుదును. శుకుఁడెఱుఁగును. సంజయుఁ డెఱుఁగునో యెఱుఁగఁడో, ఆశ్లోకకూటము లిప్పుడును సుదృఢముగా గ్రథితమై యున్నది సుమా, శౌనకా అవి గూఢములగుటచేతను ప్రశ్రితములగుటచేతను, అర్థమునకు భేదింప శక్యము కాకున్నది. (ఇది సౌతి శౌనకునితోఁ జెప్పిన వాక్యము.) ఎనిమిదివేల ఎనిమిదివందల శ్లోకములు వ్యాసకృతములగుట సత్యము. వానిని నేఁటి యాంధ్రదేశపుఁ బండితులు వ్యాసఘట్టము లని యు గూఢార్థయుక్తములనియుఁ దలఁతురు. సౌతి కాలమున కవి, వైశంపాయన భారతమునం దిమిడియున్నవి. వాని నేఁ డెఱుఁగుదును. శుకుఁడెఱుఁగు నేఁటి. సంజయుఁడెఱుఁగునో యెఱుఁగఁడో యని సౌతి చెప్పుచున్నాఁడు. సౌతి యీ మహాభారతము నుపాఖ్యానములతో లక్ష శ్లోకపరిమితి కలదనియు, నుపాఖ్యానములు లేని యిరువదినాలుగువేల శ్లోకపరిమితి కలదానిని (వ్యాసుఁడు) చేసియున్నాఁడనియు, ఉపాఖ్యానరహితమైనది భారతమనియు, పిమ్మట నధికమగు నర్థశతాశ్లోకములతోఁ దాఁ జేసిన గ్రంథమున కనుక్రమణికఁ జేసియున్నాఁడనియు నీ క్రింది శ్లోకతాత్పర్యములచేఁ దెలియనగును.

---

(1) గ్రంథగ్రంథిం తదాచక్రే మునిర్గూఢం కుతూహలాత్। యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ మునిర్ద్వైపాయనస్త్విదం। అష్టౌ శ్లోకసహస్రాణి అష్టౌ శ్లోకశతాని చ। అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వా న వా। తచ్ఛ్లోకకూటమద్యాపి గ్రథితం సుదృఢం మునే। భేత్తుం న శక్యతేఽర్థస్య గూఢత్వాత్ప్రశ్రితస్య చ॥—ఆదిపర్వం. అనుక్రమణికాధ్యాయం—

(1) ఈపుణ్యమైన నూఱువేల శ్లోకములుగల భారత మహాఖ్యానములతోఁ గూడినదని తెలిసికొనవలయును. ఉపాఖ్యానరహితముగ నిరువదినాలుగు వేల భారతసంహితనుఁ జేసియుండెను. (వైశంపాయనుఁడు కావచ్చును) అది భారతమని చెప్పఁబడుచున్నది. తరువాత నా వ్యాసుఁ డేబది శ్లోకము లధికముగ సంక్షేపముగ (అనుక్రమణికను) చేసెను.

ఇప్పుడు మనకుఁ గాన్పించు ముద్రితభారతప్రతులు నాకుఁ దెలిసినంతవఱకు నాలుగున్నవి. నేను చూచుచున్న ప్రతులనే - యనేకవ్య విరుద్ధపాఠము లుండుట యాశ్చర్యకరముగ నున్నది కొన్ని ప్రతులలో గాథ లేమాఱియుండుట మఱియు నాశ్చర్యకరముగ నున్నది. ఒక ప్రతిలో ద్రౌపదీస్వయంవరమై - వివాహమైనపిమ్మటఁ గర్ణాదులు హస్తినాపురమునుండి పాంచాలపురముపైకి (భీష్మాదులకుఁ దెలియకుండఁగ) యుద్ధమునకు రాఁగా భీమార్జునులు విజృంభించుటయు నర్జునుఁడు, కర్ణుని కుమారు నొకని సైంధవపుత్రు నొకనిఁ జంపఁ దక్కినవారు పరుగిడి హస్తిపురికిఁ జేరుటయు వర్ణింపఁబడి యున్నది. ఇది యాంధ్రీకృతమహాభారతమునఁ గాని తెనుఁగున ముద్రింపఁబడిన సంస్కృతమహాభారతమునఁ గాని కాన్పింపదు. కుంభకోణమునందు, టి. ఆర్. కృష్ణమాచార్యునిచే ముద్రింపఁబడిన సంస్కృతమహాభారతము ఆదిపర్వము 218 అధ్యాయముఁ జూచిన నీవింత విశదము కాఁగలదు—

నేఁటికాలమున జర్మనీదేశీయులు నానాదేశ సంస్కృతభారత ప్రతులను శోధించి "యాదిసభా" పర్వములను నవీనముగ ముద్రించిరఁట.

---

(1) ఇదం శతసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్యకర్మణాం ఉపాఖ్యానైస్సహ జ్ఞేయం శ్రావ్యం భారతముత్తమం చతుర్వింశతి సాహస్రీం చక్రే భారతసంహితాం ఉపాఖ్యానైర్వినా తావద్భారతం ప్రోచ్యతే బుధైః॥ తతోఽధ్యర్ధశతం భూయః సంక్షేపం కృతవానృషిః॥ అనుక్రమణికాధ్యాయం

పూనా, లోని "రామకృష్ణభాండర్కారు" గారి యాధిపత్యమున భరత ఖండపు నానాభాగకోశములను శోధింపఁబడి "విరాటపర్వము" ముద్రింపఁబడినదఁట. రవీంద్రనాథఠాకూరుగారి "విశ్వభారతి" విశ్వవిద్యాలయమున, నానాదేశకోశములను సేకరించి "డాక్టర్ వింటర్నిట్జు" గారి యాధిపత్యమున మహాభారతము శోధింపఁబడుచున్నది. "విజయనగరము"న సమీపముగ నుద్భవించిన "భారతతీర్థ" పరిషత్తువారును మహాభారతశోధనకుఁ గడంగుసూచనలు కాన్పించుచున్నవి. నేఁడు ముద్రింపఁబడిన మహాభారతప్రతులలో "టి. ఆర్. కృష్ణమాచారిగారి" కుంభకోణపుప్రతియు, కలకత్తాలో ముద్రింపఁబడిన "ప్రతాపచంద్రరాయి" గారి ప్రతియు, ఆంధ్రాక్షరములతో నేఁటి కేబదినాలుగేండ్లకుఁ బూర్వము, "సి. వేంకటసుబ్బాశాస్త్రుల వారిచే" ముద్రింపఁబడినప్రతియుఁ జూడఁగ నొకదానితో నొకటి సమానము గాకున్నవి.

పర్వసంగ్రహాధ్యాయమునం "దేపర్వమున" నెన్ని యధ్యాయము లుండునో చెప్పఁబడియున్నది. ఆప్రకార మాదిపర్వమునందు రెండు వందల యిరువదియేడధ్యాయము లుండవలసి యుండఁగా కుంభకోణపుఁ బ్రతిలోని యాదిపర్వము 260 అధ్యాయములును, కలకత్తా ప్రతిలోని యాదిపర్వము 236 అధ్యాయములును ఆంధ్రాక్షరపుఁ బ్రతిలోని యాదిపర్వము 234 అధ్యాయములును, కలిగియుండుట యాశ్చర్యముఁ బుట్టించుచున్నది. నేను చూచిన ప్రాతఁ ప్రతు లాంధ్రాక్షరపుఁ బ్రతులకు సరిపోవుచున్నవి. ఆంధ్రాక్షరముద్రితప్రతియందు, నాలాయన్యుపాఖ్యానము రెండధ్యాయములును, సుభద్రాపరిణయగాథ నాలుగధ్యాయములును పర్వాంతమందు, ప్రక్షిప్తమని కూర్పఁబడినది. నీలకంఠాచార్యులీనూరధ్యాయములను "జైమిని భారతము" లోనివని వ్యాఖ్యానముఁ జేయలేదఁట. ఏపర్వ మెన్నియధ్యాయములు కలిగి యుండెనో యీభారతరచనా చరిత్రలో వ్రాసిన పట్టికఁ జూచిన విశదము కాఁగలదు. ఇటులు నేఁడుగల కాళిదాసుని కాలమునకే భారతము

చింకరవంకరగా నుండెననియు, దానినాతఁడు దిద్దఁ బ్రయత్నించె నని
యు నేదియొ విఘ్నము కలిగెనపిదప నొకకథకలదు. ఆకారణముచే దీక్షి
తుఁడై జర్మని, పూనా, వంగదేశీయులు ప్రయత్నించుచున్నారు. "భార
తీతీర్థు" లోక యుపన్యాసమిచ్చిరి కాని భవిష్యత్కార్య క్రమ
మునందా కార్యముఁ గుఱించిన సూచన కానరాకున్నది. జర్మనిదేశీ
యులు కాకుండినను, భారతీయులందరైన నొకటిగ మహాభారతజిజ్ఞాసు
వులై పనిఁ జేసిన బాగుండును.

నేఁటి మహాభారతములో నేదివ్యాసకృతమో? యేది వైశం
పాయనకృతమో యేది సౌతికృతమో చెప్పలేము కాని, యీ క్రింది
శ్లోకార్థము భారతాదిని గుఱించి సూచించుచున్నది.

(1) కొందఱు "మను" అను చోటునుండి భారతప్రారంభమనిరి.
మఱికొందఱు "ఆస్తికాది" భారతారంభమనిరి. అట్లే మఱికొందఱు
"ఉపరిచర వసువు" మొదలనిరి.

పైని చెప్పఁబడిన యర్థముగల శ్లోకము కొన్నివ్రాతప్రతులలోఁగాన్పిం
పకున్నది. ఇది సంస్కృతకవిత్రయకృతములోనిదై యుండదు. కారణమే
మనఁగా, భారతకవులలోఁగడపటివాఁడగు "సౌతి"కి భారతారంభ మెచట
నుండియైనదో తెలియకపోదు. అట్టిసౌతి చేసిన శ్లోకమే యిదియైనచో
"కేచిచ్ఛబ్దము" నుపయోగింపఁడు. అయినను, జయ, భారత, మహాభా
రతములను, గ్రంథములు మూఁడుకలవనియు, మూఁడు గ్రంథములకు
మూఁడారంభములు కలవనియుఁ దెలిసికొనుట కీశ్లోకముపయోగపడు
చున్నది. దీని ననుసరించి యారంభముఁ గనుగొందము. "మను"
అను శబ్దముతోఁ గాని, మన్వాదిప్రారంభముతోఁ గాని యాదిపర్వము

(1) మన్వాది భారతంకేచి దాస్తికాది తథాపరే
తథోపరిచరాద్యన్యే విప్రాస్సమ్యగధీయతే. ఆదిపర్వం 1-52

వంశేయాఖ్యానము ప్రారంభింపబడలేదు. టి. ఆర్. కృష్ణమాచార్యులుగారి ప్రతిలో వారీశ్లోకమునకు వ్యాఖ్యానముఁజేయుచు "మను" శబ్దమునకు "మంత్ర" మర్థమనియు "నారాయణ" శబ్దము, అష్టాక్షరీ మంత్రనిర్దేశకము గాన "నారాయణం నమస్కృత్య" యను ప్రారంభ శ్లోకమునుండియే భారతసంజ్ఞ కలదనియు వ్రాసియున్నారు. ఇదియుక్తియుక్తముగ నున్నది. ఆదిపర్వము 75వ అధ్యాయారంభమునందు "ప్రజాపతేస్తుదక్షస్యమనోర్వైవస్వతస్యచ" అని కలదు. కాని, దక్షప్రజాపతి వంశారంభము "మన్వాది" వృత్తాంతమన వీలులేదు కాన "నారాయణ" శబ్దముతో ప్రారంభింపఁబడినదానికే "మన్వాది" భారతమనుట యుక్తము. ఇది సౌతిభారతమున కగును. ఆస్తీకాదిగాఁగల యధ్యాయము లేదు కాని "ఆస్తీక" పర్వమనునది, యాదిపర్వాంతర్గతమై, పదమూఁడవ యధ్యాయమునఁ బ్రారంభింపఁబడుచున్నది. ఇది "వైశంపాయన" భారతమున కారంభమగును. కారణమేమనఁగా వైశంపాయనుఁడు జనమేజయునకు భారతముఁ జెప్పుటకుఁ గలకథాబీజము "యాస్తీక" పర్వముననే కలిగియున్నది. ఇది యిరువదినాలుగు వేల శ్లోకముల మితికలదై యుండునని యిదివఱకే వ్రాసియున్నాను. కొన్ని ప్రతులలో ననుక్రమణికాధ్యాయమునందీ క్రింది యర్థముగల శ్లోకము కలదు. సౌతి చెన భారతము లక్షశ్లోకముల మితికలదనియు, మనుష్యలోకమున వైశంపాయనుఁడే భారతముఁ జెప్పియుండెననియు నాశ్లోకము సూచించుచున్నది. (1) వైశంపాయనభారతములో నితిహాసములుండవు. "ఉపరిచర" నుండి ప్రారంభింపఁబడినది వ్యాసభారతమగును. దానికే "జయ" మని పేరు. ఇది యాదిపర్వమునం "దరువదిమూఁడవ" యధ్యాయమునుండి ప్రారంభమగుచున్నది. వ్యాసుఁడు గ్రంథరచనకు

(1) అస్మింస్తు మానుషేలోకే వైశంపాయన ఉక్తవాన్
[illegible] అనుక్రమణికాధ్యాయః.

ముందు తనవృత్తాంతముఁ జెప్పుకొనుట యుక్తమై యున్నది గాన వ్యాసుఁడు తన మాతామహుఁడగు "నుపరిచర" వసుపుగాథనే యారంభించి చెప్పియున్నాఁడు. వ్యాసగ్రంథము కేవల కౌరవ పాండవచరిత్రామాత్రమయి యెనిమిదివేల యెనిమిదివందల శ్లోకములు కలదిగా నుండెను. వ్యాసభారతము "కాణ్వ" వేదము స్వరయుక్తము సంహితా స్వరూపము గద్యపద్యాత్మకమై కృష్ణయజుర్వేదము వలెనుండక శ్లోకసంఖ్యాయుత మగుటచే వేదమునందుండు "ననుష్టుప్" ఛందోరూపముగా నుండును. వేదమున కుండునట్టుల ననుక్రమణికా యుక్తముగా నుండును. అనుక్రమణికం దెలిసికొంటిమేని వ్యాసకృత భారతాంశములు లభింపఁగలవు. అనుక్రమణికాధ్యాయమునందుండు "తతోధ్యర్ధశతం భూయః" అను శ్లోకములోని "అధ్యర్ధశతం" అను పదమునకు నూటయేఁబది శ్లోకము లని పెక్కండ్రర్థము చేయుచున్నారు. కాని యనుక్రమణికాధ్యాయము రెండువందల యెనుబది శ్లోకములు కలిగి యున్నది. వివిధశ్లోక నిబద్ధమై యున్నది. అనుక్రమణిక లట్టుల నుండవు. అనుక్రమణికాధ్యాయమునం దాదిని "శుక, శౌనకా" దులకును సౌతికి జరిగిన యుత్తర ప్రత్యుత్తరములతోఁ దొంబదినాలుగు శ్లోకములును శేషించిన నూటముప్పదిమూఁడు శ్లోకములలోను నూటయెనిమిది శ్లోకములు ధృతరాష్ట్ర పరివేదనము, సంజయునోదార్పననుగాథగాను పోఁగా డెబ్బదియెనిమిది శ్లోకములే మిగిలియున్నవి. కడను ముప్పదినాలుగు శ్లోకములలో సౌతి భారతపఠన శ్రవణములచే నగు ఫలముఁ జెప్పియుండుటచే నలువదినాలుగు శ్లోకములే యనుక్రమణిక కావలసియుండును. కాని వ్యాఖ్యాత, అనుక్రమణికాధ్యాయములోని 79 మొదలు 89 వఱకుఁగల శ్లోకములు కొన్నిప్రతులలో లేవనుచున్నాఁడు. నాకును గొన్ని వ్రాతప్రతులలో నాశ్లోకములు కాన్పింపలేదు. పై కారణము ...

కాధ్యాయము "ఆదిపర్వము" లోని ప్రథమాధ్యాయము కాదనియు, అది సౌతి మహాభారతమునకు ననుక్రమణికాధ్యాయ మనియు విశద మగును. మఱియు "అధ్యర్ధశత" శబ్దమునకు నూటయేఁబదియను నర్థముగ నంటె నిదివరకుఁ జెప్పిన గ్రంథమున కధికముగా నర్ధశతము, (50) అనునర్థము పొసఁగియున్నది గాన, నేఁబది శ్లోకములచేతనే "యనుక్రమణికను" వ్యాసుఁడు రచించె ననుట యుక్తమగును. అట్టి యధ్యాయ మెచటనైనఁ గలదా? కలదు. ఆదిపర్వములోని యిరువదియొకటవ యధ్యాయ మట్టిదియే ఆయధ్యాయమునకుఁ గథాసంక్షేపాధ్యాయ మని పేరు. దానియందు యేఁబదియారు శ్లోకములున్నవి. మొదటి మైదుశ్లోకములును, వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పిన వాక్యములు. కడపటిశ్లోకముకూడ వైశంపాయనునిదేను. నడుమనుండిన యేఁబదిశ్లోకములలో భారతేతిహాసము నిరూపింపఁబడినది. కడపటిశ్లోకము నందీ యనుక్రమణికాధ్యాయములోని గాథకు "జయ" మను పేరుగలదని చెప్పఁబడినది (1) ఆయధ్యాయమే "యనుక్రమణికాధ్యాయ" మనికూడ యిరువదిరెండవ యధ్యాయము పదిరెండవశ్లోకమునందు చెప్పఁబడియున్నది (2) ఆయిరువదియొకటవ యధ్యాయమునగల కథను మూలరహితముగ వ్రాసెదను.

పాండవు లరణ్యమునం దండ్రి మృతినొందిన పిమ్మటను హస్తిపురికివచ్చి స్వల్పకాలములోనె వేదమునందును ధనుర్వేదమునందును విద్వాంసులైరి. వీర్యసంపన్నులును "పౌర" సమ్మతులునగు పాండవులఁజూచి కౌరవులు సహింపరైరి. పిమ్మటను దుర్యోధనుఁడు కర్ణ

(1) ఏవమేతత్పురావృత్తం తేషామక్లిష్టకర్మణాం
శ్రేవోరాజ్యవినాశాయజయశ్చజయతాంవర. ఆది. ౬౧—౫౬.

(2) ...నాంకురుమహారాజగపుణోయమనుక్రమః
...ఆది. ౬౨—౧౨

శకుని సహితుఁడై పాండవుల కనేకాపకారములఁ జేయఁ బ్రారంభించెను. దుర్యోధనుఁడు "కణికుని" మతము ననుసరించి రాజ్యమునకుఁగాను పాండవులఁ బీడించెను. భీమున కన్నమున విషముఁ బెట్టించెను. విషము భీముని బాధింపలేదు. నిద్రపోవుచున్న భీముని నీటిలోఁ ద్రోయించెను. కాని భీముఁడు కట్టులఁ ద్రెంచుకొని నీటినుండి వెడలివచ్చెను. నిద్రఁబోవుచున్న భీముని పాములచేఁ గఱపించెను. కాని విషమెక్కలేదు. దుర్యోధనాదులు పాండవులకుఁ జేయు నపకారము లన్నిటియందును బుద్ధిమంతుఁడగు విదురుఁడు పాండవులకుఁ దోడ్పడుచు నాయపకారములు వారికి రాకుండఁగఁ బ్రతిక్రియలఁ జేయుచుండెను. స్వర్గమునొందినవారికెట్లు దేవేంద్రుఁడు సుఖముఁ గలుఁగఁజేయునో విదురుఁ డట్లు నిత్యము, బహిరంగముగాను, రహస్యముగాను, పాండవులకగు నపకారములనుండి రక్షించుచుండెను. పిమ్మటను దుర్యోధనుఁడు ధృతరాష్ట్రు ననుజ్ఞఁగొని వారణావతమున లక్కయింటిఁ గట్టించెను. ధృతరాష్ట్రుఁడు సులహితముగోరి పాండవులను వారణావతమునకంపెను. పాండవులు హస్తినాపురమునుండి వారణావతమునకు వచ్చిరి. అప్పుడును విదురుఁడు పాండవులకు నుపదేశములఁ జేయుచునేయుండెను. పాండవులు ధృతరాష్ట్రాజ్ఞ ననుసరించి వారణావతమున లక్కయింటను, "పురోచనుని"చే రక్షింపఁబడుచు నొకసంవత్సరముండిరి. ఆకాలముననే విదురోపదేశముచే లక్కయింటి నడుమనుండి వెలుపలకు "సొరంగముఁ" ద్రవ్వుకొనిలక్కయింటికి నగ్గిపెట్టి పురోచను నందుదహించి భయముచే నరణ్యమునకుఁబరుగిడిరి. ధార్తరాష్ట్రులచేభయపడి వనమునఁబఱుగిడు పాండవులు హిడింబావనముఁజొచ్చిరి. అట భీముఁడు హిడింబుంజంపి వానిచెలియలు హిడింబను పెండ్లియాడెను. ఆమెయందు ఘటోత్కచుఁడు పుట్టెను. పిమ్మట బ్రాహ్మణవేషధారులై వేదముఁజదువుకొనుచుఁ దల్లితోఁగూడ "ఏకచక్ర"పురమునఁ గొంతకాలముండిరి. అచట మనుష్యభక్షకుఁడగు

"బకాసురుని" భీముఁడు చంపి యేకచక్రపురవాసుల నోదార్చెను. అన
టనే ద్రౌపదీస్వయంవర వృత్తాంతమును విని పాంచాలనగరమున కేఁగి
ద్రౌపదినొంది సంవత్సరమునకుఁ బైగా ద్రుపదపురమున నుండిరి. అపుడు
హాస్తిపురి కీవృత్తాంతము తెలియఁజేయఁబడి పాండవులు తిరిగి హాస్తి
పురికివచ్చిరి. అపుడు భీష్మ ధృతరాష్ట్రులు సోదరులతో విరోధము
మీఁదుండరాదని పాండవులకుఁ జెప్పి మీరు సుఖముగ రాజ్యముఁజేయు
టకు "ఖాండవప్రస్థరాజ్యము" తగినదని యాలోచించితిమిగాన మీరచ్చ
టికేఁబోయి రాజ్యముఁజేయుఁడనఁగా వారచటికిఁ దమసుహృజ్జనులతో
నేగిరి. ఆపట్టణమునం దనేకవత్సరములు రాజ్యముఁ జేసిరి. శత్రురాజుల
నోడించుచు మిత్రులను సంతోషపెట్టుచు ధర్మముగ పాండవులు
రాజ్యముఁజేసిరి. ఆకాలమున భీముఁడు తూర్పుదిక్కును జయించెను.
ఉత్తరపు దిక్కు నర్జునుఁడును, పడమటిదిక్కును నకులుఁడును, దక్షి
ణమును సహదేవుఁడును జయించిరి. పిమ్మట నొకకారణముచే ధర్మ
రాజు సంవత్సరముపై నొకమాస మర్జును వనవాసమున నుండఁ
బంపెను. (ఇట నాంధ్రీకృతభారత మొకయేడని చెప్పుచుండగా సంస్కృ
తభారతము పదమూఁడు మాసములని యొకచోటను, పన్నెండేండ్లని
రెండుచోటులను నర్జున తీర్థయాత్రకాలముఁ జెప్పుట చర్చనీయాంశము)
అపుడర్జునుఁడు ద్వారవతికేఁగి శ్రీకృష్ణుని చెలియలు సుభద్రనుఁ బెండ్లి
యాడెను. పిమ్మట నర్జునుఁడు శ్రీకృష్ణునిఁగూడి ఖాండవవనము నగ్ని
కర్పించెను. అగ్ని యర్జునునకు గాండీవమను ధనుస్సును, అక్షయ
తూణీరములను, కపిధ్వజయుక్తమగు దివ్యరథమును నిచ్చెను. ఆయగ్ని
పాలు గాకుండగ "మయుఁ" డను రాక్షసుని రక్షించుటచే నాతఁడు
రత్నమయ మగు సభనుఁజేసి పాండవుల కర్పించెను. ఆసభను జూచి
దుర్మార్గుఁడగు దుర్యోధనుఁడు లోభబుద్ధికలవాఁడై శకునితో ధర్మరాజు

జూదమాడునట్లుఁ జేసి. పాచికలచేతనే ధర్మరాజును వంచించి, పాం

డవులు పదిరెండేండ్లు వనమునందును నొకయేడజ్ఞాతముగను నుండునటులఁజేసెను. పాండవు లటులఁజేసి పదునాలవయేట తమ భాగముఁ గోరి దుర్యోధనునుండి భాగము నొందలేకపోవుటచే యుద్ధమైనది. అందు శత్రువులను దుర్యోధనుని పాండవులు చంపి రాజ్యము నొందిరి. (1) పిమ్మట వారు హయమేధాది క్రతువులను జేసిరి. తరువాతను, ధృతరాష్ట్రుఁడు, విదురుఁడు, మృతినొందిరి. పిమ్మట (పాండవులు) యుద్ధమృతుల భార్యలను స్వర్గము నొందించిరి. పిమ్మటఁ గృష్ణుఁడు వైకుంఠమున కేఁగఁగా నతని భార్యలఁ గోలుపోయి పాండవులు మహాప్రస్థానికముఁజేసి స్వర్గమునొందిరి. ఇదియే రాజ్యనాశనమునకైన భేదము—"జయ" మనునదియు—

పై వ్యాసుని మూలగాథానుక్రమణికలో మహాభారత గాథాంకురములున్నవి. కాని మహాభారత యుద్ధమైన ముప్పది యారేండ్లకైన కృష్ణనిర్యాణ మహాప్రస్థానిక గాథలు పదునేను, లేక పదునెనిమిది సంవత్సరములకైన యుద్ధమృతుల భార్యలు స్వర్గగతులగుట ధృతరాష్ట్రాదుల నిర్యాణము మొదలగునవి. యుద్ధానంతరము మూఁడేండ్లకు రచింపఁబడిన వ్యాసుని గ్రంథమున నెటుల వ్రాయఁబడెను? కాని "సౌతి" యొక్క యనుక్రమణికాధ్యాయమునందు వ్యాసుఁడు "జయ" మును రచించి యెటులీగ్రంథమును లోకమునఁ బ్రకాశింపఁ జేయుదునని యాలోచింపుచుండఁగా బ్రహ్మ ప్రత్యక్షమై గణేశునిచే నీగ్రంథమును వ్రాయించి లోకమునఁ బ్రకాశింపఁజేయుమనుటయు వ్యాసుఁడటులఁజేసి శుకాదులచేఁ జదివించిన పిమ్మటను వైశంపాయనుఁడు

---

(1) నేటికి డెబ్బదిసంవత్సరములకుఁ బూర్వము కర్నాటకపటాలపుసుబేదారు, పట్టాభిరామయ్య కాశీలో నిరువురు పండితులచే ప్రాచీనపు కాకితములపై వ్రాయించిన భారతపు ప్రతిలో పాండవులు రాజ్యము నొందువరకే యాయధ్యాయమున్నది. పన్నయ లెనిగింపఁకూడ [illegible]

భూమిపై వ్యాపింపఁజేయుటయు ననువృత్తాంతము కాన్పించుచున్నది. పైకారణముచే, నొకవేళ వ్యాసుఁడు జయమును యుద్ధానంతరము మూఁడేండ్లకు రచించినను శిష్యులకుఁ జెప్పునాఁటికి పాండవులు గతించుటచేఁ బాండవనిర్యాణగాథనుఁ గూడ జయముయొక్క చివరను జేర్చియుండును. కొందఱు పాశ్చాత్యవిమర్శకులు "ధృతరాష్ట్రాదులు" వనమున కేఁగునాఁటికిఁ బరీక్షిత్తు తల్లికడనుండిన బాలుఁడగుటచే యుద్ధానంతరము మూఁడేండ్లకే ధృతరాష్ట్రాదులు గతించియుండురనియు పిమ్మట స్వల్పకాలమునకే యాదవ పాండవులు స్వర్గమున కేఁగియుందురనియు వ్రాసియున్నారు. ఆప్రకారముచేనైనను వ్యాసుఁడు పాండవనిర్యాణమును జయములో వ్రాసియుంచుటవిరుద్ధము కాదు. ఆదిపర్వపు మొదటియధ్యాయమునఁ గూడ సౌతి ధృతరాష్ట్రాదులు మృతినొందిన తరువాతనే వ్యాసుఁడు భారతమును లోకములోఁ బ్రకటించినట్లుఁ జెప్పు నీక్రింది శ్లోకార్థములు గమనింపఁదగి యున్నవి.

(1) వ్యాసుఁడు పూర్వకాలమునందు తల్లియొక్కయు భీష్మునియొక్కయు ననుమతినొంది, విచిత్రవీర్యుని భార్యలయందు త్రేతాగ్నులఁబోలు ధృతరాష్ట్రాదుల ముత్పాదింపఁగని పిమ్మటను తపస్సుకొఱకు నాశ్రమమున కేఁగెను. ఆధృతరాష్ట్రాదులు పుట్టి పెఱిగి పెద్దవారై మృతినొందినపిమ్మటను భారతమునుఁ జేసి మనుష్యలోకమునఁ బ్రకటిం

(1) మాతుర్నియోగాద్ధర్మాత్మా గాంగేయస్య చధీమతః। క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా. త్రీనగ్నీవ కౌరవ్యాన్ జనయామాస వీర్యవాన్। ఉత్పాద్య ధృతరాష్ట్రంచ పాండుం విదురమేవచ జగామ తపసే ధీమాన్ పునరేవాశ్రమంప్రతి. తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాంగతిం। అబ్రవీద్భారతం లోకే మానుషేస్మిన్మహానృషిః.........విస్తరం కురువంశస్య గాంధార్యా ధర్మశీలతాం। క్షత్తుః ప్రజ్ఞాం ధృతిం కుంత్యాః సమ్యగ్ద్వైపాయనోబ్రవీత్। వాసుదేవస్య మాహాత్మ్యం పాండవానాంచ సత్యతాం। దుర్వృత్తం ధార్తరాష్ట్రాణాం ముక్తవాన్ భగవానృషిః.
ఆదిపర్వం ౧. అధ్యా

చేసు........కురువంశముయొక్క విస్తరమును, గాంధారియొక్క ధర్మశీలతయు, విదురుని ప్రజ్ఞయు, కుంతియొక్క ధైర్యము, బాగుగఁ జెప్పెను. వాసుదేవుని మాహాత్మ్యము, పాండవుల సత్యత్వము, ధార్తరాష్ట్రుల దుర్వృత్తమును వ్యాసుఁడు చెప్పెను—(వాసుదేవ మాహాత్మ్యము హరివంశములోనిది) పై శ్లోకార్థములచే ధృతరాష్ట్రాదులు మృతినొందినపిమ్మటనే వ్యాసుఁడు "జయము"ను బ్రకటించి యుండుటను గాన యుద్ధానంతరగాథలుకూడ జయములో నిముడియుండుట యాశ్చర్యముకాదు. కాని పాండవులకుఁ బితామహుఁ డగు వ్యాసుఁడు పాండవుల మరణానంతరమునఁ గూడ నుండునా యను పెద్ద సందియ మొకటి చాలమందిని బాధించును. నాఁడే కాక నేఁడును, ముమ్మనుమలు పెద్దలగువఱకు జీవించినవారును మనుమలు బిడ్డలఁగని యేఁబదేండ్లువచ్చి స్వర్గస్థులైనపిమ్మట జీవించుతాతలను, అవ్వలనుఁ గూడఁజూచుచుంటిమి గాన, దీర్ఘాయుర్దాయమునకుఁ బుట్టినిల్లగు భరతఖండమునందు, యోగశక్తిచేతను నింద్రియజయముచేతను వ్యాసుఁడంతదీర్ఘకాలము జీవించి యుండెననుటలో నతిశయోక్తి లేదు. స్వర్గారోహణపర్వమునందును వ్యాసవిరచిత భాగముండుటచేతనె దానియందును, (1) "ఇది జయమను నితిహాసము" అను నర్థముగల శ్లోకమున్నది. పైనివ్రాసిన "వ్యాసగ్రంథానుక్రమణిక" యందు కొన్ని విచిత్రములు కాన్పించును. చూడుఁడు. బక, హిడింబ వధలవంటి చిన్న యుద్ధములనుగుఱించి వ్రాసియు, కిమ్మీర. కీచక, జటాయువధలు, అంగారపర్ణు నర్జునుఁడోడించుట, నివాతకవచ, కాలకేయాదియుద్ధములు, పెద్దవగు దక్షిణోత్తరగోగ్రహణములు వర్ణింపలేదు. భీమాదులునాలుగు దిక్కులజయించినపిమ్మటనే ఖాండవదహనము చెప్పఁబడినది. రాజసూయయాగముయొక్క కైరై [illegible] ము — తూర్పుదిక్కును

(1) "జయో నామేతిహాసోఽయం" స్వర్గారోహణపర్వం

జయించెననుటలో "జరాసంధ" వధయు, పాండవులజ్ఞాతవాసానంతరము తమరాజ్యము నడిగిరనుటలో, సంజయ కృష్ణ రాయబారములు నిమిడియున్నవి ద్రౌపదీ వస్త్రాపహరణాదికము కించిత్తైనను సూచింపలేదు. యుద్ధమై దుర్యోధనాదులు మృతి నొందిరనియే కాని మహాయుద్ధ వివర మెంతమాత్రము చెప్పలేదు. యుద్ధమృతుల భార్యలు స్వర్గము నొందిగను స్వల్పాంశముఁ జెప్పు వ్యాసుఁడు ముఖ్యములగు ద్రౌపదీ పరిభవమును గాని ఉత్తర దక్షిణ గోగ్రహణములఁగాని చెప్పకపోవుటకుఁ గారణ మేమైయుండును? వ్యాసకృత జయమున నీగాథలు వ్రాయఁబడి యుండలేదేమో? ప్రతిపర్వమునందలి యధ్యాయముల సంఖ్య మాత్రమె గాక శ్లోకసంఖ్య కూడ "పర్వానుక్రమణికాధ్యాయము" నం జెప్పినట్లులు కాన్పింపదు. అన్నిపర్వముల శ్లోకసంఖ్యను బరిశీలించిన తిలకు మహాశయునకు కలకత్తాప్రతి ననుసరించి 99 వేల శ్లోకములు కాన్పించినవి. నూఱువేలలో నొకవేయిమాత్రము కొదువ. మఱికొందఱు పాశ్చాత్యులు నూటయేడు వేలశ్లోకములనిరి కుంభకోణపుఁబ్రతినిగాని, ఆంధ్రలిపిలోఁ గూడిన భారతమునుఁగాని, లెక్కించినచో నూఱువేలకుమించియుండును. చిన్నపర్వమగు సభాపర్వములోని శ్లోకములను లెక్కింపగ పర్వానుక్రమణిక ననుసరించి 2511 శ్లోకములుండుటకుమాఱుగ 2709 శ్లోకము లాంధ్రదేశపుప్రతిలో నాకుఁ గాన్పించినవి. పెక్కు కారణములచే నాలోచింపఁగా "వ్యాస, వైశంపాయన, సౌతి" యను వారలేగాక తదితరులును గొన్ని శ్లోకములచేగాక కథలను, అధ్యాయములఁగూడ దృశ్యమాన మహాభారతమున నిమిడ్చియున్నారని యనుభవముచే వ్రాయ సాహసించుచున్నాను. కాని కొందఱు తలఁచినట్టుల నవి [illegible] మాత్రము చెప్ప లేను.

వెవ్వేఱుదేశప్రతుల ననుసరించిన యధ్యాయ సంఖ్యాపట్టిక నిచట వ్రాసియున్నాను. చూడుఁడు.

| * పర్వములు | అనుక్రమణికలోఁ జెప్పబడిన అధ్యాయములు | వ్రాఁతప్రతి ననుసరించి యధ్యాయసంఖ్య | చెన్నపురి ప్రతి | బొంబాయిప్రతి | కలకత్తా ప్రతి |
|---|---|---|---|---|---|
| ఆదిపర్వం | 227 | 236 | 240 | 260 | 236 |
| సభాపర్వం | 70 | 80 | 80 | 103 | 80 |
| వనపర్వం | 269 | 312 | 314 | 315 | 314 |
| విరాటపర్వం | 67 | 70 | 72 | 76 | 72 |
| ఉద్యోగపర్వం | 186 | 199 | 197 | 196 | 197 |
| భీష్మపర్వం | 117 | 120 | 124 | 122 | 114 |
| ద్రోణపర్వం | 170 | 203 | 203 | 203 | 204 |
| కర్ణపర్వం | 69 | 96 | 97 | 101 | 96 |
| శల్యపర్వం | 69 | 73 | 66 | 66 | 65 |
| సౌప్తికపర్వం | 18 | 19 | 18 | 18 | 18 |
| స్త్రీపర్వం | 27 | 19 | 27 | 27 | 27 |
| శాంతిపర్వం | 339 | 366 | 366 | 375 | 365 |
| అనుశాసనికపర్వం | 146 | 168 | 168 | 274 | 168 |
| అశ్వమేధపర్వం | 103 | 62 | 92 | 113 | 92 |
| ఆశ్రమవాసపర్వం | 42 | 39 | 39 | 41 | 39 |
| మౌసలపర్వం | 8 | 8 | 8 | 9 | 8 |
| మహాప్రస్థానికపర్వం | 3 | 3 | 3 | 3 | 3 |
| స్వర్గారోహణపర్వం | 5 | 6 | 6 | 6 | 6 |
| మొత్తం | 1935 | 2079 | 2120 | 2313 | 2104 |

* వ్రాఁతప్రతి డెబ్బదిసం॥ ములకుముందు కాశిలో వ్రాయించినది. ఇది "దొడ్డిపేట" లోని "భాగవతుల లక్ష్మీపతిసోమయాజులుగారు" నాకెఱువిచ్చిరి. చెన్నపురి ప్రతి. తెనుఁగున ముద్రింపఁబడిన ప్రతి. బొంబాయిప్రతి. T. R కృష్ణమాచార్యులవారిది. కలకత్తాప్రతి, ప్రతాపచంద్రరాయిగారిది—

పైపట్టికలో నన్నిచ్చటికన్న బొంబాయిప్రతిలో ననుక్రమణి కాధ్యాయమునఁ జెప్పఁబడినదానికంటె మూఁడువందల డెబ్బదియెనిమిది యధ్యాయములు హెచ్చుగనున్నవి. వ్రాతప్రతియందు నూటనలుబదినాలు గధ్యాయములుమాత్రమె హెచ్చుగనున్నవి. అనుక్రమణికాధ్యాయములోని యానుశాసనిక పర్వాధ్యాయములు నూటనలువదిమూఁడై యుండఁగా బొంబాయిప్రతిలో రెండువందలడెబ్బదినాలుగై యున్నవి. నూటయిరువదియెనిమిది హెచ్చైయున్నవి. అనేక చిన్న చిన్న గాథలుఁ కూడ యాంధ్రీకృత భారతములోను, ఆంధ్రలిపిగల సంస్కృత భారతములోను లేనివి బొంబాయి ప్రతిలోఁ గాన్పించుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానినిట వివరింపలేదు. వ్యాసుఁడు మొదట వ్రాసిన జయము వ్రాత ప్రతిలో నుండినటుల యుద్ధాంతము వఱకే యైయుండు ననుటకింకొక నిదర్శనము కాన్పించుచున్నది. భాగవతము కూడ వ్యాసకృతమను నైతిహ్యము కలదు. అది నేఁడు కాన్పించు భాగవతము కాకున్నమానె, భక్తిబీజముగునదియై స్వల్పపరివ్యాప్తిగల గ్రంథమై యుండునని తలఁపవలసియున్నది. భారతమునకువలె కాలాంతరమున నాగ్రంథము "శుకా" కులచే వ్యాప్తి నొందింపఁబడియున్నది. ఆభాగవతములో నారదోపదేశముచే భాగవతముఁ జేయుఁదలఁచుకొని, వ్యాసుఁడు సౌప్తికపర్వమునందలి యశ్వత్థామార్జున యుద్ధాంత గాథనే ప్రారంభించియుండుటచేతను వ్యాసకృత జయము మొదటనంత వఱకె రచింపఁబడి లోకమునందు వ్యాప్తి నొందించునాటికి స్వర్గారోహణ పర్వాంతగాథలఁ గూడ మొదటి "జయ" మునకు ననుబంధముగాఁ జేసియున్నాఁడని స్పష్టమగుచున్నది. (1) వైశంపాయనుఁడు

(1) కాశీవ్రాతప్రతియు, నన్న యాంధ్రీకరణమునకుపయుక్తమగు నాఁటి వ్రాత ప్రతియు నేనూహించిన యనుక్రమణికాధ్యాయములోని గాథయు సౌప్తికపర్వాంతమైయుండెను. సౌప్తికపర్వాంతగాథయె, వ్యాసకృతమగు మొదటిజయము. అదియె భాగవతారంభము.

జనమేజయునకుఁ జెప్పిన గ్రంథము వాల్మీకిరామాయణము వలె నిరువది నాలుగువేల శ్లోకములు గలదై ఉపాఖ్యాన రహితమై కేవల కురుపాండవ చరిత్రము మాత్రమే గలదై యున్నది. అదియే భారతము. ఆభారతము, పాండవులు స్వర్గతులగునాఁటికి ముప్పదియాఱు (36) సంవత్సరముల యీడుకలవాఁడై పట్టాభిషేకము నొంది యఱువది (60) సంవత్సరములు రాజ్యముఁ జేసి తక్షకవిషముచేఁ జచ్చిన పరీక్షిత్తునకుఁ గుమారుఁడగు జనమేజయుఁడు, "శంకుకర్ణ, శతానీకుల"ను కుమారులను, "అశ్వమేధదత్తు" అను మనుమనిఁ గనినపిమ్మట, సర్పయాగముఁ జేయుచుఁ గారణాంతరముచే నది విఘ్నమైనపుడు "వైశంపాయనుఁడు" జనమేజయునకుఁ జెప్పినది. పరీక్షిత్తు భారతయుద్ధానంతరము తొంబదియాఱు (96) సంవత్సరములకు మృతినొందెను. అప్పటికి జనమేజయుఁడు తండ్రిమృతినిఁగూడ గుఱుతెఱుఁగని బాలుఁడు. అతఁడు మనుమల నెత్తునాఁటికి యఱువది (60) సంవత్సరములైన నుండును. అప్పుడే వైశంపాయనుఁడు భారతముఁ జెప్పియుండుటచే యుద్ధానంతరము లేక వ్యాసుఁడు భారతమును రచించినపిమ్మటను నూటయేఁబది (150) సంవత్సరములకు వైశంపాయన భారతము చెప్పఁబడియున్నదని దృఢముగఁ జెప్పవచ్చును. అపుడు "సౌతి" యీ భారతమును వినియున్నాఁడు. తానచటినుండి తీర్థయాత్రలఁ గావించుకొని శౌనకాదుల సత్రయాగమునకువచ్చి మహాభారతమునంతయుఁ జెప్పియున్నాఁడట. సౌతి, వైశంపాయనుఁడొకసారి జనమేజయునకు భారతమును వినిపించినంతమాత్రముననె యిరువదినాలుగువేల (24000) గ్రంథమును కంఠపాఠముఁ జేయలేఁడు గాన దానినింకొక పదియేండ్లలో, నేర్చి శౌనకాదులకుఁ జెప్పియుండెననవచ్చును. అందువలన సౌతియొక్క మహాభారతము వ్యాసుఁడు "జయముఁ" జేసినతరువాతను రమారమి నూటడెబ్బది (170)

ఇదివఱలోఁ జెప్పఁబడినరీతిని వ్యాసునిజయము, ఆదిపర్వములోని యఱువదిరెండవ యధ్యాయము మొదలయి యుండినను దానంతరాధ్యాయములన్నియు వ్యాసకృతములని తలఁపరాదు. జయమును వైశంపాయనుఁడు జనమేజయునకు వినిపించుచుండగా జయములోని సూక్ష్మగాథను జనమేజయుఁ డడిగినప్రశ్నలపై పెంచి వైశంపాయనుఁడు చెప్పవలసి వచ్చుచుండెడిది. వ్యాసుని రచనాపద్ధతిని సూక్ష్మముగాఁ బరిశీలించినచో నంశావతరణ పర్వములోని యఱువదిమూఁడవ యధ్యాయమునకుఁ బిమ్మటనే యిరువది ముప్పది శ్లోకముల లోనో ధృతరాష్ట్రాద్యుత్పత్తిగాథనుఁ జెప్పి సంభవపర్వములోని నూట యిరువదియాఱవ యధ్యాయము చెప్పవలసియున్నది కాని జనమేజయుని కూలంకష ప్రశ్నలచే నఱువది యధ్యాయములకుఁ బైఁబడిన గాథ పెరిగినది. ఆయఱువదికిఁ బైఁబడిన యధ్యాయగాథలోను సౌతికృత కల్పనలేకాక సౌతికిఁ బిమ్మటనగు గాథలుకూడఁ గూర్పఁబడెనని నూటయిరువది రెండవ యధ్యాయగాథచే నూహించుచున్నాను. ఆగాథయిది. ఉద్దాలకుని కుమారుఁడగు శ్వేతకేతువు తనతల్లి నొక బ్రాహ్మణుఁడు పుత్రార్థియై కామింపఁ దానినిఁ జూచి సహింపక వివాహ నిబంధన నేర్పఱచె ననునది. ఇది పాండురాజు కుంతితోఁ జెప్పినటులనున్నది. నిజమునకీగాథ సౌతికిఁబిమ్మటనై యున్నది. కారణమేమనఁగా శ్వేతకేతువు ఉద్దాలకునికుమారుఁడు. ఉద్దాలకుఁడు వశి యను పేరుగలిగి మిథిలరాజ్యము నేలుచున్న జనకునిసభలో యాజ్ఞవల్క్యునితో వేదాంతచర్చఁ జేసి యోడినఋషి. యాజ్ఞవల్క్యుఁడు జనమేజయునకు భారతమును వినిపించిన వైశంపాయనుని శిష్యుఁడు. యాజ్ఞవల్క్యున నుద్దాలకునితో వాదము జరుగునాఁటికి జనమేజయుఁడుకూడ స్వర్గస్థుఁడై యుండెనని యుద్దాలకుఁడు యాజ్ఞవల్క్య నడిగినపుడే లాహ్యాయని భుజ్యుఁడు [illegible] (చూడుఁడు,

బృహదారణ్యకోపనిషత్తును) అట్టియుద్దాలకుని పుత్రుగాథను అనఁగా పాండురాజు గతించినపిమ్మటను సుమారు రెండువందలయేఁబది యేండ్లకైన గాథను పాండురాజు కుంతితోఁ జెప్పినటుల సంభవపర్వములోని మాట యిరువదిరెండవ యధ్యాయమున నుండుట యసంభవముగా నున్నది ఈ శ్వేతకేతుని గాథ జనమేజయుని మరణానంతరముకూడ యైయుండును. అందువలన వ్యాస వైశంపాయనుల జయ భారతము లలోనిది మాత్రమేకాక సౌతియొక్క మహాభారతములోనిదికూడ కాదని తలఁతును. ఇది మాత్రమే కాదు శ్వేతకేతుపు కుమారుని గాథకూడ శాంతిపర్వములో నుండుటచే జనమేజయుఁడు గతించిన పిమ్మటను నూరేండ్లకైన గాథలుకూడ మహాభారతమునఁ జూర్పఁ బడినవని వ్రాయ సాహసించుచున్నాను. డాక్టరు "బూలరు" గారు ఆపస్తంబధర్మసూత్రముల కింగ్లీషు భాషాంతరీకరణముఁ జేసియున్నారు. వారాపస్తంబ హారీత శ్వేతకేతులు సమకాలీనులనియు ఆపస్తంబుఁడు క్రీ. పూ. నాలవశతాబ్దపు వాఁడనియుఁ వ్రాసియున్నారుకాని శాకటాయనునిచేతను పాణినిచేతనుఁ దమవ్యాకరణములలో నుచ్చరింపఁబడిన యాపస్తంబుఁడును ఉపనిషత్తులలోఁ జెప్పఁబడిన శ్వేతకేతు హారీతులును క్రీ. పూ. నాలవశతాబ్దపువారని చెప్పుటకు వీలులేదు. కాని జనమేజయునకుఁ బిమ్మటివారు. అట్టివారిలోని శ్వేతకేతుపుయొక్క గాథను పాండురాజు కుంతికిఁ జెప్పుటయు, శ్వేతకేతుపుత్రుని గాథను భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పుటయు వ్యాస వైశంపాయన సౌతి కృతి జయ భారత మహాభారతములకంటెఁ గూడ కొన్నిగాథ లీదృశ్యమాన మహాభారతమున నిమిడియున్నవని స్పష్టముగఁ జెప్పవచ్చును దృశ్యమాన మహాభారతము సందర్భశుద్ధి లేకుండఁగనూడ కొన్నిచోటులఁ గూర్పఁబడినదని వ్రాసినందులకుఁ దజ్ఞులు సం 2 తుమింతురుగాక.— ఇందులకు రెండుమూఁడు విధముల ముఖ్యకారణము వ్రాయుచున్నాను.

పాండురాజు శతశృంగపర్వతమున మృతినొందఁగా మాద్రి పాండురాజుతో జితాగ్ని నొంది మృతినొందినదని ఆదిపర్వముయొక్క ౧౨౫వ అధ్యాయమున వర్ణింపఁబడినది. కాని ౧౨౬ అధ్యాయమున మాద్రీపాండుల శరీరములు హస్తినాపురికిఁ గొనిరాఁబడి విదురాధిపత్యమున నచట దహింపఁబడినట్లు వర్ణింపఁబడియున్నది. నన్నయభట్టుఁ డీసందర్భము దగ్గరనే యుండుటఁ జూచి కాఁబోలు మాద్రీపాండుల యంగములు కొనిరాఁబడి హస్తిపురిలో విదురాధిపత్యమున సంస్కరింపఁబడినవని వ్రాసియున్నాఁడు.

ఇంకొకటి—ఆదిపర్వమునఁ గర్ణుఁడు సద్యోగర్భ జనితుఁడుగా వర్ణింపఁబడినాఁడు ఆగాథ యచట నిష్పష్టముగాఁ జెప్పఁబడియున్నది అరణ్యపర్వాంతమున జనమేజయు ప్రశ్నకు వైశంపాయనుఁడు కర్ణవృత్తాంతముఁ జెప్పుచుఁ గర్ణునిఁ గుంతి పదిమాసములు గూఢముగా మోసికనినదియని చెప్పియున్నాఁడు కర్ణునిగాథను నన్నయభట్టు యఱ్ఱాప్రగ్గడ కవులు యథామాతృకగానే యాంధ్రీకరించియున్నారు.

మఱియొకదానిఁ జూడుఁడు. అరణ్యపర్వమున రామాయణగాథ కలదు అందుఁ గుంభకర్ణుని లక్ష్మణస్వామి వధించినట్లుఁ గలదు. ఇది సంస్కృతము ననుసరించియే యాంధ్రీకరింపఁబడియున్నది. లక్ష్మణస్వామి కుంభకర్ణునిఁ జంపుట రామాయణగాథా ప్రతిపాదితము లగు గ్రంథములలో నెచ్చటనుఁ గానము. ఇట్టియసందర్భములు మహాభారతమునఁ బెక్కులు కలవు కాని గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. ఇంకొకటి- వ్యాసుని యనుక్రమణికాపద్ధతిఁ జూడఁగా నాతనిజయమున సభాపర్వాంతము వఱకుఁగల గాథలు విపులముగా వ్రాయఁబడి తక్కినగాథలు క్లుప్తముగా వ్రాయఁబడెనని తెలియఁబడుచున్నది. యుద్ధపంచకపుగాథలు చాలఁగ్లుప్తముగా వ్రాసినట్లుఁగలదు. భీష్మపర్వపుగాథ యీపర్వమునఁ బదమూఁడు [illegible] శ్లోకములలోనే జెప్పఁబడినది.

కాని ధృతరాష్ట్ర సంజయులకును జనమేజయ వైశంపాయనులకును
నగు నుత్తరప్రత్యుత్తరములచేఁ దక్కిన గ్రంథమంతయుఁ బెరిఁగినది.
ద్రోణపర్వపు గాథమాత్రము చిన్నచిన్నవియగు నెనిమిది యధ్యాయ
ములలోఁ జెప్పఁబడినది. తక్కినది జనమేజయాదుల ప్రశ్నోత్తరముల
చేతనే వృద్ధినొందినది. అటులనే కర్ణపర్వగాథ యఱువది శ్లోకములు
గల కర్ణపర్వపు మొదటి యధ్యాయముచేతను శల్య సౌప్తిక పర్వముల
గాథ ముప్పదియెనిమిది శ్లోకములు మాత్రమెగల శల్యపర్వపు మొదటి
యధ్యాయముచేతను జెప్పఁబడి తక్కిన గ్రంథమంతయు జనమేజయా
దుల ప్రశ్నోత్తరములచేఁ బెంపఁబడినది. భారతయుద్ధగాథ నంతయును
సూక్ష్మదృష్టితోఁ జదివినయెడల ద్రోణపర్వముననే మహాయుద్ధములు
కలవు. మీరాధివీరులు ద్రోణపర్వముననే వధింపఁబడినటుల వర్ణింపఁబడి
యున్నది. వ్యాసకృతభారతముగాఁ దలఁపఁబడు భాగములో భీష్ముఁడు
పదిదినములు సేనాధిపత్యముఁ జేసినటులఁ గలదు కాని యాతఁడు విశే
షయుద్ధముఁ జేసినటులఁ గాన్పింపదు వ్యూహములనుఁ బన్నుకొను
టతో సరిపోయియుండును. నాఁటి యుద్ధ ధర్మములు కూడ నేఁటివలె
"సదసద్యుద్ధములు" (ఎవఱుఁబడి పోరాడుట, గోతులు, వనములు,
మొదలగువానిలోఁ బొంచియుండి శత్రువులను వధించుట) కల
వని శాంతిపర్వము మనుస్మృతి కౌటిలీ యార్థశాస్త్రము కామందకము
శుక్రనీతి యను గ్రంథములలోఁ జెప్పఁబడినదానిచే నూహింపఁబడు
చున్నది. భీష్ముఁడును నటులే వ్యూహములఁ బన్నుచు పదియవనాఁ
డెపుడో యర్జున శిఖండుల బాణిఁబడి మడిసియుండును. భీష్ముఁడు శత
వృద్ధగుటచే నాతఁడు పోరుబాటున శత్రువుల కగ్గమై చనిపోవునని
దుర్యోధనుఁడు తలఁచియే యాతనిఁ గాచుచుండవలెనని పెక్కుసా
రులు చెప్పినటుల్ల, పెంపఁబడిన భీష్మపర్వమునఁ గలదు. భీష్ముని మర
ణముతో కౌరవులు [illegible] ద్రోణునకు

సైన్యాధిపత్య మిచ్చిరి. ద్రోణుఁడు పెక్కువ్యూహముల నల్లినటుల మహాభారతమునఁ గాన్పించుచున్నది కాని ద్రోణుని సైన్యాధిపత్య కాలమున నాతఁడు శకటవ్యూహమునుఁ బన్నఁగాఁ బాండవులు క్రౌంచ వ్యూహముఁ బన్నినటుల వ్యాసుని జయ మని తలఁపఁబడు మూలభార తమునఁ గలదు. ఒక్క శకటవ్యూహముచేతనే యారాత్రి యుద్ధము పూర్తియైనది. మఱియొకటి మూలభారతము సౌత్యాదులచేఁ బెంపఁబడి నటులనే వ్యాసుఁడు రచించిన కృష్ణకథగల హరివంశము నశించి యున్నది. అది యాదిపర్వముయొక్క రెండవయధ్యాయము రచింపఁ బడునాఁటికే శిథిలమైనటుల నందువర్ణింపఁబడినది. నేఁడు కాన్పించు హరి వంశము గాథోపగాథలతో నిటీవలఁ బెంపఁబడినది.

నేఁడు కాన్పించు మహాభారతములోని కొన్నిభాగములు బౌద్ధ మత విజృంభణానంతరమునను, అలగ్జాండరు దండయాత్ర చేసిన పిమ్మ టను రచింపఁబడి యున్నవని కొందరు పాశ్చాత్యవిమర్శకులు వ్రాసి యున్నారు. విశేషపాఠభేదములు కాళిదాసునాఁటికే కలిగి యుండును గాని అంతమాత్రముచే మహాభారతభాగములు గ్రీసుదేశీయుల దండ యాత్రానంతరము గూర్పఁబడెనని పాశ్చాత్యవిమర్శకులు వ్రాసినవ్రాతల కారణములచేఁ దలంప మనసుకొల్పుటలేదు. కారణమేమనఁగా (1) "ఏడూక" శబ్దము మహాభారతమున నుండుటచేతను అదిబౌద్ధ మతస్థుల యస్థికలఁ బూడ్చి దానిపైఁగట్టిన స్తూపమగుటచేతను (డాగోబా యని పాలీభాషలోని పేరు) అట్టియేడూకములు విస్తార మీ భరతఖండమునఁ గలవని మహాభారతమున రచింపఁబడుటచేతను బౌద్ధ

(1) ఏడూకా న్పూజయిష్యంతి వర్జయిష్యంతి దేవతాః......
ఏడూకచిహ్నా పృథివీ నదేవ గృహభూషితా
[illegible] యుగాంతస్య లక్షణం వనపర్వం ౧౯౦ అ.

మత విజృంభణానంతరముననే మహాభారత భాగములు కొన్ని పరిచింపఁబడెనని కొందరి తలంపై యున్నది. బౌద్ధమతధర్మములు భారతీయ సాంప్రదాయ యుక్తములగుటచేతను బౌద్ధమతమునకుఁ బూర్వముననే యేదేని యొకవిధమగు "ఏహూక" చిహ్నము లుండియుండును. తత్కాలమున గృహనిర్మాణము గుంజలపై బొంగు వెదుళ్లను వేసి యుండ్లనుఁ గట్టుచుండిరి. (1) మయునిచే ధర్మరాజునకుఁ గట్టఁబడిన సభానిర్మాణమె గోడలఁబెట్టి గృహములఁగట్టుట యారభ్యాలలో మొదలు. మహాభారతములో మయసభావర్ణనముఁ జూచినచో, గోడలు వర్ణింపఁబడిన యంశములు కాన్పించును. ద్యూతమునకుఁ గృత్రిమాలోచనముఁ జేసినపిమ్మటను ధృతరాష్ట్రుఁ డొక సభాశాలను నిర్మింపఁ జేసియున్నాఁడు. అందు స్తంభములే కాని గోడలు లేవు ఆ కాలమున నిర్మింపఁబడిన గృహకుడ్యములైనను స్తంభములను, నడుమనుంచి కట్టఁబడిన గోడలైయున్నవి. అందువలననే యసురుఁడు "ఏహూక మంతర్న్యస్త కీకసం" అనినాఁడు. అనఁగా లోపలను కొయ్యఁబెట్టి కట్టిన గోడను ఏహూకమని పేరు. కీకసశబ్దమునకుఁ గొయ్య యెముక కూడ యర్థమగును. మహాభారత రచనాకాలమునకు ధర్మజుని సభానమూనాలచే దేశమంతయుఁ గొయ్యలను నడుమనుంచిన గోడలచే రాజమందిరములు ధనికమందిరములు కట్టఁబడుచుండుటఁజూచి యాకవి దేవగృహములఁ

---

(1) ఇహైవ తిష్ఠ నిమితా తిల్విలా స్యాదిరావతీ మధ్యే తాల్పశ్య తిష్ఠ నాష్ఠత్వా ప్రాపన్నఘాయవః॥ ఋతేవ స్థూణా నధిరోహవంశో గ్రోవిరాజ న్నపసేధ శత్రూన్॥ ఏకాగ్ని మంత్రపన్నం ౨—౫

తాత్పర్యం:—ఓగుంజా! స్థిరంగాచేసిన నమ్మకలదానవై యీద్వారదేశమునఁ బాతఁబడినదానవై యుండుము. గృహమధ్యమునందుండిన నిన్ను దోషములు పొందక పోఁగాక! ఓ వెదురా! గుంజలపైనుండి ప్రకాశించుచు శత్రువులను వెళ్లగొట్టుము.

భూజింపక యేడూకములనే గౌరవించుచున్నారని వ్రాసియున్నాఁడు. ఇప్పటి కాలమున పాశ్చాత్య వాస్తుశాస్త్ర విధానముచేఁ గట్టఁబడిన మందువాకేని గృహములు బంగాళాలు ఎటుల భారతీయవాస్తుశాస్త్ర విరుద్ధములో నాఁడటుల "సంకీర్ణ్యస్త కీకసములు" గల గృహము లార్యవాస్తుశాస్త్ర గర్హితములు అందువలననే యూకవివాసిని గర్హించి యున్నాఁడు. నేఁడు కొందఱు పూర్వాచారపరులు బంగాళాలగునిండ్లను నిందించుచుండుటఁ జూచుచున్నాము. అటులనే నాఁటి వారేడూక ములను నిందించుచుండిరి. అంతర్న్యస్తకీకసభిత్తులపై గట్టిన గృహ ములు దక్షిణమండలాంధ్రులకును నైజాముராజ్య వాసులకును గ్రొత్త కావు. బౌద్ధమత విజృంభణకాలమునం దెముకలపైఁ గట్టిన గోడలకు గౌరవము హెచ్చియుండెనే కాని యేడూకము మయునిచే నారంభింపఁ బడినదే మొదలని మాత్రము నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

యవనశబ్దము పలుచోట్ల మహాభారతమున వాడఁబడుటచేఁ పాశ్చాత్యవిమర్శకులు కొందరు మహాభారతములోని కొన్ని భాగము లలెగ్జాండరు దండయాత్రను జేసినపిమ్మటనే కూర్పఁబడి యుండు నని వ్రాసి యున్నారు. కారణ మేమనఁగా గ్రీకులను యవను లని భారతీయులు పిలుచుటయు గ్రీసు దేశమునకు భారత దేశమునకు నన్యోన్య సంబంధము కలుగుటయు నలగ్జాండరు దండయాత్రతోఁడనె రాలేదు. అంతకుముందు పెక్కు శతాబ్దములక్రితమె సంబంధము కలిగియున్నది. పాణిన్యాచార్యులు క్రీ. పూ. ౭౮ శతాబ్దముల ప్రాంతపువాఁడని కొందఱును ౧౨ శతాబ్దప్రాంతపు వాఁడని మఱికొందరును పూర్వపాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు. పాణినికంటె శాకటాయనుఁడు ప్రాచీనుఁడనుటకుఁ బాణిని శాకటా యను నన్యకనామములను తన వ్యాకరణమునఁ జెప్పియుండుటయే నిదర్శనము.

అట్టి శాకటాయనుఁడు [illegible] వ్యాకరణములలోఁ బెక్కు-సారులు యవనశబ్దము నుచ్చరించియున్నారు. పాణిని శాకటాయనులచేఁ జెప్పఁబడిన యవనులనే మహాభారత గ్రంథకర్తయు దన గ్రంథమునఁ జెప్పెను, పాణిని శాకటాయన మహాభారతగ్రంథములలోఁ జెప్పఁబడిన యవనులు గ్రీసుదేశీయులా? వారిలిపి దుష్టలిపి (1) వారు ముండనమును భారతీయాచార విరుద్ధముగఁ జేయించు కొనుచున్నారు. (2) శాకటాయనుఁడు లిపిమాత్రమే చెప్పినాఁడు. పాణిని లిపిని వృత్తిని ఆచారమునుఁ గూడ చెప్పినాఁడు. మహాభారతమునఁ బెక్కుచోటుల యోధులనుఁగాఁ జెప్పఁబడిరి.

పై కారణములచే శాకటాయనాదుల కాలముననే భారతదేశీయులకుఁ బాశ్చాత్యదేశ సంబంధము కలిగియున్నదనియుఁ బ్రాచీనులు తమగ్రంథములలో సకేబియాదేశీయులనో గ్రీసుదేశీయులనో జెప్పని యున్నారనియుఁ దలంపవలసి యున్నది. పాణిని శాకటాయనులు చెప్పిన లిపి దుష్టలిపి యగుటచే నాలిపి "ఫొనిషియా" లిపియో "కీల" లిపియో యై యాయవనులు "అరబ్బులై" యుందు రని తలంచుచున్నాను. అరబ్బుల ముండనము కూడ భారతీయాచార విరుద్ధమేను. భారతదేశ "మరబ్బుల" దేశమునకు సమీపము కూడ నైయున్నది. అందువలన నరబ్బులనే యవనులని భారతీయులు వ్రాసియుందురేమో? గ్రీకులఁగూడ నిటీవల యవనులని పాశ్చాత్యులచే వ్రాయుట విరుద్ధము కాదు. పై కారణములచే "నలగ్జాండరు" వచ్చిన తరువాతను భారతభాగములలోఁ గొన్ని రచింపఁబడినవని చెప్పుటకు వీలులేదు.

---

(1) యవనయవా ల్లిపిదుష్టే॥ ౧—౩—౫౬॥ శాకటాయన వ్యాకరణం.

"ఇంద్ర వరుణ భవ శర్వ రుద్ర మృడ హిమా రణ్య యవ యవన మాతులాచార్యాణా మానుక్" ౪—౧—౪. పాణిన్యష్టాధ్యాయి.



(2) ౨-౧-౭౨ అష్టాధ్యాయియొక్క "మయూర" వ్యంసకగణముఁ జూడుఁడు

మఱియు మహాభారతమునఁ జేర్పఁబడిన విష్ణువి యవతారములలో "బుద్ధావతారము" చేర్పఁబడలేదు. (1) అందు కృష్ణావతారమునకుఁ బిమ్మటను కల్క్యవతారమె చెప్పఁబడియున్నది. శాంతిపర్వములోని భాగము లించుమించన్నియు మహాభారతకవులలోఁ గడపటివాఁడగు "సౌతి" కృత భాగములోనివె యని తలఁపఁబడుచున్నవి. ఆశాంతిపర్వమున దశావతారములలో బుద్ధావతారము పేరు లేకుండుటచే బుద్ధునకుఁ బూర్వమె మహాభారతము పూర్తిచేయఁబడి యున్నదని నానిశ్చయాభిప్రాయము. అయినను బుద్ధ ప్రతిబుద్ధ శబ్దము లచటనచట మహాభారతమునఁ గలవు. (2) కాని యవి సాంఖ్యమతోదిత పారిభాషికపదములై "జ్ఞాని" యను నర్థమును మాత్రమిచ్చు పదములై యున్నవి. బుద్ధునకుఁ బూర్వమె మహాభారతము రచింపఁబడి యుండును కాని, షడ్దర్శనములలోని, యోగసాంఖ్య దర్శనములు నిరుక్తము అథర్వవేదము మఱికొన్ని నిఘంటువులు మాత్రము నాఁటికి రచింపఁబడియుండె ననిమాత్రము శాంతిపర్వములోని ౩౦౭ యధ్యాయముచేఁ దెలియవచ్చుచున్నది.

---

(1) "హంసః కూర్మశ్చ మత్స్యశ్చ ప్రాదుర్భావా ద్విజోత్తమ
వారాహో నరసింహశ్చ వామనో రామ ఏవచ"
రామో దాశరథిశ్చైవ సాత్వతః కల్కిరేవచ॥ ౩౪౦ అధ్యా శాంతిపర్వం

(2) బుద్ధ మప్రతిబుద్ధత్వా ద్బుధ్యమానంచ తత్వతః
బుధ్యమానంచ బుద్ధంచ ప్రాహుర్యోగనిదర్శనం॥ ౩౦౭ అధ్యా శాంతిపర్వం
ప్రాదుర్భావాశ్చ కథితా భవిష్యా ఇహయే యథా
తత్ర యే పురుషాశ్చాన్యే తాః పంచేంద్రియ వివర్జితాః
ప్రతిబుద్ధాశ్చ తేసర్వే భక్తాశ్చ పురుషోత్తమం

తేప్రయాంతి సదాదేవం తైస్సార్థం రమతేనృప॥ ౩౪౪ అధ్యా శాంతిపర్వం

ద్గీతలోఁగూడ రాజకీయములు కూర్పఁబడియేయున్నవని కొందఱు తలచుచున్నారు. లేనియెడల—

♦ చచ్చినచో స్వర్గమును నొందుదువు జయించినచో భూమి నేలుదువు కాన యుద్ధముఁ జేయఁ గృతనిశ్చయుండవై లెమ్ము—

అని శ్రీకృష్ణుఁ డర్జునున కుపదేశించుట యెటులు తటస్థించునం దురు. రాజకీయపురుషలక్షణము లీక్రిందివిధముగా నుండును. అందు శ్రీకృష్ణున కన్వయించు గుణములఁ దజ్ఞులు గమనింతురుగాక.

రాజకీయధురంధరునకు స్వపక్షవిజయము పరపక్షాపజయమే ప్రధానము. అందు ధర్మము ప్రధానము వాక్కులలో అప్రధానము చేతలలో సామాద్యుపాయము లవసరము ననుసరించి తాఱుమాఱు కావచ్చును. పరపక్షాధర్మమును గోరంతదానిని కొండంతగాను, స్వపక్షాధర్మమును కొండంతదానిని గోరంతగాను లేక, తమయం దెంతమాత్ర "మధర్మము" లేదనియు, లోకమునకుఁ జాటించి శత్రుపక్షమునకు దౌర్బల్యమును గలిగించును—వేయునేల రాజకీయపురుషుఁడన "సమయజ్ఞుఁ" డని చెప్పవలయును. ఇట్టి రాజకీయలక్షణములు వేదకాలము నుండి నేఁటివరకు సమస్తరాజపురుషులలోను నించుమించు ప్రతిఫలించుచున్నవి. అవి సర్వాంగోపేతమై శ్రీకృష్ణునిలో నిండియున్నవి. శ్రీకృష్ణుఁడు రాజకీయపురుషాగ్రేసరుఁడు. అతఁడు రాజకీయధురంధరాగ్రేసరుఁడనుటకంటె రాజకీయధురంధరాగ్రేసర ప్రపితామహుఁడనికాని రాజకీయపురుష వంశవృక్షమునకు మూలమనికాని చెప్పుటయుక్తము. శ్రీకృష్ణుని రాజకీయలక్షణములు మహాభారతమున సంపూర్ణముగ ద్యోతకమగును. అట్టి రాజకీయధురంధరాగ్రసరుని సహాయము

♦ శ్లో॥ హతోవా ప్రాప్యసేస్వర్గం జిత్వావా భోక్ష్యసేమహీం.
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥



భగవద్గీత॥ 2 అధ్యా॥

చేతనె పాండవులకు విజయములభించినది. లేనియెడల భీష్ముఁడు చెప్పినటుల నాతఁడొక్క ధనుస్సుచేతనె పాండవులఁ జయించియుండును. * భీష్మ ద్రోణ విదుర సంజయులకు ధర్మజార్జునులకు శ్రీకృష్ణుని రాజకీయపరిజ్ఞానము బాగుగఁదెలియును. భీష్మాదులీసంగతిని దుర్యోధనునకుఁ బెక్కుసారులు తెల్పిరి. కాని నేఁటికాలమునఁ గేవలము ధనబలమునేనమ్మి మోసపోయిన "జర్మనీ కైసరు" వలె దుర్యోధనుఁడు కేవలసైన్యబలాధిక్యతనే నమ్మి మోసపోయియున్నాఁడు. కృష్ణుని ప్రజ్ఞదెలిసిన యర్జునుఁడు శస్త్రాస్త్రములఁబట్టని కృష్ణుని యాలోచనా సాహాయ్యమునే కోరియున్నాఁడు. మహాభారతము ననుసరించి పాండవులకు బలరామకృష్ణులతోఁ బ్రథమసమాగమము ద్రౌపదీస్వయంవరకాలమునఁ గలిగినది. అప్పుడే కృష్ణునిమనస్సు పాండవపక్షమైనది. శ్రీమద్భాగవత విష్ణుపురాణములలోఁ గృష్ణుఁడు కంసునిజంపి మధురాపురికిఁ జేరునాఁటికే పాండవులు పితృవియోగమునొంది హస్తిపురికిఁ జేరఁగా దుర్యోధనుఁడు వారిం బాధించుచుండినటులను దానిని గృష్ణుఁడు తెలిసికొని యుద్ధవుని ధృతరాష్ట్రునికడకంపి పాండవులఁ గాపాడ సందేశమునంపినటులఁ గలదు. మఱియు విష్ణుపురాణములో ధృతరాష్ట్రుఁడు పాండవులను వారణావతమునకుఁ బంపఁగా దుర్యోధనుఁడు చటఁ బాండవులకుఁ జేయఁబోవు నపకారములనుండి కాపాడ బలరామకృష్ణులు వారణావతమునకుఁ బోయిరి కాని సత్రాజిత్తును శతధన్వుఁడు చంపెనను వార్తనువిని పాండవులకేసాహాయ్యముఁ జేయలేక ద్వారకకు వెంటనేపోయిరనియుఁ గలదు. ద్రౌపదీస్వయంవరము నాఁటికి యాదవులకేఁగాక సమస్తరాజలోకమునకును శ్రీకృష్ణునందాదరముకలదు. కనుకనే మత్స్యయంత్రముఁ గొట్టఁ బాండవులకనుజ్ఞనీయకపోఁగా యాదవులాతనిమాట ననుసరించి మత్స్యయం



* భీష్మపర్వ॥ 120 అధ్యా॥

త్రమునఁగొట్టకపోవుటయు * శల్యకర్ణులు భీమార్జునులచేఁ బరాజయమునొందగా సుయోధనాదులు భీమాదులవృత్తాంతముఁ దెలిసికొననోర శ్రీకృష్ణుఁడు వలదన నాతని మాట నాదరించి మానుటయుఁ గలిగినది.

♦ ద్రౌపది నర్జునుఁడు కుంభకారకుటీరమునకుఁ దీసికొనిపోయిన వెంటనే కృష్ణుఁడు బలరామునితోనచటికేఁగి తమ్ము నెఱిఁగించుకొనెను. పాండవులింకను ద్రౌపదినిఁ బెండ్లి నాడకుండుటచేతను వివాహవిధానమెటులగునోయనితలఁచికాఁబోలు శ్రీకృష్ణుఁడు మారాక యేరికిఁ దెలియరాదని యున్నతోరహస్యముగానె తమశిబిరమునకుఁ జేరియున్నాఁడు.

ద్రౌపదీవివాహకాలమున కనేకబహుమానములఁ బాండవులకంపియుఁ బిమ్మటఁ దాను ద్రుపదపురమునకు వచ్చియుఁ బాండవులతోఁ గృష్ణుఁడు దృఢమైత్రిఁ గలిపియున్నాఁడు. పాండవులతో నిటులు మైత్రికలిగించుకొనుటకుఁ గల కారణము నాఁటికాలమునఁ దమ్ము మిగులబాధించు జరాసంధుని దాడుల నరికట్టుమార్గములకై యుండునని తలఁపవలసియుండును. జరాసంధుఁ డెటులఁదలఁచియుండెనోకాని యాదవ పాంచాల పాండవుల కలయిక హస్తిపురిలోని రాజకీయవేత్తలకుఁ గురుదేశోపద్రవకర మీ మిత్రమండలి (ట్రిపిల్ ఎల్లయన్సు) కూడికయని భీతిం బుట్టించెను. ఈమిత్రమండలి నెటులు సమాధానపరుపవలయు నను వితర్కము భీష్మాదులకుఁ గలిగెను. తుద కర్ధరాజ్యముఁ బాండవులకిచ్చి సమాధానపఱచిరి. ఆయర్ధరాజ్యప్రధానము స్థూలదృష్టిచేఁ బాండవులకు లాభకారిగాఁ గాన్పించును గాని ధృతరాష్ట్రుఁ డింద్రప్రస్థరాజ్యము శత్రుమండలమున నంటియుండుటచేఁ బాండవులు ప్రబలారిరణములచేఁ జత్తురనియే దలఁచియుండెను.

---

* ఆదిపర్వ॥ 189, 190 అధ్యా॥



♦ ఆదిపర్వ॥ 191 అధ్యా॥

అందువలన నేకాంబోలు అర్జునుఁడుండుటచే మాకింద్రాదులవలనఁగూడ భయముకలుగదని యర్థరాజ్యము నిచ్చువప్పాడనినాఁడు. అట్టి పరిస్థితియే కలిగినది. ఖాండవవన మింద్రప్రస్థము నంటియుండెను. అందు "తక్షక, అశ్వసేన, మయా" ద్యనార్యవీరులు కలరు. శ్రీకృష్ణసహాయముచే నర్జునుఁడు తక్షకాశ్వసేనులఁ బారఁద్రోలి మయుని లోఁబఱుచుకొనెను. శ్రీకృష్ణసహాయము లేకుండిన నర్జునుఁడు ఖాండవవన దహనముఁ జేసియుండలేఁడు. కృష్ణుఁడు పాండవులతో దృఢసంబంధము కలిగియుండుటకుఁదన చెలియలి సుభద్ర నర్జునునకుఁ బెండ్లిసేయించెను. ఆవివాహము కూడదని నాఁడు బలరామాదులును శాస్త్రవిరుద్ధమని పిమ్మట పూర్వమీమాంసాశాస్త్రజ్ఞులును వాదించి యెట్టులనో సమాధానపడిరి. శ్రీకృష్ణుఁడు ధర్మరాజుచే రాజసూయయాగముఁ జేయించి వారిపలుకుబడియు నైశ్వర్యము నభివృద్ధినొందించెను. ఈరాజసూయయాగమున జరాసంధ శిశుపాల వధలెన్నఁదగినవై యున్నవి.

## జరాసంధవధ



జరాసంధుఁడు మగధదేశాధిపతిమాత్రమె కాడు, చేదిదేశాధిపతియగు శిశుపాలుని లోఁబరచుకొని తనకు సేనానాయకునిగాఁజేసికొనియున్నాఁడు. విదర్భదేశాధిపతియగు "భీష్మకుఁడు" వంగ, పుండ్ర, దేశముల కధిపతియగు "పౌండ్రకవాసుదేవుఁడు" ప్రాగ్జ్యోతిషాధిపతియగు "భగదత్తుఁడు" కళింగదేశాధిపతియగు "చిత్రాంగదుఁడు" జరాసంధుని కనుయాయులైయుండిరి * అనఁగా నేఁటి బేహారు బంగాళా అసాం ఒరిస్సా బీహారు రాష్ట్రములును మధ్యరాష్ట్రములోని తూర్పు భాగమును చీనారాజ్యములోని కొంత భాగము జరాసంధునకు లోఁబడి

* సభాప॥ 14 అధ్యా॥

యుండెను. మత్స్య కుంతిభోజ పాంచాలాది దేశప్రభువులు కూడ జరాసంధునకు వినయముఁ జూపుచుండిరి. జరాసంధుఁడు తనకూతుల నిరువురను కౌంసునకుఁ బెండ్లి చేసియుండెను. కంసునిఁ గృష్ణుఁడు వధింపఁగా జరాసంధుఁడు కృష్ణునిపై దండెత్తివచ్చెను. కృష్ణుఁడు మాయచే నాతని సేనానాయకులగు "హంస, డిచకులు" చచ్చి నటులఁ జేసి జరాసంధుఁడు సేనలను సర్దుకొనులోపునఁ బదునెనిమిదివేల యాదవులతోఁ బశ్చిమసముద్రతీరస్థమగు "కుశస్థలిఁ" జేరి యచట ద్వారకాపురిని నిర్మించుకొని యచట నివసించెను * జరాసంధుని జయించినఁగాని రాజసూయము నెఱవేఱదు. కృష్ణుని ప్రబలశత్రువు నశింపఁడు. ప్రత్యక్షముగా యాదవులుకాని పాండవులుకాని ఉభయులు కలిసికాని జరాసంధుని జయింపఁగల శక్తిసామర్థ్యములం గలిగియుండలేదు. అందువలనం గృష్ణుఁడు భీమపార్థులతోఁ గూడి బ్రాహ్మణవేషములను వేసికొని జరాసంధుని రాజధానియగు "గిరివ్రజపుర" జేరి రాజబాటనుఁగాక పెడదారినే జరాసంధగృహము నర్ధరాత్రమునఁ బ్రవేశించిరి. ఈవికృతవేషధారులఁజూచి మీరెవ్వరెందులకువచ్చితిరని జరాసంధుఁడు ప్రశ్నింపఁ గృష్ణుఁడు వీరు నియమయుక్తులు మధ్యరాత్రానంతరమునఁగాని తమవృత్తముఁ జెప్పరనఁగా (బ్రాహ్మణులపై నమ్మికమానాఁడు (జరాసంధాదులకు) విస్తారముండుటచే) నగ్నిగృహమున వారినుంచి మధ్యరాత్రానంతరమునఁ బూజాద్రవ్యములతో జరాసంధుఁడు రాఁగాఁ గృష్ణుఁడు భీమునితో నాతనికిఁ బోరుకల్పించి రాత్రియందే చంపించెను. కార్తికశుద్ధపాడ్యమిమొదలు త్రయోదశివరకు యుద్ధము ప్రవర్తించెననియు చతుర్దశినాఁటి యర్ధరాత్రమున భీముఁడు జరాసంధుం జంపెననియు మహాభారతమునఁగలదు.

---

* సభాపర్వ 14 అధ్యా॥

ఈ యుద్ధమున భీముఁ డలసటనొందఁ గాఁ గృష్ణుఁడు వాయుబలము నీబల మునుఁగూడ చూపుచుండఁగా భీముఁడు వాయువుఁ దలఁచి శక్తిసంపన్నుఁడై జరాసంధుం జంపెను. * పై గాథాసందర్భము నాలోచింపఁగా శాస్త్రీయ యుద్ధవాక్యముగాఁ డింద్రప్రస్థములో నాలోచనము జరిగి త్రయోదశి నాఁటికిఁ గృష్ణభీమార్జునులు గిరివ్రజముఁ జేరి చతుర్దశినాఁటి రాత్రి జరాసంధుని గృహమును దొంగదారిం బ్రవేశించి యగ్నిహోత్ర గృహమున జరాసంధుని భీముఁడు చంపియుండును. ఆపై రంతఃపురమున—నిర్మానుష్యమగు నగ్నిగృహమున—జరిగియుండుటచే భీమునకాయాసము రాఁగాఁ గృష్ణుఁ డెట్టులనో భీమునకు గాలిలో విశ్రాంతిఁ గల్పించి జరాసంధుం జంపించియుండునని వితర్కముచే నూహింపఁ బడుచున్నది. † జరాసంధు నన్యాయముగా జంపినదే నాఁటివారు తలఁచిరి. ఈ జరాసంధవధచేఁ నాతనిచేఁ జెఱఁ బెట్టఁబడిన రాజులు విముక్తులై వారు కృష్ణధర్మజులకు విధేయులైరి. నాఁటి భారతీయ సాంప్రదాయము ననుసరించి జరాసంధుని పుత్రుఁడగు "సహదేవుని" గృష్ణుఁడు మగధ దేశపు రాజుగా నభిషిక్తుం జేయించి యాతఁడు పాండవులకు విధేయుఁ డగునట్టులఁ జేసెను. కాని మాగధులకుఁ బాండవులపై విశ్వాసము కుదరలేదు. అందువలననే మాగధులలోఁ గొందఱు మహాయుద్ధములోఁ గౌరవుల పక్షముగా వచ్చి పాండవులతోఁ బోరాడిరి. ధర్మజుఁ డశ్వమేధమునకై గుఱ్ఱమును విడువఁగా సహదేవుని పుత్రుఁడగు "మార్జారి" మగధసైన్యముతో గూడి యర్జునునితోఁ దలపడి పోరాడెను. కాని జరాసంధవధతోఁ గృష్ణునకుఁ బ్రబలారిక్షయము నయ్యెను.

---

* సభాపర్వ॥ 21, 23, 24 అధ్యా॥



† సభాపర్వ॥ 37, 42 అధ్యా॥

# శిశుపాలవధ



చేదిదేశాధిపతియుఁ గుంతికిఁ జెలియలికుమారుఁడును కృష్ణునకు మేనత్తకుమారుఁడయ్యు నాతనికి సహజవైరియు నగు శిశుపాలుఁడొకఁడు ప్రబలుఁడై యుండెను. శిశుపాలుఁడు కృష్ణునికంటెఁబాల చిన్నవాఁడు. చిన్నతనమునఁ గృష్ణుడు శిశుపాలు నెత్తుకొనువాఁడు.* కృష్ణశిశుపాలురకు మొదట విరోధముండెనో లేదో కాని, శిశుపాలునకు వివాహముసేయఁ బిత్రాదులచే సిద్ధపఱుపఁబడిన రుక్మిణినిఁ గృష్ణుఁ డపహరించుటచేతనె వారికి విరోధమేర్పడినటులఁ గాన్పించును. శిశుపాలుఁడు కూడ కృష్ణునకు సాపత్నీసోదరుఁడగు "బభ్రు" యనువాని భార్యను గృష్ణాదులు లేనపుడు ద్వారకపై దండెత్తి యపహరించెను. వసుదేవుఁ డశ్వమేధముఁ జేయ నశ్వమును వదలగా నాయశ్వమునపహరించి యజ్ఞమునకు విఘ్నముఁ గలిగించెనట! ఇట్టి విరోధములుండఁగా నవి రాజసూయయాగముఁ జేయునపుడు ప్రజ్వలించినవి. ధర్మజుఁడు తనకువిశేషోపకారముఁ జేసిన కృష్ణునకే దేని మహదాదరముఁ జేయఁదలఁచియుండును. తదనుకూలముగా భీష్ముని ప్రోత్సాహముచే నగ్ర్యపూజాప్రదానము జరిగెను. ఆచార్య ఋత్విక్స్నాతకాదులకీయఁదగిన సభాపత్లిరము నట్టిపరిస్థితులేవియు లేని కృష్ణునకిచ్చుటచే రాజసూయముఁ జూడ వచ్చిన రాజలోకమున కసూయకలిగెను. కృష్ణునకుఁ బూర్వవైరియగు శిశుపాలుఁడు దానినాక్షేపించెను. సహదేవుఁడు మేముచేసిన దానిని కాదనినవారిపనిపట్టెదమని తా నపుడుత్కృష్టబలవంతులుగా నుండుటచే వచ్చినరాజులను బెదరించెను. శిశుపాలుఁడు మాత్రము జంకక కృష్ణుడర్ఘ్యముం గ్రహించుట కెంతమాత్ర మర్హుఁడు కాడని ప్రోత్సాహకుఁడగు భీష్ముని అర్ఘ్యమిచ్చిన ధర్మజుని బానింబుచ్చుకొనిన

* సభాపర్వం ౪౩ అధ్యా॥

కృష్ణునిఁగూడ నిరసించెను. భీముఁడు కోపోద్రిక్తుఁడై శిశుపాలునితోఁ
బోరాడసిద్ధపడెనుగాని శిశుపాలునిబలముఁదెలిసిన భీష్ముఁడు భీమునకు
శిశుపాలుఁడు తీసిపోవువాఁడుకాడని భీముని నివారించెను. శిశుపాలుఁ
డింతలో సభనువదలి యుద్ధప్రయత్నమునకై బయలునకేఁగఁగా ధర్మజుఁ
డనునయవాక్యములతో శిశుపాలునిఁ దిరిగిసభలోనికిఁ దీసికొనివచ్చెను.
అపుడు కృష్ణ శిశుపాలురకు కొంతవాక్కలహము జరిగెను. ఆవాక్క
లహములోనే తటాలున శ్రీకృష్ణుఁడు చక్రముఁబ్రయోగించి శిశు
పాలుని శిరచ్ఛేదముఁజేసెను. ఈశిశుపాలవధకూడ జరాసంధవధవలె
కపటముగాఁ జేయబడినదేను. శిశుపాలునిఁ గపటముగాఁ గృష్ణుడు
చంపెననికూడ నాఁటివారుతలఁచిరి. ♦ పరాకుగానుండిన శిశుపాలు
నిం గృష్ణుఁడు వధించెనని యీక్రింది సాళ్వవాక్యము చెప్పుచున్నది.

* "ఇపుడా పాపకర్మను జేయునట్టియు నీచుఁడును విశ్వాస
ఘాతకుఁడును నగు శ్రీకృష్ణుని యమలోకమునకుఁ బంపుదును. ఏపా
పాత్మునిచే నాసోదరుఁడగు శిశుపాలమహారాజు చంపఁబడెనో వాని
నీభూమియందు వధించెదను. నాకు సోదరుఁడు—వీరుఁడు—బాలుఁడు—
యుద్ధభూమియందు లేక ప్రమాదమునొందిన శిశుపాలు నెవఁడుచంపెనో
యాజనార్దనునిఁ జంపెదను.—

---

♦ సభాపర్వ॥ 47 అధ్యా॥

* శ్లో॥ అద్య తం పాపకర్మాణం క్షుద్రం విశ్వాసఘాతినం
శిశుపాలవధామర్షా ద్గమయిష్యే యమక్షయం॥
మమ పాపస్వభావేన భ్రాతా యేన నిపాతితః
శిశుపాలో మహీపాల స్తంవధిష్యే మహీతలే
భ్రాతా బాలశ్చ రాజాచ నచ సంగ్రామమూర్ధని
ప్రమత్తశ్చ హతో వీర స్తం హనిష్యే జనార్దనం॥



అరణ్యపర్వ॥ 14 అధ్యా॥

ఈయుద్ధప్రధానము జాతిద్వేషమును బెంచుటకుఁ గారణమైనది. [నేడును గోదావరీమండలప్రాంతము నందు బ్రాహ్మణ వైశ్య గృహములలో జరుగు వివాహసమయములలో సదస్యము నాఁడిచ్చు సభాపళ్ళెరము (అగ్ర్యము) నిమిత్తము బ్రాహ్మణుల యధికారానధికార విషయిక వివాదముల నప్పుడప్పుడు మనము చూచుచుందుము. సభాపళ్ళెర, భూరిపళ్ళెర (వైశ్యవివాహములలో నిచ్చునది భూరిపళ్ళెరము) వివాదములు దొమ్ములాడుటకును కోర్టుకెక్కుటకును గొన్నిచోటులఁ గారణమగుచున్నవి] శిశుపాలవధసమయమునఁ గృష్ణ పాండవులతిశయ బలవంతులగుటచే వారి నెవరు నెదిరింపలేదట. * శ్రీకృష్ణ పాండవుల యీయతిశయమే సౌంభకయుద్ధమునకుఁ బాండవ రాజ్యచ్యుతికిఁ పిమ్మట మహాభారతయుద్ధమునకుఁ గారణమైనది.

## సౌంభక వధ



శిశుపాలుని వధించుటచే నాతని సోదరుఁడును "మార్తికావత" • దేశమునకుఁ బ్రభువునగు "సాళ్వుఁ" ద్వారకపై దండయాత్రఁ జేసి యాదవులను మిగుల బాధించెను సాళ్వుఁడు ద్వారకపైఁబడు

---

* సభాపర్వ॥ 47 అధ్యా॥

• మహాభారతములో ముగ్గురు "సాళ్వులు" గాన్పించుచున్నారు. ఒకటి "అంబ" వరించినట్టియును భీష్మునితోఁ బోరినట్టియు సాళ్వుఁడు. వీనిచరితము "ఆది, ఉద్యోగ" పర్వములలోఁ గాన్పించును. రెండు శ్రీకృష్ణునితోఁ బోరాడిన సాళ్వుఁడు. ఈతఁడే "మార్తికావత" దేశాధిపతియును సౌంభకపుర లేక సౌంభకవిమానము కలవాఁడును. ఈతని చరితము మహాభారతములోని యరణ్యపర్వములోను శ్రీమద్భాగవతములోని దశమస్కంధములోను విపులముగా వర్ణింపఁబడెను. మూఁడవ సాళ్వుఁడు ధృష్టద్యుమ్న వాక్యములచే మహాయుద్ధములోఁ జచ్చెను. వీఁడు మ్లేచ్ఛసైన్యాధిపతియని మహాభారతానుక్రమణికలోఁ గలదు. మొదటి యిద్దరు సాళ్వులొక్కరే యనియుఁ గూడ మహాభారతానుక్రమణిక సూచించుచున్నది.

నపుడు కృష్ణుఁడింద్రప్రస్థముననే యుండెను. సాళ్వుఁడు ద్వారకను భేదింపలేక తన సౌంభకపురికిం జేరెను. కృష్ణుఁడీవృత్తాంతమును విని సౌంభకపురిపై కేఁగి పదిమాసములు వానితో ఘోరముగాఁ బోరి వాని దంపెనట 1 శ్రీకృష్ణచరితముఁ జూడఁగా నాతఁడు రెండుమారులు రోదనముఁ జేసెనటులఁ గాన్పించును. 2 ఒకటి సాళ్వయుద్ధసమయమున, రెండు సంశప్తకు లర్జునుని దన్ను, రథమునుఁ గట్టి కాలు చేయి కదల్పకుండఁగా మింగఁబోవునప్పుడు కృష్ణుఁడు. సాళ్వునితోఁ బెఱపిరేసుండఁ బోరునపుడే పాండవులు ద్యూతజితులై యరణ్యవాసమున కేఁగిరి. 3 సాళ్వుంజంపి కృష్ణుఁడు ద్వారకకు రాఁగాను సాత్యకిఁ పాండవుల రాజ్యభ్రష్టత్వముఁ జెప్పెను. ద్యూతకాలమునఁ గృష్ణుఁడు ద్వారకలో నుండలేదయ్యు ద్రౌపదీవస్త్రాపహరణకాలమునం దామె “హాకృష్ణా ద్వారకావాస” యనునంతనె “ముశకిర” రూపముతో వచ్చి యామెకనేకవస్త్రముల నిచ్చెనని చెప్పువాక్యమున కీసౌంభకవధ గాథ ప్రబలవిరోధముగా నున్నది. 4 “నేను ద్వారకలో నెయుండిన యెడల ద్యూతకాలమున కనాహూతుఁడనైనవచ్చి ద్యూతమును నివారింపను” యని శ్రీకృష్ణుఁడనుట గమనింపఁదగిన యంశమైయున్నది.

జరాసంధ శిశుపాలురు జీవించియుండిన యెడల కురుక్షేత్రయుద్ధములోఁ గౌరవపక్షముగానె వచ్చియుందురు 5 ఉపసంగతిని ఘటోత్కచవధానంతరము కృష్ణుఁడర్జునునితోఁ జెప్పుచు నీకై వారినెలులనో కడతేర్చితిననుటచేఁగూడ జరాసంధ శిశుపాలురను కపటముగానె

---

1 అరణ్యపర్వ॥ 13 అధ్యా॥

2 అరణ్యపర్వ॥ 21 అధ్యా॥ ద్రోణపర్వ॥ 19 అధ్యా॥

3 అరణ్యపర్వ॥ 13 అధ్యా॥

4 అరణ్యపర్వ॥ 18 అధ్యా॥



5 ద్రోణపర్వ॥ 181, 182 అధ్యా॥

వధించిరని స్పష్టమగుచున్నది. పాండవులు ద్యూతజితులై వనమున కేఁగినపిమ్మటను కృష్ణ ధృష్టద్యుమ్నాదులు వనమున కేఁగి పాండవుల నోదార్చిరి. కాని సాళ్వయుద్ధమునచే యాదవులలసియుండుటచేతను, శిశుపాలవధచే దంతవక్త్ర పౌండ్రక వాసుదేవాదులలఁగి యాదవులపై యుద్ధసన్నాహములఁ జేయుచుండుటచేతను తక్కిన రాజులుకూడ రాజసూయ యాగసమయమునం బాండవుల యౌద్ధత్యవిభవములంగాంచి కోపాసూయలచే నెవతేపక్షమునకుం జేరుదురో యను సందిగ్ధస్థితిక లుగుటచేతను, యాదవ పాంచాల పాండవ త్రివర్గము కౌరవులపై దండయాత్రను సాగింపలేరైరి. అర్జుఁడస్త్రవిద్యాలాభమునొందుటకుఁ త్రివిష్టపమునకుఁ బోఁగాఁ దక్కిన పాండవులు తీర్థయాత్రలఁ జేయుచు ద్వారకసమీపమునకువచ్చిరి. అపుడు బలరామాదులు పాండవులఁ బరామర్శచేయుటలో సాత్యకి సృంజయ కేకయ యాదవులు కౌరవులపైఁబడి జయింపఁగలరని బలరామాదులఁ బురికొల్పెను. కాని యర్జునుఁడు రాకపోవుటచేతను ధైర్యముచాలక కాఁబోలు ధర్మజాదులా విజృంభణము నంగీకరింపలేదు * పరిస్థితులనాలోచింపఁగా నాఁటికే సృంజయ కేకయ పాంచాల యాదవుల కన్యోన్యత కలిగినటులఁ దోఁచును. యాదవులలోఁగూడ రెండుపక్షములుకలవు. భోజకులజులగు "శతధన్వాక్రూరకృతవర్మలకును వృష్ణికులజులగు శ్రీకృష్ణాదులకునుఁ బొత్తు లేదు. దీనికిఁ గారణమేమనగా—కంసుఁడు భోజకులజుఁడు. కృష్ణుఁడు వృష్ణికులజుఁడు. కృష్ణుఁడు కంసుంజంపి యాతనితండ్రియగు "ఉగ్రసేనుని" నామమాత్రపురాజుగాఁజేసి సర్వాధికారములను దానేవహించుట. దీని నీక్రిందివా[illegible]శపద్యము స్పష్టపరచుచున్నది.

సీ॥ భోజవంశమువారు ♦ రాజులైయుండంగ
యాదవుల్ కింకరు ♦ లై చరింతు

---

* అరణ్యపర్వ [illegible] 120 అధ్యా.

రట్టి పున్నాయమునఁ ♦ బుట్టితిఁ గడుబాము
మాలితి నీకంటె ♦ బాలిశుండు
గలఁడె యెవ్వఁడు పుత్రుఁ ♦ బాలించె నాకృష్ణు
డెక్కటి తద్రాజ్య ♦ మెల్లఁ బాన
గోని రిత్తవట్టంబు ♦ నినుఁబూన్ప నతనిపె
ట్టెడు సన్నపిండంబు ♦ గుడిచె దకట
గీ॥ యెట్లు గాఁ బెద్దవాఁడవై ♦ తేమి బ్రతుకు
సిగ్గఱిన భోగమెట్లు రు ♦ చించెనీకు
హరికి బంటవుగాక నీ ♦ వవనిపతివె
యిట్టి రాజధర్మధ్వంసి ♦ నేమ సైప॥

హ॥ 2 అధ్యా॥

ఈవాక్యములు జరాసంధుఁడుగ్రసేను నాక్షేపించుసందర్భము లోనివి.

సత్రాజిత్తు కుమార్తె యగు సత్యభామను శ్రీకృష్ణుఁడుద్వాహ మగుట రెండవవిరోధకారణము. సత్రాజిత్తు తనకుమార్తెయగు సత్య భామను "కృతవర్మా క్రూర శతధన్వులలో" నొకరికిచ్చి పెండ్లి చేయుదునని మాటనిచ్చి "శమంతకమణి" వ్యవహారముచే * శ్రీకృష్ణు నకు సత్యభామనిచ్చియున్నాఁడు. ఇందులకే "శతధన్వుఁడు" లఁగి కృష్ణుఁడూర లేనపుడు సత్రాజిత్తుంజంపి శమంతకమణి నవహరించి పిమ్మట శ్రీకృష్ణభయము మనస్సునకుఁగలుఁగగా మణి నక్రూరునికి దాచ నిచ్చి కృతవర్మాదులు తనకుతోడ్పడుటకు భయపడి నిరాకరిం చుటచేఁ బలాయితుఁడయ్యెను. కృష్ణబలరాములు పలాయితుఁడగు శతధన్వుని వెంటాడిరి. కృష్ణుఁడరణ్యములోఁబడునిడు శతధన్వుంజంపివాని వస్త్రాదికముంబరిశీలింపఁగా మణి కాన్పింపలేదు. మణి కాన్పింపలేదనిబలదే



* శమంతకమణిగాథ విష్ణుశ్వరచవితక ... పెద్దపిమయియున్నది.

పురిలోఁ గృష్ణుఁడు చెప్పఁగా (వెన్నదొంగతనము నేర్పినవాఁడని కాఁబోలు) బలదేవుఁడు నన్నుకే నీవే యీ మణినపహరించితివని కోపగించి నాకో వత్సరముండనె మిథిలాపురికేఁగి మూఁడేండ్లచటఁ గాపురముండెనని విష్ణుపురాణములోఁ గలదు. ఆసమయముననే దుర్యోధనుఁడు మిథిలకేఁగి బలరామునికడ గదాయుద్ధమును నేర్చెనట! శమంతకమణి నక్రూరుఁడు చేకొని కృష్ణభయముచేఁ గాశీకేఁగి యచటఁ గాపురముండెను. ప్రజలక్రూరుని మరిగి ద్వారకకుఁ దీసికొని రావలసినదని కృష్ణునిఁ గోరఁగా నాతఁడు ప్రజాహితముకై యక్రూరుని రప్పించి రత్నమతనికడ నుండుటఁ దెలిసికొని సత్యాబలరాములకు "పైతృకము, జ్యేష్ఠము" నగు భాగములుగల శమంతకమణిని వారిలోఁ బోరుపడలేక నం'జనహితుఁడగు నక్రూరునకిచ్చినచో గృహకలహము తీరునని తలఁచియు మనస్సునందిష్టము లేకుండినను పైమెప్పుకొఱకై యక్రూరునకే యా శమంతకమణినిచ్చి "అక్రూరవరదుఁడు" ను మహాబిరుదమును వహించెను. ఈశమంతకమణిగాథ జరుగుచుండిన కాలమునం బాండవులు "ఏకచక్రపుర" ప్రాంతారణ్యములలోఁ దిరుగుచుండిరి. కృష్ణునకు స్వచక్ర (తనరాజ్యములోని) భయముండుటచేతనే కౌరవులపై స్వయముగా యుద్ధముఁజేయఁ గడఁగలేదు. భోజ వృష్టికులముల వివాదము, కృతవర్మ దుర్యోధనపక్షముగాఁ గురుక్షేత్రయుద్ధమునకు వచ్చుటకును, పిమ్మట సర్వయాదవ నాశమునకుఁ గూడ కారణమైనది. పాండవులు ద్వాదశవర్షారణ్యవాసమును ముగించి యజ్ఞాతవాసముఁ జేయఁబోవుచు స్వసైన్యాదికమును శ్రీకృష్ణునివశము జేసిరి. మథురాపురి భోజులకు మొదటి రాజధాని. కంసుఁడు బలవంతుఁడగుటచే నిర్భయుఁడై దుర్గాది సంరక్షణమును చేయలేదు. అందువలన జరాసంధుఁడు కృష్ణుపైఁజేసిన మొదటిదండయాత్రయందే మథురాపురి పూర్తిగా శిథిలమైనది. అందువలననే మథురను వదలి యాదవులు "కుశస్థలి" యను ప్రాచీన పట్టణమునకు సమీపమున ద్వారకను నిర్మించుకొనిరని హరివంశమునం

గలదు. పాండవులరణ్యముననుండిన కాలమునం గర్ణుఁడు "కుశస్థలి, మథుర" మొదలగు ప్రదేశములం జయించినటులఁ గాన్పించును. ◆ కృష్ణుఁడు కర్ణవిజృంభణము నెటులు సహించెనో? బహుశః యాదవులా సమయముననే పౌండ్రకవాసుదేవునితోనో పోరు సల్పుచుందురు. శ్రీకృష్ణుఁడు తన యనుయాయులతో నజ్ఞాతవాసానంతర "మభిమన్యు" వివాహసమయమునకు విరాటపురమునకుఁ జేరెను. పాండవ పాంచాల యాదవులతో మాత్స్యులుకూడ చేరిరి. కర్ణుని దిగ్విజయముచే మతికొంచపడు రాజులు కూడ కౌరవులపైఁగినిసి పాండవులపక్షమునకు వచ్చునటులఁ గాన్పించెను. అందువలననే పాండవుల కేడక్షౌహిణులు బలమైన దాఁగలిగెను. అభిమన్యువివాహానంతరము కృష్ణుఁడు పెండ్లికివచ్చిన రాజులసభలో భవిష్యత్కురుక్షేత్ర యుద్ధాంకురములను నాటెను. కూటయుద్ధము బలరామున కిష్టము లేదు. నేఁడు భరతఖండమునం గాన్పించు "నరివాద, మితవాద" పక్షములపద్ధతి, "ఉపప్లావ్య" సభలోనె నాఁడు కాన్పించినది. శ్రీకృష్ణ నర్జునుఁడు సహాయముఁగోరుటకు వచ్చినసమయముననే దుర్యోధనుఁడును కృష్ణసహాయముఁగోరుటకు వచ్చుటయు తటస్థించినది. పాండవపక్షమునను౦డగు శ్రీకృష్ణునికంటె నాతని "నారాయణగోపాల" బలమె తనకుపకారియని దుర్యోధనుఁడు తలంచెను. అస్త్రముంబట్టని కృష్ణునియాలోచనాసాహాయ్యమె తనకు మహదుపకారమని యర్జునుఁడు తలపోసెను. సాత్యకి యెపుడును పాండవపక్షపాతియేను. కృష్ణసాత్యకులు పాండవపక్షముగాఁ బోవుటచేతనె పూర్వవైరములఁ దలపోసి కృతవర్మ, "అక్షౌహిణీ" సేనాసమేతుఁడై దుర్యోధనుపక్షమునకేఁగెను. "కృష్ణుని మాయచేతనె విస్తారమగు కురుబలముఁ జయింపఁ బాండవులు ప్రయత్నించుచున్నా" రని సంజయుఁడు ధృత

◆ అరణ్యపర్వ॥ 258 అధ్యా॥

రాష్ట్రునితోఁ జెప్పియున్నాఁడు [1] కృష్ణుని రాజకీయ ధురంధరత్వ మాతని రాయభారసమయమున వెల్లడియైనది. శ్రీకృష్ణప్రోత్సాహముచేతనె పాండవులు యుద్ధమునకుఁ బ్రయత్నించుచున్నారు గాన కృష్ణునిలంచముచే (దానోపాయము) లోఁబరచుకొనవలెనని ధృతరాష్ట్రుఁడును కట్టివేసి (దండోపాయముచే) లోఁబరచుకొనవలెనని సుయోధనుఁడును తలఁచిరి. [2] రెండును వ్యర్థములేయయ్యెను. శ్రీకృష్ణుని దండించి లోఁబరచుకొందురనుభయము ధర్మజునకుఁగూడ కలిగెను. [3] అట్టిభయముండుటచేతనె కృష్ణుఁడస్త్రశస్త్రముల ధరించియు సాత్యకిఁ గూడఁ దీసికొనియు పోయియున్నాఁడు. కౌరవసభలో భీష్మాదులకే గాక తక్కిన రాజులకుఁగూడ సుయోధనునిపై నహితము కలుగునటుల నుపన్యసించెను. పాండవులు తమయభిప్రాయములఁ దెల్పునపుడు ముందు భీముఁ బుద్ధికొల్పుటలోను ద్రౌపది నోదార్చుటలోను గూడ సంధిపొసఁగనీయకుండఁ జేయుతలఁపు కలుగురీతినెసంభాషించి యాప్రకారమె చేసెను. అందఱిమనస్సులఁ దనవశమునుండి మార్చుచున్న కృష్ణుని బంధింప సుయోధనుఁడు తలఁచెను గాని విదురాదుల యడ్డంకిచే నటులు చేయలేదు. ఈసమయమునఁ జూపిన విశ్వరూపసందర్శనము మోహావిష్టుఁడగు నర్జునునకుఁ జూపిన విశ్వరూపమువలె కార్యకారికాలేదు. అట్లు కార్యకారియేయైనచో ధృతరాష్ట్రుఁడర్ధరాజ్యమును తప్పక నొసఁగియేయుండును. ఈవిశ్వరూపసందర్శనగాథ సౌతికాలమునఁ గూర్పఁబడియుండునని "భారతమీమాంసాగ్రంథకర్త" 4 తల

1 ఉద్యోగపర్వ॥ 66 అధ్యా॥

2 ఉద్యోగపర్వ॥ 85, 87 అధ్యా॥

3 ఉద్యోగపర్వ॥ 71 అధ్యా॥

4 "భారతమీమాంస" యను గ్రంథమును "మహారాష్ట్ర" భాషలో నొక పరిశోధకుఁడు వ్రాసియుండెనఁట! దానిని, బ్ర శ్రీ॥ చర్ల నారాయణశాస్త్రిగారాంధ్రీకరించి, ఆం॥ సా॥ పరిషత్పత్రికలోఁ బ్రకటించియున్నారు.

పోయుట యుక్తముగానె యున్నదని తలఁతును. కృష్ణుని దుర్యోధ
నాదులు బంధింప నాలోచించుటను "సాత్యకి" ముందుగఁ దెలిసికొని
తమవాఁడైన కృతవర్మం దనపక్షముగా నుంచుమని కోరియున్నాఁడు.
నిజముగా దుర్యోధనుఁడు కృష్ణుని బంధింప యుద్ధమే చేసినయెడల కృత
వర్మ యేపక్షమునకుఁ జేరునో? కృష్ణుఁడు కౌరవసభకుఁ బోవుటచేఁ
గలుగు లాభములలో కర్ణునిమనస్సునుఁ ద్రిప్పుటమొన్నఁదగియున్నది.
కర్ణునకంతకుఁబూర్వమె చూచాయఁగాఁ దెలిసిన పాండవసోదరత్వగా
థను, కృష్ణుఁడు బలపరచి సాంఘికనీతికి విరుద్ధమును, "కౌటిలీయా"ది
రాజనీతులకు నమ్మతమునగునటుల ద్రౌపది యాఱవభర్తనుగా నిన్ను
నంగీకరించునని చెప్పెను. కర్ణుఁడు లోకమునకుఁ బాపమునకును వెఱచి
పాండవులఁగూడ నంగీకరింపలేదు. కాని పాండవులపైఁ బ్రేమాంకు
రముమాత్రము కలిగెను. కృష్ణుని దుర్యోధనుఁడు బంధింపనుద్యమిం
చుటను ధర్మజునితోఁ జెప్పలేదు కాని యుద్ధసన్నద్ధులై దుర్యోధనుపక్ష
ముగావచ్చిన రాజులకమానుషములఁజూపి దుర్యోధనునిపై నహితము
కలుగునటులఁజేసితిననుటచే కృష్ణుని బంధింప దుర్యోధనుఁడుయత్నించె
ననుగాథకూడ మృషయనియు సౌతికాలమునఁ గల్పింపఁబడినదనియు
చెప్పెడి "భారతమీమాంసా" వాక్యము సత్యమేయని నూఱులనొకసారి
చెప్పసాహసించుచున్నాఁడను. కౌరవసభలోఁ గృష్ణుఁడుకనఁబఱచినది
యేదేనియింద్రజాలమనితలఁచిరేమో? కనుకనే దుర్యోధనుఁడు, "ఉలూ
కునిచే" నర్జునునకు సందేశమంపుచు నిట్లనుమని చెప్పియుండును.

* "ఓయర్జునా? వాసుదేవునిభయమువలనఁగాని, నీభయము

---

* శ్లో॥ నభయాద్వాసుదేవస్య-నచాపి తవ ఫాల్గున
రాజ్యం ప్రతిప్రదాస్యామి-యుధ్యస్వ సహకేశవః
సమాయా హీంద్రజాలంవా-కుహకా వాబిభీషికా
ఆత్తశస్త్రస్య మే యుద్ధే-వహంతి ప్రతిగర్జనాః॥
ఉద్యోగపర్వ॥ 160 అధ్యా॥

వలెఁగాని రాజ్యమునీయును. కేశవునితోఁగూడ (వచ్చి) యుద్ధముఁ జేయుము. శస్త్రధరుఁడనగు నాకు యుద్ధమునందు మాయకాని యింద్రజాలముకాని యోధ్యలేనిత్రసముగాని భయపెట్టుటకాని మెదురు చెప్పలేవు"

యుద్ధానంతరము ద్వారకకుఁబోవుమార్గములో "ఉదంకుఁడ"ను ముని కృష్ణుఁడు కురుపాండవులకుసంధిసేయక వృథాగా కురునాశముఁ జేయించెనని కుపితుఁడుకాఁగా నాతనికిఁగూడ విశ్వరూపముఁజూపి యాతనిలోఁబఱచుకొనెనని యశ్వమేధపర్వమునఁగలదు. ఏదేవదేవుఁపు నీవిశ్వరూపములు జ్ఞానులపక్షమున నెటులున్నను శత్రువులపక్షమున నింద్రజాలములుగాను కాన్పించునుగదా? విశ్వరూపవ్యవహారములెట్టి వైనను శ్రీకృష్ణుఁడు పాండవపక్షముగా అందర్జునునిపక్షముగా మెలఁగి దుర్యోధనాదులనెటులనైన వంచనసేయువలయుననియే తలఁచియుండెను. అది దుష్టసంహారమునకేజన్మించెనని పురాణములలోవ్రాయఁబడిన బలరామునకును, భగవద్భక్తాగ్రేసరులనఁబడు "ఉద్ధవ, అక్రూరా" దులకును తుదకు శ్రీకృష్ణునితనయులును పరాక్రమశాలురునగు "సాంబ, ప్రద్యుమ్నా" దులకునుఁగూడ సహ్యముగాలేదని యీక్రింది గాథ చెప్పుచున్నది.

• "సమీపించిన యాయుద్ధము మహోపద్రవకరమైనదానిగాఁజూచి బలరాముఁడు పులులవలె బలవంతులగు "అక్రూరుఁడు"

---

• శ్లో॥ తద్దృష్ట్వా ప్రస్థితం యుద్ధం-సహాసన్నం మహాభ్యయం
ప్రాపితద్భువనం రాజన్-పాండవస్య హలాయుధః
సహాక్రూరప్రభృతిభిః-గద సాంబోద్ధవాదిభిః
రౌక్మిణేయాహుకసుతైః-చారుదేష్ణ పురోగమైః
వృష్టిముఖ్యై రధిగతై-ర్వ్యాఘ్రైరివ బలోత్కటైః
అభిగుప్తో మహాబాహు-ర్మరుద్భిరివ వాసవః.....

మొదలగువారితోను (భోజకులులు) గదుఁడు, సాంబుఁడు, ఉద్ధవుఁడు, ప్రద్యుమ్నుఁడు, ఆహుకసుతుఁడు, చారుదేష్ణుఁడు మొదలగు వృష్ణికులులతోను పరివృతుఁడై దేవతలచే సేవింపఁబడు నింద్రునివలెఁ బ్రకాశించుచు పాండవశిబిరమున కేతెంచెను.....అట్టి బలరామునిఁ జూచి ధర్మరాజు కృష్ణుఁడు అర్జునుఁడు భీముఁడు దదితరరాజులు లేచి బలరామునిఁ గౌరవించిరి. ధర్మరాజు బలరాముని కరస్పర్శంగావించెను......బలరాముఁడు ధర్మజునితోఁ గూర్చుండెను. పిమ్మట నందఱునుఁ గూర్చుండిరి. పిమ్మట బలదేవుఁడు కృష్ణుంజూచి యిట్లనుచున్నాఁడు. ఈయుద్ధము కఠినమును బురుషక్షయమునై ప్రవర్తింపఁబోవుచున్నది. దైవవశమున నగు దీని నతిక్రమింప శక్యము కాదు... ...నేను వాసుదేవునితో "బంధువులయందు సమానముగా వర్తింపుము. పాండవులెట్టివారో దుర్యోధనుఁడును మనకట్టివాఁడేను" అని రహస్యమునందు పెక్కుసారులు చెప్పితిని. అర్జునుంజూచుచు—ఆనామాటను నీకుపకారముఁ జేయువాఁడై వినలేదు. పాండవులకు జయము ధ్రువమని నానిశ్చయాభిప్రాయము. అనియే శ్రీకృష్ణునితలఁపుకూడ. నేను కృష్ణునివిడిచియుండలేను. భీమదుర్యోధనులు నాకు గదాయుద్ధములో నిపుణులైన శిష్యులగుటచే వారిద్దఱియందు నాకు సమానస్నేహము

---

శ్లో॥ ఉదతిష్ఠత్తతః పార్థో-భీమకర్మా వృకోదరః
గాండీవధన్వా యేచాన్యే-రాజానస్తత్రకేచన
పూజయాంచక్రిరే తేవై-సమాయాంతం హలాయుధం
తతస్తం పాండవో రాజా-కరేపస్పృశ్య పాణినా......
......యుధిష్ఠిరేణసహిత-ఉపావిశ దరిందమః
తతస్తేషూపవిష్టేషు-పార్థివేషు సమంతతః
వాసుదేవ మభిప్రేక్ష్య-రౌహిణేయో౽భ్యభాషత
భవితాయం మహారౌద్రో-దారుణః పురుషక్షయః
దిష్టమేతద్ధ్రువంమన్యే-నశక్య మతివర్తితుం......

కలదు....................కౌరవులు నశించుచుండఁగా నుపేక్షించి యుండ లేను.

ఒక్క బలరామునకే కాక తక్కిన యాదవులకుఁ గూడ కృష్ణుని పాండవపక్షపాతచర్య యిష్టము లేదు కృష్ణుని యీ వ్యవహారమెంత మాత్ర మిష్టము లేనందుననూ అది న్యాయముగాఁ గాన్పించనందుననే కృష్ణునికుమారులును మహాబలవంతులునగు "ప్రద్యుమ్నుఁడు, సాంబుడు" మొదలగువారుకూడ పాండవపక్షముగా రా లేదు. సాత్యకి యర్జునునిశిష్యుఁడగుట చేతను పాండవపక్షముగా రాక తప్పినది కాదు. పై బలరామవాక్యముల చేత నేగాక యీ క్రింది గాంధారీవాక్యముల చేఁ గూడ కృష్ణుఁడే సంధిపొసఁగకుండఁ జేసెనని స్పష్టమగుచున్నది.

* "ఓకృష్ణా నీవిచ్ఛయించుటవలననే కౌరవులనాశము పేక్షింపఁబడెను. అందువలన నీవా ఫలము ననుభవింతువుగాక"

ఇది గాంధారి పోలికలనిలో యుద్ధమృతులఁ జూచునప్పుడనిన మాట. భీష్ముని పదిదినములయుద్ధములోను, ఆతనిచే దెబ్బలఁదినిన రెండుమారు లర్జునునిఁ బుద్ధిగొల్పుటకుఁ దాను నొగను విడిచి భీష్మునిపైకిఁ

---

......ఉక్తోమయా వాసుదేవః-పునఃపున రుపహ్వరే। సంబంధిషు సమాం వృత్తిం-వర్తస్వ మధుసూదన। పాండవాహి యథాస్మాకం-తథా దుర్యోధనో నృపః.. ......తచ్చమే నాకరోద్వాక్యం-త్వదర్థం మధుసూదనః। నిర్విష్ట స్సర్వభావేన-ధనంజయమవేక్ష్యహ। ధ్రువోజయః పాండవానా-మితి మేనిశ్చితా మతిః। తథా హ్యభినివేశోయం-వాసుదేవస్య భారత।నచాహముత్సహే కృష్ణమృతే లోకముదీక్షితుం। ఉభౌ శిష్యౌ హి మేవీరౌ- గదాయుద్ధవిశారదౌ। తుల్యస్నేహోస్మ్యతో భీమే-తథా దుర్యోధనే నృపే।......నహి శక్ష్యామి కౌరవ్యాన్నశ్యమానా నుపేక్షితుం॥

ఉద్యోగపర్వ॥ 156 అధ్యా॥

* ఇచ్ఛతోపేక్షితో నాశః-కురూణాం మధుసూదన
యస్మాత్త్వయా మహాబాహో-ఫలం తస్మాదవాప్నుహి॥

స్త్రీపర్వ॥ 25 అధ్యా॥

బోవుటయు, భీష్ముని కృత్రిమాలోచనము చేతనే యాతనిఁబడగొట్టు టకు విచారించు నర్జునునకుఁ బ్రోత్సాహముకలిగించుటయుఁ దప్ప వేఱుపాయములచేఁ గౌరవులకు నష్టముగలిగింపఁ గృష్ణున కవకాశము లభింపలేదు. భీష్ముఁడు పాండవపక్షపాతియై పాండవసైన్యమును విశే షముగా నష్టపుచ్చక పదిదినములలోను పదివేలరథికులను మాత్రమె వధించెనుగాని స్వసైన్యమున కెంతమాత్రము నష్టము రానిరీతి నద్భుత ముగ వ్యూహములఁబన్నుచుఁ గృష్ణునిమాయోపాయములకుఁగాని యర్జునుని వ్యూహభేదనానైపుణ్యమునకుఁగాని యవకాశమొసఁగక నేఁటికాలమున జర్మనీసర్వసైన్యాధిపత్యమునువహించిన "హిండెంబర్గు" వలె మెలఁగెను. కాని "మెత్తనిపులి" యని సంజయుఁడొక్కప్పుడు చెప్పిన ధర్మరాజే రహస్యముగా భీష్మునిపాదములపైఁబడి యాతఁడు తనంతతానె పడిపోవునుపాయముఁజేసెనని పెంపఁబడిన మహాభారత ములోఁగాన్పించును. ఇందు శ్రీకృష్ణునిప్రయోజకత్వము లేదు. "వింట ర్నిజ్జు" గారు భీష్మునిబహిఃప్రఖ్యాతిఁబట్టి భీష్ముఁడట్టి రాజద్రోహమున కొడిఁగట్టఁడనియు భీష్మపతనమున కేదేని యుపాయమును శ్రీకృష్ణుఁడే చెప్పియుండుననియు వ్రాయుట విచారణీయాంశము. భీష్మపతనగాథను పరిశీలించి చదివినయెడల భీష్మధర్మజులాలోచించుకొని భీష్ముఁడు పాండ వులకు దొరకునట్లుఁ దన వ్యూహమును వదలి పాండవసైన్యములోనికిఁ జొరచుకొనివచ్చియుండును. ఆతనికిఁ దోడువచ్చుటకుఁ బ్రయత్నించు దుశ్శాసనాదుల నర్జునుఁ డడ్డుపరచియుండును. భీష్మధర్మజు లనుకొనిన దానికి వ్యతిరేకముగాఁ బూర్వవైరియగు శిఖండి భీష్ముని హతుంజేసి యుండును. పెంపఁబడిన భారతములో నర్జునునిచేఁ బడఁగొట్టఁబడి నట్లు విశేషముగా వర్ణింపఁబడినది కాని మూలభారతములో శిఖండి చేతను భీష్ముఁడు హతుఁడయ్యెననియే చెప్పఁబడియుండెను * భీష్ముని

* భీష్మపర్వ. 18 అధ్యా.

యొద్దనమున కెదురుగా శిఖండి యొడ్డియుండుటచే దుర్యోధనుఁ డారం
భములోనె దుశ్శాసనునితో భీష్ముని జాగ్రత్తగ కాపాడుచుండుము
శిఖండి యాతనిఁ బొరిగొనునుసుమా యని చెప్పియున్నాఁడు. ఈ దుశ్శా
సనుఁడు కడపటియుద్ధములోఁ గూడ భీష్మునికై విశేషముగాఁ బెనఁగు
లాడి యర్జునునకాఁగలేక పోయి భీష్ముని శిఖండిబారికై వదలియు
న్నాఁడు. • ఎట్లయినను భీష్మపతనమునకు శ్రీకృష్ణునిప్రయోజకత్వము
లేదనియు నాతనియుద్ధవ్యవసాయమున నీతని కృత్రిమము లేవియు సాగ
లేదనియు జెప్పవలసియున్నది. భీష్మయుద్ధారంభమున నర్జునునకుఁగలి
గిన మోహావిభ్రాంతినిఁ బోగొట్టుటకై చేసినయుపదేశముమాత్ర మ
నుమానము. యావద్భగవద్గీతయొక్క కర్తృత్వము శ్రీకృష్ణునకు
లేదని తలఁచువారుకలరు. అదిసత్యమేయైయుండును, కారణమేమన
మహాయుద్ధముసంప్రాప్తమై యిఁక బాణములను విడువఁబోవుచుండగా
నర్జునునకు నాలుపందలయిరువది శ్లోకముల నాశువుగాఁ గవిత్వమునుఁ
జెప్పి యుపదేశించెననుట యయుక్తముగానె కాన్పించును. ఆసమయ
మునఁ గృష్ణార్జునులకు జరిగినసంభాషణము నేసంజయుఁడోవిని హిమా
లయమున భారతరచనముఁ జేయు వ్యాసునకుఁజెప్పఁగా నాతఁడు కొంత
పెంచి వ్రాసియుండును. లేక జనమేజయునికాలమునఁ బెంపఁబడియుం
డును. సౌతిచే మాత్రము పెంపఁబడియుండలేదని లోకమాన్యతిలకు
గారు వ్రాసినది యథార్థముగాఁగాన్పించుచున్నది. కాని మూలబీజ
మగు శ్రీకృష్ణునియుపదేశముమాత్రము నిజమని నమ్మవలసియున్నది.
సమస్తబంధువులు హతులగుటకు సిద్ధముగానుండినపు డర్జునునకట్టి
విషాదముకలుగుటలోను శ్రీకృష్ణుడు మోహావిభ్రాంతిఁ బోగొట్టుట
లోను నబద్ధము లేదు. కేవల కౌరవనాశనమే ప్రధానముగాఁదలచి
శ్రీకృష్ణుఁ డర్జునునిఁ బెక్కుసారులు ప్రోత్సహించి యున్నాఁడు.
అందు [illegible]. సర్వబంధు

వ్యాప్త ప్రేమను ప్రోద్రోయుటకు విస్తారముగాఁ జెప్పవలసియుండును. భగవత్సంబంధముగానైన విశ్వరూపమును తదితరదృష్టిగానైన నింద్రజాలమునుఁ జూపవలసిన యవసరమపుడు పూర్ణముగాఁ గలిగియుండెను. కర్తను, భోక్తను, నేనేయనియు, "చచ్చిన స్వర్గము నొందుదువు. జయించిన మహాసామ్రాజ్యము నొందుదువు" అని కూడ చెప్పవలసియుండును. ఇట్టి వేదాంతోపదేశములు—తెగింపుమాటలు—పిమ్మట నేడువందలశ్లోకములకు మించిన భగవద్గీతగాఁ బరిణమించెను. ద్రోణుని సైన్యాధిపత్యకాలమున నాతని తొందర చతురంగపుటాటలో శ్రీకృష్ణుఁడు పాండవులచే దొంగయెత్తులను వేయించి కౌరవుల సైన్యమును విశేషముగా నష్టపరచెను. "భగదత్త, భూరిశ్రవస, సైంధవ, ద్రోణుల" వధలు శ్రీకృష్ణునాలోచనావిశేషముచేతనె జరిగినవి. అర్జునునిఁ జంపుటకు గుప్తముచేసికొనిన కర్ణునిశక్తికి ఘటోత్కచునెరఁ జేసి యర్జునుఁ గాపాడుటయే గాక యర్జునసంతతికే కురురాజ్యాధిపత్యము కలుగుట కొకబీజమునుఁ గూడ నాటెను. అశ్వత్థామచే విడువఁబడిన నారాయణాస్త్రమును వ్యర్థము సేయుటలో నాతని చతురత మిగులశోభించెను.

కర్ణుని సైన్యాధిపత్యకాలమున నర్జునునకు విశ్రాంతిని, యర్జునుఁ డపుడు కాన్పించినపుడు "భార్గవాస్త్రము" బ్రయోగింపనుద్యుక్తుఁడగు కర్ణునకు భీమాదులతోఁ బోరి యలయికయుఁ గలుగునటుల నర్జునుని ధర్మజుఁజూచునెపమున శిబిరమునకుఁ గొనిపోయి ధర్మజార్జునులకుఁ గలిగినస్వల్పవివాదమును దానెవృద్ధిచేసి తానెతగవుఁదీర్చుటలోను, భార్గవాస్త్రపీడితమగు స్వసైన్యముఁజూచి కర్ణునితోఁబోర భయపడునర్జునునకు భీతింబోఁగొట్టుటలోను, సర్పముఖాస్త్రమును వ్యర్థము సేయుటలోను, రథమునెత్తుటకై క్రిందికిదిగిన కర్ణుని యుద్ధధర్మముచేఁ జంపనసందేహించు

నర్జునునకు యుద్ధధర్మవ్యతిరేకముగాఁ బ్రోత్సాహమిడి కర్ణుని జంపించుటలోను శ్రీకృష్ణుని ప్రతిభ మిగులశోభించెను.

శల్యుని సైన్యాధిపత్యకాలమునఁ గృష్ణునాలోచనావసరమంతగాఁ గలుగలేదు. మడుఁగులో డాఁగొనిన దుర్యోధనునిఁ బైకిరప్పించుటలోఁ గృష్ణుని యాలోచనము కార్యకారియయ్యెను. దుర్యోధనవధలోఁ గృష్ణుఁ డూరుభంగముఁ జేయుమని భీమునకు నర్జుననిచే సూచింపఁజేయకుండినచో భీముఁడే మృతినొందును.

దుర్యోధనువధలోఁ జేసిన యధర్మమునకుఁ గినిసిన తాత్కాలిక క్రోధియగు బలరామునకుఁ గోపోపశాంతిసేయుటయుఁ దన్నధిక్షేపించిన దుర్యోధనునకుఁ బ్రత్యుత్తరమిచ్చుటయు, ద్రోణాదులవధలకు నేనె కారకుఁడనని యధర్మశంకితులగు పాండవపక్షరాజులకు జవాబు చెప్పుటయుఁ జూడగా నేఁటి రాజకీయవేత్తలు మోఁడిజవాబులఁజెప్పుటను శ్రీకృష్ణునినాఁటినుండియే పరంపరగా నభ్యసించిరని తలఁపవలసియున్నది.

అశ్వత్థామ దుర్యోధనవధనాఁటి రాత్రియే పాండవశిబిరముపైఁ బడునని కృష్ణుఁడు హస్తిపురికిఁబోయి ధృతరాష్ట్రునోదార్చుచుండినపుడె తెలిసికొనెను. అందువలన వేగముగావచ్చి పాండవులను సాత్యకిని మిషపెట్టి శిబిరమునకుఁ గొన్నిక్రోశములదూరమునందున్న "ఓఘవతీ" తీరమునకుఁ దీసికొనిపోయెను. "ధృష్టద్యుమ్నుఁడు, శిఖండి, ఉత్తమౌజుఁడు, యుధామన్యుఁడు" మొదలగు ప్రఖ్యాతిగల పాంచాలవీరులు "ఉపపాండవుల" తోను వీరులగు పాంచాలసైనికులతోను శిబిరమునందుండిరి. ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు కృష్ణార్జునులఁగూడఁ దృణీకరించు మానినీమానవంతులు. ధర్మజునసంతరము రాజ్యము నెవఁడేలవలయునను వివాదాంశము రాఁగలదు. ధర్మజునకును బట్టమహిషియగు ద్రౌపదికిఁ బుట్టిన ప్రతివింధ్యునకే శ్రీకృష్ణుఁ డతనికిఁ బట్టాభి

షేకముఁ జేయుంప ద్రౌపదీధృష్టద్యుమ్నాదులు విధిగాఁ బ్రయత్నింతురు. లేక జ్యేష్ఠత్వమునే ప్రధానముగాఁ దలఁచినచో ఘటోత్కచుఁడే రాజ్యార్హుఁడు. అర్జునునకుఁగాని యాతని సంతతికిఁ గాని రాజ్యము సంక్రమించుట యెట్లుపొసఁగును? సాత్యకాదులకు మొదటినుండియు నభిమన్యునకే రాజ్యాభిషేకముఁ జేయువలయునను తలఁపుకలదు. ◆ ధర్మజ భీముల సంతతిఁ దప్పించి యర్జునసంతతికి రాజ్యమును సంక్రమింపఁ జేయుటకే ఘటోత్కచునిఁ గర్ణశక్తి కెరసేయుటయేగాక సౌప్తికవధకుఁగూడ నిష్టపడి ధృష్టద్యుమ్నాదుల నశ్వత్థామ కెరఁజేసెను. అశ్వత్థామవృత్తాంత మేమాత్రమైనఁ బాండవులకుఁగాని పాంచాలురకుఁ గాని తెలిసియుండినచో వారందఱు శిబిరమున "సప్రమత్తులై" చావులఁ దప్పించుకొందురు. కాని, ధృష్టద్యుమ్నాది పాంచాలురవలనఁ బడి హెచ్చయి కృష్ణాదులపలుకుఁబడి తగ్గిపోవును. ఘటోత్కచుఁడు చచ్చినను ద్రౌపదీభీములకుఁ జన్మించిన శ్రుతసేనుఁడుండినను, ద్రౌపదీ ధృష్టద్యుమ్న భీము లేకమై కృష్ణార్జునులఁ ద్రోసి రాజనఁగలరు. దుర్యోధనునిచేఁ గష్టములనొందినవారిలో భీముఁడే యగ్రగణ్యుఁడు, దుర్యోధనాదులను యుద్ధములో నోర్చినవాఁడును భీముఁడేను. అందువలన రాజ్యమునం దాతనికెక్కుడుభాగము కలదు. యుద్ధానంతరమాతఁడు యువరాజగుటయే కాక కోశాధికారికూడనై యుండుటచేతను ధర్మజార్జునుల కిష్టముండినను, ధృతరాష్ట్రుఁడు తనసుతులు మొదలగు వారికి శ్రాద్ధములఁ జేయుటకు ద్రవ్యమును వేడగా భీముఁ డనుమతింపనందున రాజస్వమునుండి యొక్కకాసునైన నీయలేక ధర్మజార్జునులు స్వంతధనమును ధృతరాష్ట్రుఁడుసేయు శ్రాద్ధాదులకిచ్చుకొనిరి. * ద్రౌపదీసుతులలో నొకఁడుగాని భీమునిసంతతిగాని నిలిచినచో పాండవుల

---

◆ అరణ్యపర్వ॥ 120 అధ్యా॥



* ఆశ్రమవాసపర్వ॥ 11 అధ్యా॥

ళ్లోని భీముఁడు పాంచాలురలోఁ జేరి కృష్ణాదుల పలుకుఁబడి తగ్గింతురు. యుద్ధారంభమునకే కృష్ణునిచర్యల కలుషపడుచుండిన యాదవులు పాంచాలురలోఁ జేరనను, చేరకుండినను, శ్రీకృష్ణునిపక్షమునకు రారు. అందువలనఁ గృష్ణుడు దీర్ఘదర్శియై యశ్వత్థామచేఁ బాంచాలురు నుపపాండవులు హతులగునట్లులను వదలివేసెను. ఇందువలన ద్రౌపదీభీములు కోఱలుపెఱికిన పాములవంటివారైరి. ధర్మజునకుఁ "పౌరవతి" యనుభార్యయు నామెయందు "దేవకుండు" ను, భీమునకుఁ "గాళి" యనుభార్యయు నామెయందు "సర్వగతుండు" ను జన్మించిరని భాగవతాదులలోఁ గలదు. ఊరుఁ పేరు లేని వీరివృత్తాంతము భారతమునందెచ్చటనుగాన్పింపదు. శ్రీకృష్ణుని రాజకీయవేత్తృత్వచేతనే యర్జునసంతతికి రాజ్యార్హతకలిగెను. తన చెలికొలిపౌత్రుఁడగు పరీక్షిత్తు రాజ కాఁగలిగెను. స్త్రీపర్వములోఁ జెప్పఁబడిన యమోఘమయు భీమునిగాథయు, గాంధారియొక్క శాపాదికము, అశ్వత్థామ బ్రహ్మశిరోస్త్రమున కడ్డుపడుటయుఁ బిమ్మట జనమేజయుని కాలమునఁ గూర్పఁబడినగాథలై యుండును. కారణమేమనగా—"అమోఘమయు" భీమునిగాథ మే నిజమైనచో (ఆశ్రమవాసపర్వములోఁ జెప్పఁబడిన) భీముఁడు ధృతరాష్ట్రుని దెప్పిపొడుచు వాక్యములలో నమోఘమయగాథనొకసారియైన నెత్తుకొనఁడా? మఱియు గాంధారిపాలికలనిలోఁ జూచిన యభిమన్యాదులశవములు కాకగృధ్రాదులకు వదలఁబడినను నాటికై పాఱువినమాలక్రితము చచ్చినను ప్రకాశమానములుగానుండుట యెట్లుపొసఁగును? ఆశవములు తైలద్రోణాదులలో నుంచఁబడలేదు. గాంధారి శ్రీకృష్ణునకు శాపమిచ్చుగాథలో ముప్పదియాఱనుట సందర్భముగా లేదు. అట్లు శాపమునేయిచ్చినచో నంతవ్యవధియేల? వెంటనే మీవారందఱు చావఁగా దిక్కులేకుండ నీవు చత్తువుగాఁక యనిసి యామహాపతివ్రత యేలయనరాదు. "యతో ధర్మస్తతో జయః" యను నా పతివ్రతాశిరోమణి

మావారల కన్యోన్యకలహముఁబొంది మాకులనాశముఁజేసిన నీవా ఫలము ననుభవింతువుగాఁకయని తిట్టినఁ దిట్టునని, సర్వయాదవ నాశ నానంతరము విచారగ్రస్తుఁడగు శ్రీకృష్ణుఁడు గాంధారీవాక్యముఁ దలఁ చెను ♦ అనుటచే నూహింపఁబడుచున్నది. స్త్రీపర్వగాథలే సిద్ధ మైనచో పట్టాభిషేకానంతరము ధర్మజునకు విశేషధర్మోపదేశముఁ జేసినను భీష్ముఁడు తన్నుఁజూచి శోకించు గాంధారి నొక్కయోదార్పు వాక్యమున్నైన పలుకకుండునా? కాన స్త్రీపర్వగాథ లసందర్భములుగా నున్నవి. మఱియుఁగృష్ణుఁ డశ్వత్థామ బ్రహ్మశిరోస్త్రము "నపాండ వాయ" య్యెడుగాఁకయని విడుచుసందర్భగాథలో నుత్తరాగర్భమును రక్షింపుసంవాదము నశ్వత్థామతోఁ జరిపినటులు సౌప్తికపర్వాంత మునఁగలదు. అశ్వమేధపర్వములో "అశ్వత్థామచే" విడువఁబడిన బ్రహ్మాస్త్రముచే నుత్తరాగర్భజనితుఁడగు శిశువు శవాకారుఁడై యుం డఁగాఁ దత్కాలాగతుఁడగు శ్రీకృష్ణునితోఁ గుంతీసుభద్రాదులు మొఱ్ఱ నిడఁగా శ్రీకృష్ణుఁడు బ్రహ్మాస్త్రశమనముఁ జేసి యాశిశువు నుజ్జీవింపఁ జేసెననియు, కులము పరిక్షీణమైనపుడు జన్మించినవాఁడుగాన పరి క్షిత్తను నామముకలవాఁడయ్యెనని యశ్వమేధపర్వమునఁగలదు * బ్ర హ్మశిరోZస్త్రము బ్రహ్మశిరోనామకాస్త్రము నొక్కటికావనియు వా నికి వేర్వేఱు ప్రయోగోపసంహారాదులు కలవనియు మహాభారతమునందే కాక రామాయణాదులవలనను "పంచమహాస్త్రవిధానా" ది మంత్ర శాస్త్రగ్రంథములవలనఁ దెలియవచ్చును. కురు పాండవ వీరులలోఁ బెక్కండ్రకు బ్రహ్మాస్త్రము తెలియును. భీష్మ ద్రోణ కర్ణా శ్వత్థామ ధర్మజార్జున సాత్యకు లాయస్త్రముఁ బెక్కుసారులు ప్రయోగించిరి. బ్రహ్మశిరోనామకాస్త్రము ద్రోణాశ్వత్థామార్జునులకు మాత్రమె

---

♦ మౌసలపర్వ॥ 4 అధ్యా॥

* అశ్వమేధపర్వ॥ 66, 67, 68, 69 అధ్యా॥

తెలిపినటుల సౌప్తికపర్వమున సూచింపఁబడెను. సౌప్తికపర్వములో నొకవిధముగాను అశ్వమేధపర్వమున మఱియొకరీతిగాను సందర్భశుద్ధి లేని యీగాథ పిమ్మటఁగూర్పఁబడియుండును. శ్రీమద్భాగవతములో నిది మఱియువిరుద్ధముగాఁ జెప్పఁబడినది.

ఉత్తరాగర్భస్థశిశువు బ్రహ్మాస్త్రపీడితుఁడై బాధనొందుచుఁ జావ సిద్ధముగానుండు సమయమునఁ గృష్ణుఁ డంగుష్ఠమాత్రశరీరుఁడై గదాధారియై యామెగర్భముఁ బ్రవేశించి శిశువునకుఁ గాప్పించుచు బ్రహ్మాస్త్రముతోఁ బోరి దానిం దప్పించి శిశువునురక్షించి యంతర్హితుండయ్యెననియు, జన్మించినశిశువు తన్నురక్షించినకృష్ణునిఁ జూచుటకు నలుదిక్కులఁ బరీక్షించుటచేఁ బరీక్షిన్నామధారుండయ్యెననియుఁ గలదు. భారతములోనె యన్యోన్యవిరుద్ధముగా వర్ణింపఁబడిన యీగాథ భాగవతములో మిగులవిరుద్ధముగా వర్ణింపఁబడుటవింత కాదు. ఒకటిమాత్రము నిజమై యుండును. పరీక్షిత్తుజన్మించిన పిమ్మట నేనేని బాలరోగపీడితుఁడై జీవితాసంశయము కలుగఁగాఁ గుంత్యాదులు పాండవులపైఁ గుపితుఁడగు నశ్వత్థామ యేదేని మంత్రప్రయోగముఁ జేసి బాలునిఁ జంపనుద్యుక్తుఁడగుచున్నాడని తలఁచి కృష్ణుతో మొఱ్ఱవెట్టియుండును. కృష్ణుఁడేదేని మంత్రతంత్రములఁ జేసియుండఁగా శిశువు తేఱుకొనియుండును. అందువలననే శ్రీకృష్ణునకు "పరీక్షిత్ప్రాణసంధాత" అనుబిరుదము పిమ్మటఁ గలిగియుండును. "దయ్యములఁ బట్టించుటయు మంత్రతంత్రాదులచే" వానిని వదల్చుకొనుటయు, అథర్వవేదమున నేకలదు. బాలగ్రహాదులకుఁగూడ మంత్రతంత్రాదు లవలంబింప "శుశ్రుతా" ది వైద్యగ్రంథములు చెప్పుచుండగాఁ బ్రాచీనులు విధిగావీనియందు పట్టుదలతోనుండిరనియు నిది మూఢాచారమెకాక ప్రాచీన నాగరికాచారమేయని తలఁపవలసియున్నది.

ఈమంత్రతంత్రాదులయందు నేఁడు హూణభాషాభ్యాసముచే నాగరికతను సంపాదించుకొనినవారు నమ్మకము లేకయుండుటఁ జూచు

చుండలేదా? శ్రీకృష్ణుఁడు కౌరవవధ నన్యాయముగాఁ జేయించెనని "ఉద్దాలకుఁడు" వంటిఋషికూడ తలఁచెను. ఉద్దాలకునకుఁ గూడ శ్రీకృష్ణుఁడు విశ్వరూపముఁ జూపి కర్తను భోక్తను నేనెయని మోహా మునో మోహవిభ్రాంతితో కలిగించెను •

వసుదేవుఁడుకూడ శ్రీకృష్ణుఁడు కురుక్షేత్రయుద్ధములోఁ జేసిన కార్యముల నంగీకరింపఁడని కాఁబోలు సమరవార్తలను సంకుచిత పరచియే నుడివెను. కురు పాండవ సంగ్రామానంతరము కృష్ణుఁడు చేసిన మహాత్కార్యములలోఁ బరీక్షిత్ప్రాణసంరక్షణమె యెన్నఁదగియున్నది. కురుక్షేత్రయుద్ధానంతరము ముప్పదియారు సంవత్సరములు జీవించెనని మహాభారతములోఁ గలదు. ఆకాలములోఁ గృష్ణుఁడు చేసిన కార్యములలో "అనుగీతను" అర్జునునకుపదేశించుటయుఁ బరీక్షిత్ప్రాణసంధానముఁ జేయుటయు ననునవియే ప్రఖ్యాతి కార్యములు. అనుగీత సౌతి కాలఁపుదని విమర్శకులతలంపు. ఈముప్పదియారుసంవత్సరములలోను మహావీరులందఱు కురుక్షేత్రయుద్ధముననే మృతినొందుటచే ద్వారకపై దండయాత్రఁ జేయువారు లేకుండిరికాని, అధికారబలముండుటచే శ్రీకృష్ణునిపక్షమువారగు "వృష్టి"కులజులును, రాజవంశీయులును, జనాధికృతయుఁగల భోజకులజులును, అంతఃకలహములఁ బెంచుకొనుచుండిరనియు సురాపానము మితిమీఱెననియు, అధికారమత్తతచేఁ గృష్ణసంజాతులు పెద్దలయెడ గౌరవములేక ఋషీశ్వరులఁగూడ నిర్లక్ష్యపెట్టుచుండిరనియు, "మౌసలపర్వ" గాథలవలనఁ ద్యోతకమగును. నామమాత్రపు రాజునువృద్ధుఁడునగు "ఉగ్రసేనుని" యాజ్ఞను యాదవులునిర్లక్ష్యము చేయుచుండిరి. సాక్షాద్భగవదవతారమని యెన్నఁదగిన శ్రీకృష్ణునకుదనయుఁడును, శ్రీరామభక్తాగ్రేసరుఁడగు జాంబవంతునిదౌహిత్రుఁడుగాఁ జెప్పఁబడు సాంబుఁడే గర్భిణీస్త్రీ వేషమును ధరించి కృష్ణసందర్శనమునకేతెంచిన



• అశ్వమేధపర్వ॥ 53 అధ్యా॥

"విశ్వామిత్రా" ది మునులను హేళనము జేసి వారిచే దిట్టులం దినుట మాత్రమే కాక నతి యేమి యగును? అపుడు కలుగుచున్న "ఉత్పాతము లం" జూచి యుధిష్ఠిరుడు ద్వారకలో నెవలును, కృష్ణబలరామాదుల వాళ్లములవారును గూడ సురాపానముం జేయరాదనియుం జేసిన యెడల సకుటుంబముగా శూలారోపణముం జేయంబడుదురనియు సాటింపు చేయించెను. జనసామాన్యము రాజాజ్ఞచే భయము నొంది సురాపానమును మానిరి * కాని, అవతారపురుషుం డనంబడు బలరాముండే శ్రీకృష్ణుండు సన్నిధినుండంగా గృతవర్మతోను సాత్యకితోను కలిసి చెనంద్రావెను ♦ ఇది రాజాజ్ఞను లెక్క సేయకపోవుటయే కాక నాంటికి శ్రీకృష్ణునియం "దావంతి" యైన గౌరవమును యాదవులు చూపుచుండ లేదని స్పష్టమగుచున్నది. ఎపుడు ప్రజలు రాజాజ్ఞను మన్నింపరో, స్వనాయకుని గౌరవింపరో నాండే యాజాతికి దురవస్థాకాలము సంప్రాప్తమగునని యాదవనాశగాథచే దెలిసికొనవలసి యున్నది. శ్రీకృష్ణుండు బలరామునివలెం దెగద్రావి "హలిప్రియా" యని కల్లువకు శాశ్వతబిరుదము నొనంగ లేదు కాని మితపానమును రహస్యముగాం జేయువాండని యింతకుముందే వ్రాసియుంటిని. తెగద్రావి సాత్యకి సురాపానమత్తుండై తనకంటె నధికముగా ద్రావిన కృతవర్మనధిక్షేపింపంగా నాతండు సాత్యకిం దిరిగి యధిక్షేపించెను. సాత్యకి కృష్ణునితో నది పెద్ద యాక్షేపణముగా సూచింప శ్రీకృష్ణుండు (వృష్టిభోజకులజుల వివాదమును మనస్సునం దుంచుకొని కాంబోలు) భోజులపైం దన దృష్టినిం బ్రసరింపం జేసెను. అది యాజ్ఞగాం గొని సాత్యకి కృతవర్మం దెగవేసి భోజులపైంగవిసెను. అంత సంఖ్యాధిక్యతగల భోజులు బలవంతులైనను సంఖ్యాహీనత్యగల వృష్టికులులపైంబడి కృష్ణతనయులు

* మౌసలపర్వ॥ 1 అధ్యా॥



♦ మౌసలపర్వ॥ 3 అధ్యా॥

నాతనిసంబంధులునగు "ప్రద్యుమ్న, సాంబ, అనిరుద్ధ, గద, చారు దేష్ణా" దులను వధియించిరి. భోజులలోఁ గూడ, కృతవర్మ, అక్రూరాదులు మృతినొందిరి. సంఖ్యానికృతచే మిగిలినభోజులను శ్రీకృష్ణుఁడే స్వయముగాఁజంపెను. ఇంతకు సాత్యకికృతవర్మలకు గల యాక్షేపణాంశములేవి? కురుక్షేత్రయుద్ధవిశేషము లేను. సాత్యకి మత్తుఁడై యొడలు తెలియక కృతవర్మవలను నుపలక్షించుచు నిద్రవోవుసైనికులఁ జంపుట యేపాటిశౌర్యమాయెను. దానికిఁబ్రద్యుమ్నుఁడు సంతసించెను. కృతవర్మ చేయితెగిన భూరిశ్రవసుంజంపుట మెట్టిశూరత్వమనెను. ఇదియే వివాదాంశము. సురాపానమత్తులు చేయు ప్రసంగములిట్టివియేకదా, లేకుండిన ముప్పదిమూఁడువత్సరములక్రితము జరిగిన యుద్ధవిశేషముల నానాఁడాక్షేపణాహ్వానముగాఁ ద్రవ్వకొనుటకేమి సందర్భముకలిగెను? కలహారంభముననే బలరాముఁడొంటరిగా సమీపవనమున నొకవృక్షమూలము నాశ్రయించి సమాధినిష్ఠాగరిష్ఠుఁడయ్యెను. సురాపానమును విశేషముగాఁజేసిన మూఁతనికి సమాధినిష్ఠ కుదురునేమో యనుభవజ్ఞులు చెప్పవలసియున్నది. బలరాముని శ్రీకృష్ణుఁడు సర్వయాదవనాశనానంతరము వనమునఁజూడఁబోఁగా నాతని ముఖమునుండి మహాసర్పమొకటి వెడలి యంతర్హితమయ్యెనని చెప్పఁబడుటచే బలరాముఁడు మత్తుఁడై యేవృక్షమాక్రించెనో యందుకొని యేమున్నసర్పము వాఁతనోపడి మృతుఁడయ్యెనని తలఁపవలసియున్నది. బలరాముఁడొకప్పుఁడు సురాపానమత్తుఁడై, ఋషులు సూతునివలనఁ బురాణములనువినుచున్న నైమిశారణ్యమునకేఁగి ఋషులుప్రత్యుద్ధానముఁజేసినను పౌరాణికనియమమునననుసరించి ప్రత్యుద్ధానముఁజేయని సూతుపైఁగినిసి నన్నేల మర్యాదంజేయవని యడిగినదియే తడవుగా సూతునితలఁ దెగవేసెను. ఋషులుజడిసి వరుగెత్తిరి. పిమ్మటఁదెలిసి పశ్చాత్తప్తుఁడై తీర్థయాత్రలఁజేసెననియు సూతుఁడు బ్రహ్మపదప్రాప్తుండయ్యెననియు మార్కండేయపురాణమునఁగలదు. భాగవతములో

శౌనకాదులు ప్రార్థింపఁ దనమహిమచే సూతునిఁ బునరుజ్జీవింపఁజేసి తీర్థయాత్రకేఁగెనని కలదు. ఎటులనైన బలరాముఁడు తెగఁద్రావి యు కార్యములఁ జేయువాఁడనియు శరీరస్మృతి తెలియక మెలఁగువాఁడనియుఁ దెలియఁగలదు. శ్రీకృష్ణుఁడనదమై నేమియుఁదోపక శూన్యవనమున నొకచో శయనించి కురువంశక్షయమెట్లయ్యెనో యాదవవంశక్షయ మట్లయ్యెగదాయని గాంధారీశాపవాక్యమును స్మరించుచుండగా నొకవ్యాధుఁడు దూరమునుండిపొంచి శయనించినకృష్ణుని మృగముగాఁదలఁచి బాణముతోఁ గొట్టెను. అది కృష్ణునిపాదాగ్రమునఁదగిలి దానితోనె మృతినొందెను. కృష్ణుఁ డెంతటియవతారపురుషుఁడైనను, సర్వయాదవనాశనానంతరము నష్టశేష యాదవకులములఁగాపాడనుని "బభ్రువు" ను ద్వారకకుఁబొమ్మనిచెప్పుటలోను, దారుకు నర్జునుని కడకంపుటలోను, మృతయాదవయుగు ద్వారకనుఁజేరి వసుదేవునితో నిట్టిద్వారకలోనుండలేను తపస్సుఁజేయఁబోయెదను. అర్జునుఁడువచ్చి తక్కినపనులఁ జక్కజేయునని చెప్పి వనములో విచారించుచు శయనించుటలోను, సంపూర్ణమానవత్వము శ్రీకృష్ణునియందు గోచరించును. ఏతపస్సును జేయు లేదు. అత్యాసన్నమరణముకూడ శ్రీకృష్ణునకుదెలియలేదు. ఇది సంపూర్ణమానవత్వముకాదా, అట్టి మానవత్వమె లేకుండిన యెడల అర్జునుఁడు కృష్ణాంతఃపురస్త్రీలంగాపాడ హస్తిపురికిఁ గొంపోవుచు బోయులచేఁ గోలుపోయిన యాస్త్రీలభవిష్యద్వృత్తాంతముఁ దెలిసినచో బభ్రువుతో దస్యులు ద్వారకలోని యాదవులునశించుటచే ద్వారకం దోచుకొందురనియు స్త్రీలఁగాపాడుమనియు నేల చెప్పియుండును? అర్జునునికంటెఁ గొన్నిమాసములు పెద్దగానుండిన శ్రీకృష్ణుఁడు నిర్యాణముఁ జెందునాటికి 104 సంవత్సరములవాఁడుగా భారతమువలనఁ దెలియనగును. ఆంధ్రీకృత భాగవతమునకుఁ టీకవ్రాసినవారు కృష్ణుఁడు 120 సంవత్సరములకుఁబైగా జీవించెనని యేదేదో వ్రాయుట చింత్యము. అసలగలిన, పాండవవయోనిర్ణయసమయమున

విస్మృతమును. శ్రీకృష్ణనిర్యాణానంతరము దారుకునివలన యాదవ నాశముఁ దెలిసికొని యర్జునుఁడు ద్వారకకువచ్చి వసుదేవునివలన సర్వ వృత్తాంతముఁ దెలిసికొని యప్పుడె మృతినొందిన వసుదేవుని, యర ణ్యమున రామకృష్ణులశరీరములను దహించి మృతయాదవకాంతలను బాలురను పరిజనులను, వీరలైనంత ధనధాన్యములఁ దీసికొని ద్వారక నుండి యింద్రప్రస్థమునకుఁ బ్రయాణమై పట్టణమునుండి వెడలగనే ద్వారకాపురి సముద్రముపొంగుటచే మునిగిపోయెను. నేఁటివలెఁగాని యింతకంటె హెచ్చుగాఁగాని భారతకాలమున "భూతోత్పాతశాఖ" (మెటిరియాలాజికల్ డిపార్టుమెంటు) బాగుగా పనిచేయుచున్న నిదర్శ నములుకలవు. ఏడుదినములలో సుప్పెనవచ్చి ద్వారకనుముంచునని నాఁటివారు తెలిసికొనఁగలిగిరనుటయే దీనికి నిదర్శనము. "భూతోత్పాత శాఖ" బాగుగా రాజ్యమునఁ బనిచేయుచుండవలెనని సభాపర్వమునను గలదు. దానినిట వివరింపనావశ్యకము లేదు. అర్జునుఁడిట్టుల ననాథ లగు స్త్రీ బాల బాలికలను భాగ్యభోగ్యములతో "మరుస్థల" (రాజ పుత్రస్థానపు ఎడారి) మార్గమునఁ దీసికొనిపోవుచుండగా నిశ్శేషసైన్య బలములేక రక్షణీయులే విస్తారముగానుండుటచే దారిదోపుడువృత్తిగల పంచనదప్రాంత కిరాతులాసంఘముపైఁబడి దోఁచుకొనిరి. అందు స్త్రీలు విశేషించి కృష్ణునియంతఃపురకాంతలు కూడ దోఁచుకొనఁ బడిరి. అర్జునుఁడొంటరియగుటచేతను శతాధికవృద్ధుఁడై బలహీనుఁ డగుటచేతను, సర్వయాదవనాశముచేతను, అందుఁ దనకండయగు శ్రీకృష్ణనిర్యాణముచేతను విచారగ్రస్తుఁడై యుండుటచే దస్యులగు కిరాతులనుండి విస్తారమగు యాదవనారీసంఘమును రక్షింపలేకపో యెను. కొందఱు యాదవకాంతలు కామాతురులై కిరాతులగూడు టకుఁ జెదరిపోయిరని యీక్రిందిశ్లోకార్థము చెప్పఁగుచున్నది * "పిమ్మట

---

* శ్లో॥ ఏవం తా [illegible] పశ్యతో [illegible]
సమంతతోఽపకృష్యంత । కామాచ్చాన్యాః ప్రవవ్రజుః॥ మౌసలపర్వ॥ 7అధ్యా॥

నందఱుయోధులు నుండగా నానారీరత్నము లన్ని వైరులనులాగివేయఁబడెను. మఱియుఁగొందఱు కామమువలననే వెళ్లిపోయిరి" బహుపత్నీత్వ మాయుక్తమని యీషోడశసహస్రాంతఃపురస్త్రీ గాథయే చెప్పెను. శ్రీకృష్ణుఁడు నిర్యాణసమయమునఁగూడ స్త్రీగణ మెటులగునోయనియే విచారించుచు బభ్రువునకును, దారుకునకుఁ జెప్పు వాక్యములచే నూహింపవలసియున్నది, అర్జునునకు వ్యాసుఁడు షోడశాంతఃపురస్త్రీల యపహరణముఁగూర్చిన గాథ కేదియో శాపసంబంధముఁ జెప్పినటులఁగలదు కాని యది కొన్నిప్రతులలోఁ గాన్పింపనందున నది నవీనకల్పితమైయుండును. అర్జునుఁడు కృష్ణప్రపౌత్రుఁడగు "వజ్రు" నకు నింద్రప్రస్థరాజ్యమును, (ఇది ప్రాచీనమై యాదవులకు "అభిజనమ" గు మధురారాజ్యముతోఁగూడియుండి యాదవులు ద్వారకకువలసపోయినపిమ్మటను పాండవులచేతనో కౌరవులచేతనో "ఇంద్రప్రస్థ" రాజ్యములోఁ గలుపఁబడియుండును. మధురాపురి, ఇంద్రప్రస్థమని చెప్పఁబడు "ఢిల్లీ" కి నలువదిమైళ్లకు లోపుననే కలదు. మధురాపురికోటలు కంసునినాఁడే రక్షణానర్హముగానుండుటచేతను, దృఢదుర్గాదికముగల యింద్రప్రస్థపురమును వ్రజునకర్జునుఁడిచ్చియుండును) "సరస్వతీపురి" ని సాత్యకికుమారునకిచ్చెను. (సరస్వతీపురి యెచ్చటిదో తెలియదు) "మార్తికావతమును" కృతవర్మకుమారునకిచ్చెను. ("మార్తికావతము" మొదట శిశుపాలసోదరుఁడగు సాళ్వుఁడేలువాఁడు. వానిని కృష్ణుఁడు సంహరింపఁగా వానిపుత్రుఁడు రాజ్యమునకువచ్చెను ఆతఁడు "మార్తికావతుఁడ" నియే భారతమునఁగలదు. కృష్ణపాండవులయందుండు ప్రేమఁబగచే నాతఁడు దుర్యోధనుపక్షమునకువచ్చి పద్మవ్యూహములో నభిమన్యుచేఁ జచ్చెను. ఆరాజకమగు నాప్రదేశమునకుఁ గృతవర్మసుతుఁడు పరిపాలకుఁడై భోజకులులగు యాదవులఁ గాపాడెను. యాదవులు భోజులునగు వారినంతతియే "దేవగిరి, ఓరు



గల్లు, బల్లాల యాదవరాజులను, విజయనగరరాజులగు బుక్కరా

యాదులకు, మూలపురుషులుగాఁ దలఁపఁబడుచున్నారు. భోజులను పేరునఁ గొందఱుగొల్లలు పశ్చిమాంధ్రమున రాజ్యముఁ జేసిరి. వారి సంతతి నేడును కలదు. ఇప్పటి ఓరుగల్లుపట్టణమునకు "హట్టివాడ" అను పేరుకలదు. మార్తికావతాపరనామధేయమగు, మార్తికావతము తత్భ్రమరూపమున "హట్టివాడ" మైనదేమో పరిశోధకులాలోచింతురు గాక) భోజులలోని యాక్రూరునికుటుంబమును వజ్రునకు సర్జునుఁడు కాపాడనియోగించెను. కాని పూర్వవైరములఁ దలఁచి కొల్లలు వారలనికడనుండక చెదరిపోయిరట. ఇంతవరకువ్రాసిన శ్రీకృష్ణుని చరితము మహాభారతముతో సంబంధించినది.

## ఇతర విషయములు



కృష్ణుఁడుక్షత్రియుఁడు కాఁడు. అందువలన నేయాతనికి రాజ్యార్హతకలుగ లేదని భారతాదులలోఁ గలదు. ఉత్తమరాజకాంతలను రాక్షసవివాహముచేతనె యాతఁడు పరిగ్రహించెను. అందువలనఁ బెక్కండ్రు క్షత్రియులాతనిం ద్వేషించిరి. దుర్యోధనుని కుమార్తె "లక్ష్మణ" యనునామెను కృష్ణపుత్రుఁడు సాంబుడు పెండ్లియాడఁ బ్రయత్నింపఁగా దుర్యోధనాదులు క్షత్రియేతరుఁడు క్షత్రియకాంతం బెండ్లియాడుట కూడదని నిరోధించియు, బలరాముని బలవంతముచేఁ బెండ్లిచేసినటుల భాగవతమునఁ గలదు. ఉద్దాలకుఁడు, దుర్వాసుఁడు, శ్రీకృష్ణునిచేతను, "కణ్వవిశ్వామిత్రా" దులు శ్రీకృష్ణపుత్రులచేతను, శౌనకాదులు గౌరవించు సూతుఁడు బలరామునిచేతను ధిక్కరింపఁబడి యిట్టులఁ బడుటఁ జూడఁగా యాదవులకు బ్రాహ్మణులపై గూడ నసూయకల దని తోఁచును. ఇట్టి "లోజాతి" వారి నాయకుఁడగు శ్రీకృష్ణుఁడు పరిశోధకులచే నన్యదేశీయులుగాఁ బరిగణింపఁబడినట్టియు, గురువు బ్రాహ్మణుఁడు నగు ద్రోణునివధకును, గురుపుత్రుని శిరోమణ్యపహ

మొనకుచు పెంచి పెద్దఁజేసిన భీష్మునివధకుఁ గులవృద్ధులగు "బాహ్లీక సోమదత్తా" దుల వధలకు, పితృసఖుఁడగు భగదత్తువధకుఁ బాల్పడుటయే కాక, సర్వకురువంశనాశముఁ జేసిన పాండవులకంశ మైనిలుచుట యుక్తముగా నుండెను. వైదికేతరములగు నిట్టి యధర్మముల్ జేయుటచేతనె శ్రీకృష్ణ పాండవుల పేరులు వైదికవాఙ్మయమున నుచ్ఛరింపఁబడ లేదు. దేవకీపుత్రుఁడగు కృష్ణుఁడు "ఘోరఅంగిరసుస" అను మునికి శిష్యుఁడై జ్ఞానోపదేశముఁ బొందినట్లుగలదు. ఆపొందిన జ్ఞానమునకును గీతలలో గృష్ణుఁ డుపదేశించిన జ్ఞానమునకు సంబంధము కానఁబడనందున గీతోపదేశకకృష్ణుఁ డాతఁడు కాఁడేమోయని తిలకుమహాశయుఁడు గీతారహస్యమున వ్రాసియున్నాఁడు. భారతకృష్ణుఁడు వేఱు, భాగవతకృష్ణుఁడు వేఱనని "రామకృష్ణభాండార్కరు" గారు వ్రాసియున్నారు. భక్తి యనునది ప్రాచీనకాలమున లేకుండెననియు, "కర్మ, జ్ఞానము" అనునవి రెండే ప్రాచీనకాలమున నుండెననియు, కృష్ణవిషయికభక్తి మధ్యకాలమున నేర్పడె ననియు శ్రీ లోకమాన్య తిలకు గీతారహస్యములో విశేషముగాఁ జర్చించియున్నాఁడు. దానినిట వ్రాయుటకుఁ దావుచాలదు. కాని నాకుఁదోచినరీతి నింకొకసంగతిని వ్రాయుచున్నాఁడను. * "శాకటాయనుఁ" డను ప్రసిద్ధవ్యాకరణ

---

* శాకటాయనుఁడు "భక్తిః" అను అధికారసూత్రమునకుఁ బిమ్మట "వాసుదేవార్జునాద్వుఞ్" (3—1—124) అని చెప్పెను. శబ్దనిష్పత్తిలో వాసుదేవుని భక్తుఁడు, వాసుదేవకుఁడు, అర్జునిభక్తుఁడు, అర్జునకుఁడు, అగునని. పాణిన్యాచార్యులుకూడ తన అష్టాధ్యాయిలో "వాసుదేవార్జునాభ్యాంవున్" (4—3—98) అని చెప్పెను. దీనివలనఁగూడ నైవిధముననే రూపనిష్పత్తియగును. కాని శాకటాయనుఁడు "వుఞ్" అనఁగా, పాణిని "వున్" అనెను. స్థూలదృష్టిచే రెంటికి రూపనిష్పత్తిలో నర్థమొక్కటియే, స్వరమునఁగూడ భేదములేదు. కాని "పతంజలి" మహాభాష్యమున జెప్పిన యీ క్రిందివాక్యములచే శాకటాయనుని వాసుదేవార్జున భక్తులకును "పాణిని" యొక్క వాసుదేవార్జునభక్తులకును భేదముకలదని తెలియవచ్చును. మహాభాష్యమ్" (4—3—98) ... "వున్" విధీయతే! స "గోత్రక్షత్రియాఖ్యేభ్యోబహులంవుఞ్" ఇత్యేవసిద్ధం. సహ్యస్తి విశేషః. వాసుదేవశబ్దాత్

శాస్త్రకర్తయు "పాణిని" యను లోకప్రసిద్ధవ్యాకరణ శాస్త్రకర్తయు "పతంజలి" యను పాణినివ్యాకరణభాష్యకర్తయు "వాసుదేవార్జునుల" యందు భక్తిగలవారుండిరని చెప్పియున్నారు. పతంజల్యాదులు ఋషులుగానె పరిగణింపఁబడిరి. (వైదికఋషులుకారు) పతంజలి, క్రీ. పూ. 3 శతాబ్దమునను, పాణిని క్రీ. పూ. 8 శతాబ్దమునను శాకటాయనుఁడు క్రీ. పూ. 12 శతాబ్దప్రాంతమున నుండిరి. శాకటాయనుని కాలమున వాసుదేవార్జునులను వీరులనుగామాత్రమె తలఁచి భక్తి సేయువారుండిరి. పాణినికాలమునను వారిని భగవదవతారముగా దలఁచుచుండిరి. పతంజలికాలమున వాసుదేవుని భగవంతునిగా దలఁచుచుండిరికాని యర్జునుని నటులఁ దలఁపరైరి. క్రీ. పూ. నాలవశతాబ్దమున "సెల్యూకసు" చేఁ జంద్రగుప్తచక్రవర్తి కడ రాయబారిగా

---

"వుఞోవా, వునోవా?" తదేవరూపం. సఏవస్వరః. ఇదంతర్హి ప్రయోజనం వాసుదేవశబ్దస్య, పూర్వనిపాతం వక్ష్యామీతి. అథవా నైషాక్షత్రియాఖ్యా, సంజ్ఞైషా తత్రభవతః"

తా॥ ఎందుకొఱకు వాసుదేవశబ్దమునకంటె వున్ విధింపఁబడెను? "గోత్రక్షత్రియాఖ్యేభ్యో బహులంవుఞ్" (4—3—99) అను సూత్రముచేతనె యారూపము సిద్ధించును గదా! విశేషమేమియు లేదు. "వుఞ్" అనినను "వున్" అనినను "రూపము, స్వరము" సమానమేను. అయితే ప్రయోజనమొకటికలదు. వాసుదేవశబ్దమునకుఁ బూర్వనిపాతముకలదని, లేక క్షత్రియశబ్దమాత్రముఁ జెప్పనది కాక, భగవంతునిఁజెప్పు శబ్దపరమై యున్నదని—పై భాష్యవాక్యములఁ బట్టి, "వుఞ్" క్షత్రియమాత్రునియందుండు భక్తిని "వున్" భగవత్పరముగానగు భక్తినిఁ జెప్పునని స్పష్టమగుచున్నది. శాకటాయనుఁడు "వుఞ్" వాడుటచే నాతనికాలమున వాసుదేవార్జునులను క్షత్రియవీరులుగాఁ దలఁచుచు వారియందు భక్తిసేయువా రుండిరనియు అపుడు వాసుదేవుఁడు భగవంతుడుగాఁ దలఁపఁబడలేదనియు, పాణినికాలమునకు వాసుదేవార్జునులు (నరనారాయణులు) భగవదంశా సంభూతులుగాఁ దలఁపఁబడిరనియు పతంజలికాలమునకు వాసుదేవుఁడు కేవలభగవంతుఁడుగానె తలంపఁబడుచుండెననియు సూక్ష్మముగా నాలోచించిన స్పష్టమగును. పతంజలి, అర్జునశబ్దమును పేరెవఁ దలపెట్టకుంటచే నర్జునుఁడు భగవత్పదవినుండి నాఁటివారిచేఁ దొలగింపఁబడెనని స్పష్టమగుచున్నది.

నుంపఁబడిన "మెగస్థనీసు" శౌరసేనులనుజాతివారు "మధురాపట్టణ" ప్రాంతమున శ్రీకృష్ణునిఁగొలుచు భక్తులుగానుండిరని వ్రాసెనట! కాని శాకటాయనుని కాలమున కృష్ణార్జునులు క్షత్రియవీరులుగా నేఁడు మనము "శివాజీ, కృష్ణదేవరా" యాదులపై భక్తిసూపుచున్నటుల భక్తింజూపుచు పాణిని కాలమునకు నేను మనము బుద్ధ, శంకర, రామానుజాదులపైఁ భక్తిఁజూపుచున్నటుల భక్తిఁజూపుచుండిరనియు "మెగస్థనీసు" కాలమునకొక్క శ్రీకృష్ణునే "శూరసేన" దేశీయులు (మధురా ప్రాంతము శూరసేనదేశము) శ్రీకృష్ణునిమాత్రము కులదైవముగా సేవించుచుండిరనియు పతంజలికాలమునకు వసుదేవుఁడు పూజ్యాస్థానము నుండి తొలఁగెననియు శ్రీకృష్ణుఁడు కేవలము భగవంతుఁడుగానె పరిగణింపఁబడెననియు స్పష్టముగఁ జున్నది. "గోపాలతాపిన్యుపనిష" దాదులు సంతానగోపాలమంత్రాదులు నీకాలమునే పుట్టియుండును. మహాభారతములోని కృష్ణుఁడు కొన్నిచోటులను మాత్రమె దేవుఁడుగా వర్ణింపఁబడెనుగాని, మిగిలినప్రదేశములందెల్ల నాతఁడు రాజకీయ ధురంధరుఁడుగాను, వీరుఁడుగానె వర్ణింపఁబడెను. పురాణములలోఁ బ్రాచీనముగాఁ దలంపఁబడు "విష్ణు" పురాణములోను, మహాభారతాంతర్గతమనఁబడు "హరివంశము" లోను దైవ మానుష భావములు రెండు నించుమించు సమానముగానె శ్రీకృష్ణునివిషయమున వర్ణింపఁబడెను. దైవభావాతిశయము కొంతహెచ్చుగనుండిన నుండును. శ్రీమద్భాగవతపురాణము, కృష్ణబలరాములు భగవంతుని నల్లని తెల్లని వెండ్రుకలని ద్వితీయస్కంధమునఁ జెప్పెను. కాని దశమ స్కంధము వచ్చునప్పటి కాసంగతిని మరచి కాఁబోలు కేవలావతారవిష్ణుఁడే దేవకీగర్భమునం జన్మించెనని చెప్పెను. బమ్మెర పోతన దాని నాంధ్రీకరించుటలో తన్మయుఁడై పెంచి యాంధ్రీకరించెను. బ్రహ్మాండ, పద్మపురాణాదులు శ్రీకృష్ణుని దేవునిగనే చెప్పెనవి,

"బ్రహ్మవైవర్త" పురాణము శ్రీకృష్ణుఁడు భూలోకవాసి కాక "గోలోకము" అను లోకాధిపతియనియు "రాధ" యను వనితకూడ గోలోకవాసిని యగు స్త్రీయనియు రాధాకృష్ణులగాథ లాలోకపుగాథలే యనియు లోకాతీతగాథలచేఁ బురాణముఁ బూర్తిచేసియున్నాఁడు. ఆలోకాతీతఁపుగాథలే కాక "రాధా" సంపర్కముకూడ మన భారత కృష్ణునకు లేదని దృఢముగాఁ జెప్పఁగలను. అమరసింహుఁడు, నామలింగానుశాసనమునఁ దాసుజ్జయునీవాసుడగుటచేఁ గాబోలు శ్రీకృష్ణుని యాతని కుటుంబస్థులఁగూడ చెప్పియున్నాడు. శ్రీరాముని పేరైన జెప్పలేదు కాని భారత భాగవతాదులలో నెచ్చటఁగాన్పింపని "గయోపాఖ్యాన" గాథ యేపురాణములోనిది? ఇది యాంధ్రదేశములో మాత్రము వ్యాపించెనా? ఆంధ్రేతరదేశములలోఁగూడ కలదా? అను సందియము మిగులబాధించుచున్నది. పెక్కండ్రాంధ్రమహాకవులు "చిత్రభారతములు, కృష్ణార్జునచరిత్రలు, గయోపాఖ్యానములు" నను పేరులఁబెట్టి "పద్యకావ్యములు, ద్విపదకావ్యములు, నాటకములు"గా రచించి ప్రఖ్యాతినొందియున్నారు. * ఈకథకూడ గ్రామదేవ స్త్రావహారణగాథవలె నాంధ్రదేశమున వ్యాప్తినొందుట యాశ్చర్యకరము. గయోపాఖ్యాన గాథను గ్రంథరూపకముగాఁ జేయువారిలో

---

* గయోపాఖ్యానగాథను గ్రంథరూపముగా రచించిన మహాకవుల పేరులు గ్రంథనామములు తెలిసినంతవరకు వ్రాయుచున్నాఁడను. (౧) నాదెండ్లగోపప్రధాని "కృష్ణార్జునచరిత్ర" (౨) చరిగొండ ధర్మన్న "చిత్రభారతము" (3) కస్తూరి రంగకవి "కృష్ణార్జున సంవాదము" (౪) రామనామాత్యుఁడు "గయోపాఖ్యానము" (౫) పోచిరాజు వీరన్న "కృష్ణార్జున సంవాదము" (౬) పుట్టపాక ఓబయకవి "కృష్ణార్జున చరిత్ర" (౭) కోనప్పకవి "గయోపాఖ్యానము" (౮) వెలిచెరుకుల వేంకటరామకవి "కృష్ణార్జున సంవాదము" (౯) చిలకమర్తి లక్ష్మీనృసింహకవి "గయోపాఖ్యానము" (౧, ౫, ౬, ౭, ౮) గ్రంథములు ద్విపదకావ్యములు (౨, 3, ౪) పద్యకావ్యములు (౯) ప్రసిద్ధినొందిన నాటకము.

"నాదెండ్ల గోపప్రధాని" ప్రథముఁడుగాఁ గాన్పించును. ఈతఁడు శ్రీకృష్ణదేవరాయుల మంత్రి యగు తిమ్మనమంత్రి మేనల్లుఁ డగుటచే నాంధ్రకావ్యములలోఁ బ్రథమకావ్యమగు "మనుచరిత్ర" వలె గణన కెక్కవలసియుండును కాని, కవిత్వమంత సరసముగా నుండనందున విఖ్యాతి నొందలేదు. గయోపాఖ్యానగ్రంథములలో బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహకవిగారి నాటకమునకుండిన ప్రసిద్ధి వేనికిని లేదు. గయోపాఖ్యానకవులందరు నించుమించు కృష్ణార్జునుల వివాదమును బెంచి "ధీరోదాత్త" పురుషులగువారిని "ధీరోద్ధతులు" కాఁగదా, "అధమాధములు"గాఁగూడ నుండునటులఁ జేసిరని "యలంకారశాస్త్ర" దృష్టిచేఁ జెప్పవలసియున్నది. కృష్ణార్జునులు మధుపానముఁ జేయువారని భారతమున వర్ణింపఁబడినందున, "మధుశాలల" దగ్గర సంచరించు మధుపుల సంభాషణములవలె వారి సంవాదమును వర్ణించిరా యని యుత్ప్రేక్షింపవలసియున్నది. గీతాభాష్యాదికములచే మహాపురుషుఁడుగాఁ దలఁపఁబడు శ్రీకృష్ణుని చారిత్రకదృష్టిచే వివిధముగా విమర్శించినందులకు చదువరులు కనుఁగొందురు గాక. ధీరేంద్రనాథపాలు బంకిమ్ చంద్రఛటర్జీ లాలాలజపతిరాయి మొదలగువారు శ్రీకృష్ణచరితములను వ్రాసియున్నారు. వారి విమర్శనలకును మా విమర్శనకుఁ గొంత భేదము కలదు. కేవలచారిత్రకదృష్టిచేతనే యిది వ్రాయఁబడెను.

సమాప్తము



# విరాటుఁడు



ఈతఁడు మత్స్యదేశాధిపతి. ఈతనితండ్రిపేరు మహాభారతమునఁగాన్పింపదు. కాని "సత్యవతి" సోదరుఁడు మత్స్యదేశాధీశ్వరుఁడయ్యెనని "ఉపరిచరవసువు" గాథలోఁగలదు. ఆతనిసంతతివాఁడే విరటుఁడని పురాణాంతరములలోఁ గలిగియుండుటచే నీతఁడు క్షత్రియుఁడుగాఁడని స్పష్టమగుచున్నది. ఈతని కిరువురు భార్యలు గలరు. అందు "సుధేష్ణా" నామము ప్రసిద్ధము. ఈమె నీచజాత్యుత్పన్నుఁడు త్రాఁగుబోతు స్త్రీలోలుఁడు నగు కీచకునిసోదరి. కీచకుఁడే కాదు సుధేష్ణకూడ త్రాఁగుబోతేను. సైరంధ్రీవేషముతోనుండిన ద్రౌపదిని గీచకునింటికిఁ గల్లుదెమ్మను నెపమున నామెకిష్టము లేకుండినను బంపినది. ఆకథాసందర్భమునాలోచింప సుధేష్ణ త్రాఁగుబోతేకాక తార్పుఁగత్తెయనికూడ నూహింపవలసియున్నది. సుధేష్ణయే పతివ్రతయైనచోఁ గీచకుఁడు ద్రౌపదిని దనకడకంపుమని కోరినపు డన్నివిధముల నా కార్యమునాపఁ బ్రయత్నింపవలసియుండును, వాడు మొండియై వినని యెడల ద్రౌపది నన్యస్థలమునకైనఁ బంపవలయును. భర్తతోఁజెప్పి కీచకుని పాపకృత్యము నాపఁ బ్రయత్నింపవలయును. పతివ్రత యన్న స్త్రీ పాతివ్రత్యముఁగాపాడఁ బ్రయత్నించును గదా? అట్టియత్నము లేమియుఁ జేయక కీచకుఁడడిగినచొప్పున సురను దెమ్మని సైరంధ్రి యిష్టపడకుండినను బలవంతముగా నామెను గీచకునింటికిఁబంపినది.

విరటునిరాజ్యమున (నేఁడుభరతఖండమునఁగల కొన్నిసామంత రాజ్యములలో వలె) జనుల మానప్రాణములకు రక్షణము లేకుండెను. ద్రౌపది రాజసమీపముననే విరటుఁడు చూచుచుండఁగాఁ గీచకునిచే దన్నఁబడినను రాజేమియుఁ గీచకుని మందలింపక నీకును వానికిఁగల వివాదపుసంగతి [illegible] తెలియదు. గాన

నేనేమియుఁ జేయ వీలులేదని ద్రౌపది తన్ను నిందింపఁగా సమాధాన మొసగెనెగాని యెప్పుడైన నావివాదాంశమును విచారింపలేదు. * కీచకుని మందలించు శక్తిసామర్థ్యములు లేకనె వానినేమియుఁ జేయ లేదనియు సాంత్వనవాక్యములచేతనె కీచకుని సాగనంపెననియు నాంధ్రీకృతభారతమునఁ గాననగును. మఱియుఁ గీచకుఁడు ద్రౌపదితోఁ దనపరాక్రమవిశేషములఁ జెప్పునపుడు నేనీమత్స్యరాజును రాజ్యమున నిల్పఁబెట్టితినని నాఁడు. ♦ ఆంధ్రీకరించుటలో "తిక్కనసోమయాజి"- "రాజనఁగా నెపంబిడి విరాటునకుండఁగఁగూడు వెట్టుదున్" అని వ్రాయుట యుక్తముగానెయున్నది. ఇంతమాత్రమె కాదు. "ఉపకీచకులు" ద్రౌపదిని గీచకశవముతోనంటఁగట్టి దహనము చేయుదుమనినపుడుకూడ విరటుఁడు వారినేమియుఁ జేయనేరక దానినంగీకరించియున్నాఁడు. ≀ ద్రౌపదిని గీచకవధానంతరము తనపురమును వదలిపొమ్మనుటకుఁ గూడ భయపడి సుధేష్ణచేఁ జెప్పించియున్నాఁడు. ‡ సన్యాసియగు "కంక" భట్టును బాదికలతోఁ గొట్టుటలోమాత్ర మీతనిపరాక్రమము ప్రకాశించెనుగాని సుశర్మతోఁబోరాడునపుడు కాన్పింపలేదు. వలలునిసహాయమె లేకుండిన నీతఁడు సుశర్మచేఁ జెఱపెట్టఁబడియే యుండును. ఉత్తరకుమారుఁ డీతనికిఁదగినకొమారుఁడగు కుమారుఁడేను ఆతనిప్రజ్ఞలు లోకవిదితములై యున్నవి. గోగ్రహణసమయమున నుత్తరుఁడు బాలుఁడని సాధారణముగాఁ దలఁపఁబడుచుండును. కాని యాతఁడంతకుమును (ముప్పదియేండ్లకుఁ బూర్వము) ద్రౌపదీ స్వయంవరకాలముననే యువకుఁడై ద్రౌపదినివరింపను, మత్స్యయం

* విరాటపర్వ॥ 14 అధ్యా॥
♦ విరాటపర్వ॥ 16 అధ్యా॥
≀ విరాటపర్వ॥ 23 అధ్యా॥
‡ విరాటపర్వ॥ 24 అధ్యా॥

త్రముఁగొట్టెను, పాంచాలరాజధానికిఁ బోయియున్నాఁడు. * కాన గోగ్రహణసమయమున కించుమించు చతుపది వత్సరముల యీడుకల వాఁడు. సుశర్మకు త్తరకుమారుఁడే కాక "బభ్రువ" అను మఱియొక పుత్రుఁడు నుత్తర యను కుమారియుఁగలరు. విరటునకు "సురథ" యను వేఱుభార్యయందు "శంఖ, శ్వేతులు" అను నిరువురు కుమారులుకలరు. "శతానీకా" దులు పదునొకండుగురు సోదరులుకలరు. శ్వేతుఁడుమాత్రము పరాక్రమముకలవాఁడుగా సంస్కృతభారతమున వర్ణింపఁబడెను. ♦ ఎందువలననో యాతనివృత్తాంత మాంధ్రీకరింపఁబడలేదు. విరటుఁడు నాతనిసోదరులుసుతులుకూడ మహాయుద్ధములోఁ భీష్మ ద్రోణ శల్యులచే నిశ్శేషముగాఁ జంపఁబడిరి. మాత్స్యుల సంఖ్యాధిక్యతమాత్రమె కాని శూరత్వముకాన్పింపదు. కాని నిమ్నజాత్యుత్పన్నులుగాఁగాన్పించు మాత్స్యులు పాండవులకుఁ దోడువచ్చుటమాత్రము పాండవసంకీర్ణతను దృఢపరచుచున్నది.

## మలయధ్వజుఁడు



చిత్రవాహనుఁడు, ప్రవీరుఁడునను మాఱుపేరులుగల యీతఁడు ద్రవిడ (పాండ్య) దేశపురాజు. మన్వాదిస్మృతులలో ద్రవిడుఁడు సంకీర్ణజాతివాఁడుగాఁ జెప్పఁబడెను. అట్టి యీతనికూఁతురు "చిత్రాంగద" నర్జునుఁడు పెండ్లియాఁడి యామెయం దుద్భవించిన "బభ్రువాహనుఁ" డను కుమారుని మలయధ్వజునకే దత్తతనిచ్చెను. నాఁటి కాలమున దత్తుని యుద్ధమున కాహ్వానింపరు. గాన బభ్రువాహనుఁడు యుద్ధమునకురాలేదు. మలయధ్వజుఁడు యుద్ధమునఁ బాండవులకు

---

* ఆదిపర్వ॥ 185 అధ్యా॥

♦ భీష్మపర్వ॥ 17, 18 అధ్యా॥

సహాయుఁడుగావచ్చి శౌర్యముతోఁ బోరాడి యశ్వత్థామచేఁజచ్చెను. మలయధ్వజుఁ డతిరథుఁడు. ద్రవిడోర్వీశునిసంబంధముకూడ పాండవ సాంకర్యమును దృఢపరచుచున్నది.

## పాంచాలురు



కురుక్షేత్రసంగ్రామములోఁ బాంచాలురప్రశంసమె విస్తారము కలుగుటచేతను "శతపథబ్రాహ్మణములో" కురుపాంచాలుర యుద్ధ మొకటి సూచింపఁబడుటచేతను, కొందఱు పాశ్చాత్యపండితులేకాక వివేకానందస్వామివంటి మహానుభావుఁడుకూడ పాండవులకుఁ గౌరవులకు యుద్ధముజరుగలేదనియు "కురు పాంచాలురకే యుద్ధముజరిగి యుండుననియుఁ జెప్పుటకుఁ గారణమైనది. కాని కురుపాంచాలయుద్ధ మొకటి కురుక్షేత్రసంగ్రామమునకుఁ గొన్నిశతాబ్దములకు ముందే "సంవరణుఁ" డను కురురాజపితకును, దుష్యంతుఁడను పాంచాల రాజ మూలపురుషుని సంతతికిని కలిగి యందు సంవరణుఁడు పదచ్యుతుఁడై పెక్కేండ్లు వనములపాలై సింధునదీతీరమునఁ బరిభ్రమించుచు "తపతి" యనువనితను బెండ్లియై వశిష్ఠునిమహిమచేఁ దిరిగిరాజ్యము నొందినగాథను * పైపరిశోధకులు గమనింపలేదని తలఁపవలసి యున్నది. పాంచాలురు సంవరణునితోఁ బోరునపుడు విశేషసైన్యము నుపయోగించినటులును, ఆ యుద్ధ మనేకవత్సరములకాలము జరిగి నటులును పురాణాంతరములలోఁ గలదు. ఆపోరే "శతపథమున" వర్ణింపఁబడినది. శతపథము నాంగ్లీకరించిన "జ్యూలియస్ యగ్గ హింగు" దొరగారు తామురచించిన "యాంగ్లీకృతశతపథ" పీఠికలో పాండురాజుచేఁ గుంతికిఁ జెప్పఁబడిన "శ్వేతకేతు" చరిత్రలోని శ్వేత

* ఆదిపర్వ 94, 172, 173 అధ్యా.

కేతువు శతపథము" లో యాజ్ఞవల్క్యునితోఁ గలిసికొనినట్లుండుట చేతను, శతపథము పాండురాజునకుఁ బూర్వమె రచింపఁబడియుండు నని యనుమానముగా వ్రాసియున్నారు. కాని శతపథరచనము శ్వేతకేతువు యాజ్ఞవల్క్యుఁడు పుట్టుట మహాభారతయుద్ధానంతరమె కలిగెను. శతపథమునురచించిన ఋషి యాజ్ఞవల్క్యుని శిష్యుఁడు. యాజ్ఞవల్క్య, శ్వేతకేతులు జనమేజయునకుఁ బిమ్మటివారని యీగ్రంథములో 44 పుటలో వ్రాయఁబడియున్నది. శతపథబ్రాహ్మణమును బరిశీలింపఁగా "ఐతిరేయ, తైత్తిరీయాది" బ్రాహ్మణముల లోని భాగములును "ఛాందోగ్య, బృహదారణ్యకా" ద్యుపనిషత్తుల యొక్క భాగములు నేటి సమకూర్చినగ్రంథమనియు బ్రాహ్మణ గ్రంథకర్తయొక్క కవిత్వము స్వల్పముగామాత్రమెయుండెననియుఁ బరిశీలన చేసినయెడల స్పష్టమగును. ఆచర్చ నిటవ్రాయ నవసరములేదు గాని శతపథోదిత "కురు" పాంచాలయుద్ధము సంవరణునికాలమున జరిగినదేయని దృఢముగాఁ జెప్పఁగలను.

పాంచాలురు వైదికకాలమునుండి నేఁటివరకు మహాశూరులుగా నుండుట లోకవిదితమైయున్నది. మహాభారతకాలమునఁ బాంచాలదేశప్రభువు ద్రుపదుఁడు.

## ద్రుపదుడు



ఈతఁడు "పృషతుడు" అనువానిపుత్రుఁడు పృషతుఁడు "ఉగ్రాయుధుఁడు" అనురాజుచే యుద్ధములోఁ దనతండ్రియగు "దండసేనుఁడు" చంపఁబడుటచేఁ బలాయితుఁడై రాజ్యభ్రష్టుఁడై వనములలో సంచరింపుచుండెను. ఆసమయమున నొక "అప్సరస" యందు ద్రుపదునిగనెను. ద్రుపదుని పృషతుఁడు భరద్వాజాశ్రమమున విద్యాభ్యాసమునకై

వినువఁగా ద్రోణునితో నీతఁడు వేదమును ధనుర్వేదము నభ్యసించెను. ఉగ్రాయుధుఁడు హస్తిపురిపైఁగూడ దండయాత్రనుసాగించి తత్కాలముననె మృతినొందిన శంతనుని భార్యయగు "సత్యవతిని" దనకిచ్చిన ముట్టడిని విడుతుననఁగా భీష్ముఁడు శంతనునియంత్యక్రియలుముగియువరకు నెటులనో సంధివాక్యములను నడుపుచుఁ బిమ్మట నుగ్రాయుధునితో ఘోరరణముసలిపి వానిజంపుటయేకాక పెక్కేండ్లనుండి పదభ్రష్టుఁడై వనములలోన వసించుచుండిన పృషతునిరప్పించి పాంచాలరాజ్యమున వానిని నిలిపెనట!*

పృషతునియనంతరము ద్రుపదుఁడు తనరాజ్యమునకుఁబోవుచు "సతీర్థుఁడగు ద్రోణునితోఁ దనరాజ్యమునకువచ్చినయెడల విశేషలాభముఁగలుగఁజేతునని యాశగొలిపి చనియెను. కాని యటులను గాలకర్మవశమున ద్రుపదుఁడుచేయక ద్రోణునితో విరోధమునొందెను. ద్రుపదునకు "సత్యజిత్తు" అను నొకవీరుఁడగుసోదరుఁడుకలఁడు. సత్యజిత్తు నర్జునుఁడుకూడ వీరుఁడనియుఁ దనతోసమానుఁడనియు నొకప్పుడుప్రశంసించియున్నాఁడు♦ మఱియు మహాయుద్ధములోఁ బ్రసిద్ధినొందిన "ఉత్తమౌజుఁడుయుధామన్యుఁడు" ననుజ్ఞాతులును, "సౌత్రామణి" యనుభార్యయందుద్భవించిన "సుమిత్రుఁడు, ప్రియదర్శనుఁడు, వీరకేతువు, శత్రుంజయుఁడు, సురథుఁడు, ధ్వజకేతువు" ననునార్వురుకుమారులును ద్రుపదునకుఁగలరు. "సృంజయు" లనునొకజాతిశూరసైనికులుకలరు. ఇట్లుండినను తటాలున ద్రోణప్రేరితులైవచ్చిపడిన కురుపాండవులతోఁబోరలేక యోడి యర్జునునిచేఁగట్టఁబడి ద్రోణునకర్పింపఁబడి "అహిచ్ఛత్ర" దేశము ("మాకంది" రాజధానిగాగలిగి గంగానదికుత్తరమునయుండిన దేశము) ద్రోణునకిచ్చునటులను గంగకుదక్షిణమై

* హరివంశములో నీగాథకలదు.



♦ ద్రోణపర్వ॥ 17 అధ్యా॥

"కాంపిల్య" నగరమురాజధానిగాఁగలిగి "చర్మణ్వతీ" నదికుత్తరముగా గలదేశము తా నేలుటకును ద్రుపదుఁడు విధిలేక సంధిచేసికొనెను. పైకి ద్రుపదుఁడు ద్రోణునకు మిత్రుఁడుగా నటించుచుండినను ద్రోణుపైఁ బగదీర్చుకొనుటకును బాలురగు కురుపాండవుల దండయాత్ర కంగీక రించుటచేఁ గాంభోలు భీష్మునుక్కణగించుటకును బ్రయత్నించు చుండెను. తన కప్పటికుండిన సుత సోదర జ్ఞాతి వర్గములోనెవ్వరును ద్రోణుని జయించువారు లేకుండుటచే వీరందఱందుకు వీరిం గాల్పనా ఛీ యని విసిగికొనుచు* బ్రాహ్మణుని జయించుకొఱకు బ్రాహ్మణ వీర్యమె కావలెనని గంగాతీరమునందలి బ్రాహ్మణాశ్రమములలోఁ దిరుగుచు ద్రోణుని జయించు కుమారుని దయసేయుఁడని మునీశ్వ రులఁ బ్రార్థించుచుండెను. ఎవ్వరు నాతనికోర్కెఁ దీర్పలేరైరి. తుదకు కాశ్యపగోత్రికుఁడగు"ఉపయాజుఁడు" మహాతపశ్శాలియనియుఁ దనకోర్కెఁ దీర్పఁగలవాఁడనియుఁ దెలిసికొని యాతని నొక సంవత్సర మాశ్రయించెను. ఉపయాజుఁడు నిష్కామకర్ముఁడుగాన ద్రుపదుఁ డెంతవేఁడినను వానికోరికఁదీర్ప నంగీకరింపక ద్రుపదుడిచ్చు లక్ష గోవులకు నితరసత్కృతికిఁ గక్కుఱితిపడు స్వభావముగల "యాజుఁడ" ను తన సోదరుని వేఁడబంపెను. యాజోపయాజు లిరువురును వ్యాసుని వలెఁ గర్ణునివలెఁ గానీనులగు భ్రష్టులు• ద్రుపదుఁడు కార్యార్థిగాన "యాజు" నాశ్రయించి యెంతయేని లాభముఁ గలుగజేతుననియు ద్రోణుని జయించు కుమారునిఁ దయసేయుమనియు వేఁడెను. యాజుఁ "డుపయాజుని" మోమోటపెట్టి తనకు సహాయునిగాఁ దీసి కొని యొక యజ్ఞము ద్రుపదునిచేఁ జేయించెను. (1) యజ్ఞాంతమున ద్రుపదుని భార్యను హవిస్సును గ్రహించి పుత్త్రునిగనుటకు సిద్ధముగా

* ఆదిపర్వ॥ 167 అధ్యా॥

• యాజోపయాజులు "తారణేయులు" అనికలదు. తారణేయులన కానీనులని "మేడిస్‌కోశము"

నుంటినా యని యాజుఁ డడుగఁగా గంధాద్యలంకారములను ధరించి యుంటినని ద్రుపదునిభార్య యనెను. అటులైన నీ వర్హూరాలవు కావు. దూరముగానుండుమని యాజుఁ డగ్నికుండమున హోమముఁ జేయఁ గవచాదియుక్తుఁడై ధనుస్తూణీరములనుధరించిన ధృష్టద్యుమ్ను డగ్నికుండమునుండియే యావిర్భవించెను. అంతకుముందు ద్రుపదుఁడుకోరని ద్రౌపదికూడ వేదిక (అగ్నికుండఁపుటరుగు) పై యావిర్భవించెను. ద్రౌపదీధృష్టద్యుమ్ను లప్పటికే పడుచువాండ్రై యుండిరి. పైకి మిత్రుఁడుగా నటించుచున్నవాఁడు గాన ద్రుపదుఁడాధృష్టద్యుమ్నుని ద్రోణునికడనే ధనుర్విద్య నభ్యసింపఁబంపెను. ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని చర్యలఁజూచి యాతఁడు తన్నుఁజంపువాఁడే యగునని తలఁచియుఁ దనకుండిన ధనురాచార్య బిరుదమును బోఁగొట్టుకొననేరక ధృష్టద్యుమ్నునకు ధనుర్విద్యనంతయు నేర్పెనట! పైగాథాసందర్భము నాలోచింపఁగా యాజుఁడు ధనలోభముచే మంచిచెడ్డల నాలోచింపనివాఁడు. గాన ద్రుపదుని సంతోషపెట్టుటకై తనసంబంధీకుఁడో పుత్రుఁడో యగు యువకుని యజ్ఞవాటికకు వెనుకనుంచి హోమాంతమున నాయువకుఁడు ధనుర్బాణాదికముధరించి హోమకుండముఁ ద్రొక్కి (మొహరము పండుగులలో నిప్పుగుండముఁ ద్రొక్కువానివలెఁ జేసి) రాఁజేసియుండును * ద్రుపదుఁడు ద్రోణునోర్చుకుమారు నేఁగోరెను గాని యర్జునునకు భార్యకాఁదగు కుమార్తెను మొదటకోరలేదు. ద్రౌపదీ స్వయంవర కాలమునమాత్రము అర్జునున కీకన్యనిచ్చిన బాగుండుననిమాత్రము తలఁచెనని సంస్కృతభారతమునఁ గలదు. నన్నియభట్టాంధ్రీకరించుటలో ద్రోణునిజంపుపుత్రుఁడును "ఫాల్గునకు" భార్యకాఁదగినకుమార్తెయుఁ

* అగ్నిని ద్రొక్క వచ్చు రసాయనలేపనము లానాఁడుకలవని "కాటిలీయార్థ" శాస్త్రమునఁగూడ చెప్పఁబడెను.

గానలయుఁ బని యజ్ఞముఁ జేసినటులు కలదు. అదియు నవ్యాప్తి దోష యుక్తముగా నుండెనని పరామర్శతో నాంధ్రభారతముఁ జదివిన చదువరులకు విశదమగును. ద్రౌపదీ వృత్తాంతము పిమ్మట వ్రాయబడును.

## ధృష్టద్యుమ్నుడు



ఈతఁడతిరథశ్రేష్ఠుఁడు న్యాయశీలుడునని కృష్ణార్జునులే గాక భీష్ముఁడును బెక్కుసారులు నుడివియున్నాఁడు. యుద్ధారంభమున నేనాఁడు ధృష్టద్యుమ్నుఁడు కాన్పించినను ద్రోణుడది తనకు దుశ్శకునముగాఁ దలఁచుచుండువాఁడు. ఈతనికి 1 క్షత్రంజయుఁడు, 2 క్షత్రదేవుఁడు, 3 క్షత్రవర్మ, (ధృష్టవర్మ) 4 క్షత్రధర్ముఁడు నను నలువురు నీసులగు కుమారులుగలరు. పాండవులను గౌరవులపైఁ బురికొలుపు మొనగాఁడెవఁడని ధృతరాష్ట్రుఁడు సంజయునడిగినపుడు ధృష్టద్యుమ్నుఁడే ముఖ్యుఁడని సంజయుఁడు చెప్పియున్నాఁడు* ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిజంప మొదటినుండియు సిద్ధపడుచుండెను♦ ద్రుపద ధృష్టద్యుమ్నుల కిష్టమగురీతినె ధర్మరాజు మెలగువాఁడు. అయిదు గ్రామముల నిచ్చినఁ జాలునుపూకని నికృష్టముగాఁగాన్పించు సంధికి నంపునపుడు కోరిన గ్రామములలో "మాకంది, వారణావతములు" కలవు. "మాకంది" ద్రోణుఁడపహరించిన రాజ్యము. వారణావతముకూడ బహుశః ద్రుపదునిరాజ్యములోనిదై యాతనిరాజ్యమునకుఁ దూర్పు హద్దయినది.‡ ధృష్టద్యుమ్నుని శౌర్యసాహసాదులు స్వవర్గ బలపరాక్రమాదులను గమనించియే యాతనికి సర్వసైన్యాధిపత్యమునీయఁ

---

* ఉద్యోగపర్వ॥ 56 అధ్యా॥

♦ అరణ్యపర్వ॥ 12 అధ్యా॥

‡ ఉద్యోగపర్వ॥ 30 అధ్యా॥

గృష్టార్జునులు ధర్మజుం బ్రోత్సాహపఱచిరి. పాండవసైనికులకం దఱకు నీ ధృష్టద్యుమ్నుని సర్వసైన్యాధిపత్యోద్యోగ . ముత్సాహసాతిశస్సై యుండెను. ఈతని సంబంధులుకూడ మహా బలవంతులగుటచేతను భీష్మ ద్రోణ కర్ణాదుల కలవిగానివారై కడకు స్వపక్షపువాఁడగు కృష్ణు గృత్రిమాలోచనమునకు లోనై యశ్వత్థామచే నిద్రబోఁజంపఁ బడిరి. ఆవృత్తాంతము శ్రీకృష్ణునిచరితమున స్పష్టపరుపఁబడినది. పాండవపక్షవీరులలోఁ బాంచాలురే ప్రఖ్యాతవీరులు. వీరితోడ్పాటు- అందు ధృష్టద్యుమ్నునితోడ్పాటు——లేకుండినఁ బాండవులు జయము నందలేకపోవుదురు. భీష్ముని యోడిన నాటియుద్ధములోను సైంధవవధ ద్రోణవధదినములలోను ధృష్టద్యుమ్నునిశౌర్యము మిగుల శోభించినది.

* ధృష్టద్యుమ్నుఁడు బలపరాక్రమములుమాత్రమెకాక న్యాయయుక్తుఁడనికూడ ధర్మజునితో నర్జునుఁడు చెప్పియున్నాఁడు. న్యాయముఁజెప్పునపుడు ధృష్టద్యుమ్నుఁ డర్జునుగూడ లెక్కసేయలేదు. ద్రోణునిజంపుటన్యాయముగా లేదని యర్జునుఁడనినపుడు ధృష్టద్యుమ్నుఁడిటులు ధిక్కరించిపలికి పాండవులనుసిగ్గుపరచెను. ‡......ఓయర్జునా!

---

* ఉద్యోగపర్వ॥ 150 అధ్యా॥

‡ శ్లో॥......హతో ద్రోణో మయా యస్తు । కింమాం పార్థ విగర్హసే, అతిక్రాంతః స్వధర్మాచ్చ క్షత్రధర్మముపాశ్రితః। అహనుషేణహంత్యస్మాన్ సస్త్రేణ క్షుద్రకర్మకృత్॥ యథా మాయాం ప్రయుంజానం అసహ్యం బ్రాహ్మణబ్రువం। మాయయైవ నిహన్యాద్యో! నయుక్తం తత్ర పార్థకిమ్. యచ్చమాం ధార్మికోభూత్వా బ్రవీషి గురుఘాతినమ్. తదర్థమహముత్పన్నః। పాంచాలస్యసుతో నలాత్। యస్య కార్యమకార్యంవా యుధ్యతస్స్యాత్సమం రణే. బ్రాహ్మణంతం కథంబ్రూయాః క్షత్రియంవా ధనంజయ. యోహిశస్త్రవిదోహన్యాద్ బ్రహ్మాస్త్రైః క్రోధమూర్ఛితః।.......... ...యోసౌ మమైవ నాన్యస్య బాంధవాన్ యుధి జఘ్నివాన్। ఛిత్వాపి తస్య మూర్థానం, నైవాస్మి విగతజ్వరః। తచ్చమేకృంతతే మర్మ యన్నతస్య శిరోయథా నిషాదవిషయేక్షిప్తం జయద్రథశిరోయథా। సత్రుర్ణ్ణహాతస్సంశ్యే మదూ ధర్మ=

నాచే ద్రోణుఁడు చంపఁబడెనని యేలనన్ను నిందించెదవు. (ద్రోణుఁడు) స్వధర్మమగు బ్రాహ్మణ్యమును వదలి క్షత్రధర్మమునవలంబించెను. నీచకర్మలఁజేయుచు మనుష్యులను దివ్యాస్త్రములచే హింసించియున్నాఁడు. మాయను బ్రయోగించునట్టియు బ్రాహ్మణబ్రువునకైనను సహింపశక్యము గాని నీచబ్రాహ్మణుని మాయచేతనే చంపుట యనుక్తముగాదా యేమి? నీవు ధార్మికుఁడవై నన్ను గురుఘాతకునిగాఁ జెప్పుచుంటివే; నేనతనిఁ జంపుటకే యగ్నినుండి పుట్టితిని. మఱియుఁ గార్యమైన నకార్యమైనను రణమున సమముగానె యుద్ధముఁజేయవలెను. ఓ యర్జునా! ఆద్రోణుని బ్రాహ్మణుఁడనిగాని క్షత్రియుఁడనిగాని యెట్లుల ననవలయునో? అతఁడు క్రోధుఁడై బ్రహ్మాస్త్రములచే నస్త్రవిద్య నెఱుఁగనివారిం జంపుచుండును. (ఉత్తములట్టులు చంపరు)........మఱియు నాతఁడు నా బంధువులనే యుద్ధములోఁ జంపువాఁడు. ఇతరుల బంధువులను జంపు వాఁడు కాఁడు. అతనిశిరస్సుఁ ద్రుంచియు నాతాపముపోలేదు. సైంధవుని శిరస్సును (నీవు) నిషాదదేశమునఁ బడవైచినట్లుగా ద్రోణుని శిరస్సును బడవేయలేనైతినిగదా యని నాహృదయము బాధనొందుచున్నది.

---

పాండవ. యథాత్వయా హతశ్శూరో భగదత్తః పితుస్సఖా, పితామహం రణే హత్వా। మన్యసే ధర్మమాత్మనః. మయాశత్రౌ హతే కస్మాత్పాపే ధర్మం న మన్యసే। సంబంధావనతం పార్థ నమాం త్వం వక్తుమర్హసి. స్వగాత్రకృతసోపానం నిషణ్ణకృతదంతినం। క్షమామి తే సర్వమేవ వాగ్వ్యతిక్రమమర్జున. ద్రౌపద్యా ద్రౌపదేయానాం కృతేనాన్యేన హేతునా। కులక్రమాగతం వైరం మమాచార్యేణ విశ్రుతం. తథాజానాత్యయం లోకో నయూయం పాండునందనాః।.... శిష్యద్రోహీ హతః పాపో యుధ్యస్వ విజయస్తవ...

ద్రోణపర్వ॥ 198 అధ్యా॥

శ్లో॥ శ్రుత్వా ద్రుపదపుత్రస్య తా వాచః క్రూరకర్మణః। తూష్ణీంభూతాస్తదారాజన్ సర్వ ఏవ విశాంపతే. అర్జునస్తు కటాక్షేణ జిహ్మం విప్రేక్ష్య పార్షతం। సబాష్పమభినిశ్వస్య ధిగ్ధిగిత్యేవ చాబ్రవీత్। యుధిష్ఠిరశ్చ భీమశ్చ యమౌ కృష్ణ స్తథాపరే। ఆసన్ సువ్రీడితా రాజన్! ద్రోణపర్వ॥ 199 అధ్యా

(ద్రోణుఁడు తాను పాంచాలురం జంపినగాని కవచమును విడువననియుఁ దానట్లు సేయలేకుండిన శేషించిన పాంచాలురఁ జంపమని యశ్వత్థామకు దుర్యోధనునిచే సందేశమంపుటయు నిచట ప్రసక్తము*) నీచేఁ బితృసఖుఁడగు భగదత్తుఁ డెట్లు చంపఁబడెనో అట్లే ధర్మముగా నా శత్రువు యుద్ధములోఁ జంపబడెను. పితామహుని (భీష్ముని) యుద్ధమునఁ జంపుట నీకు ధర్మముగా దలఁపఁబడుచున్నది. నాచేఁ పాపాత్ముఁడగు శత్రువు చంపఁబడినపుడేల పాపమని తలఁచుచున్నావు? స్వశరీరమునే సోపానముగా జేసిన యేనుఁగునై సంబంధముచేలోఁబడిన నన్నోయర్జునా! నిందింప నర్హుఁడవు కావు. ద్రౌపది యొక్కయు ద్రౌపదేయులయొక్కయు సంబంధముచేతను, ఇతర కారణములచేతను నీతప్పుమాటను క్షమించితిని. నాకు ద్రోణునితో వంశక్రమాగతమగు వైరముకలదు. దానినీలోకమంతయు నెఱుఁగును. మీపాండవు లట్టివిరోధు లాతనికిఁగారు. .........శిష్యద్రోహియగు పాపాత్ముఁడు చచ్చెను. యుద్ధముఁ జేయుము నీకు విజయమగును— క్రూరకర్ముఁడగు ధృష్టద్యుమ్నుని యీవాక్యములనువిని యందఱును మిన్నకుండిరి. అర్జునుఁడు కోపకటాక్షముతో ధృష్టద్యుమ్నునిజూచి కన్నీటితో నిట్టూర్పువిడిచి ఛీఛీ యనెను. ధర్మరాజు భీముఁడు నకుల సహదేవులు శ్రీకృష్ణుఁడు తక్కినరాజులును సిగ్గునొందిరి—

సాత్యకితో వివాదముఁ జేయునపుడును ధృష్టద్యుమ్నుఁడు భీష్మ భూరిశ్రవసాదుల నన్యాయముగానె మనముచంపితిమని నిజమును వెల్లడించియున్నాఁడు. దుర్యోధనవధకూడ న్యాయముకాదని తలఁచి యుండును. ఇట్లు తమమతమునకు వ్యతిరేకముగా నభిప్రాయమిచ్చు ధృష్టద్యుమ్నుఁడు నాతనిపక్షమువారు నుండుట కిష్టములేకనె సౌప్తిక వధకుఁ గృష్ణుఁడంగీకరించినసంగతి యిదివరకె సూచింపఁబడెను.

* ద్రోణపర్వ 161 అధ్యా.

ద్రోణవధనంగీకరించి ధృష్టద్యుమ్నునకు వెనుకఁ దాళనువాయించు
వారిలో భీముఁడొకఁడు. వీరిద్దఱసమ్మేళనముకూడ కృష్ణపక్షదౌర్బల్య
హేతువు గాన భీమవంశనాశముకూడ కృష్ణునకిష్టమైనది. ధృష్టద్య
ుమ్నుఁడు "శ్వేత" వంశజాతుఁడనియు నాతనికి "శ్వేతుఁ" డను
ప్రఖ్యాతికలదనియు "తిక్కనసోమయాజి" ఉద్యోగపర్వమునఁ జెప్పి
యున్నాఁడు. నేనుచూచినసంస్కృతభారతప్రతులలోఁ "తిక్కయజ్వ"
యాంధ్రీకరించినఘట్టమున నటులు లేదు. స్థలాంతరమునఁగాని, సోమ
యాజి చదివినప్రతిలోగాని యట్లుండునేమో శోధింపవలయును.
శ్వేతుఁడు పాంచాలురకుఁ బూర్వుఁడునుకాఁడు. ఎవ్వఁడో బ్రాహ్మ
ణుఁడైయుండును. ధృష్టద్యుమ్నుఁడుమాత్రము ద్రుపదరాజకుటుంబ
మున జన్మింపక యేసంకీర్ణబ్రాహ్మణునకో జన్మించెను. వ్యాసుని
యందు వైదికము కృపద్రోణులయందు క్షాత్రము సంక్రమించినటులు
ధృష్టద్యుమ్నునియందు క్షాత్రము వ్యాప్తిఁజెందినది. ద్రౌపది ధృష్ట
ద్యుమ్నునకుఁ దగినసోదరియె. ఇరువురును యాజోపయాజుల సంబం
ధులే యని తోఁచును. ద్రుపదుఁడు పృషతున కచ్చరలేమయందు
జన్మించిన సంకీర్ణుఁడగుటచేతను తత్సదృశుఁడగు ధృష్టద్యుమ్నుఁడు
పుత్రుఁడగుటయు ద్రౌపది పుత్రికయగుటయు నేత్రాదృశులగుఁ
బాండవులతో వారికి సంబంధము సరిపడినది.

## శిఖండి



ఈతఁడు భీష్మునిఁజంపుటకుఁ బ్రథమమున స్త్రీగాజన్మించి
పిమ్మటపురుషుఁడై విఖ్యాతశూరుఁడై భీష్మునిబడఁగొట్టి యుద్ధములో
విశేషపరాక్రమముతోఁబోరి పదునెనిమిదవనాటిరాత్రి యశ్వత్థామ
చేమృతినొందెను. ఈతనికిఁ బెక్కండ్రుపుత్రులుకూడగలరని మహా
భారతమునఁగలదు. ఈగాథ సత్యమాసత్యమా?

స్త్రీలు పౌరుషాభినయమునలవరచుకొనుటచేఁ బురుషసదృశులును, పురుషులు స్త్రీత్వాభినయముచే స్త్రీకల్పులునగుట లోకవిదితము. స్త్రీగాఁబుట్టినశిఖండిని బురుషుఁడని ద్రుపదుఁడు ప్రకటించుటయేగాక ద్రోణునికడ నాతఁడు పుంరూపముతో నస్త్రశస్త్రవిద్యల నారితేరినవానిగాఁజేసి భీష్మునిజంపునటుల శిఖండిని బురికొల్పుచు "దశార్ణ" దేశరాజుకుమార్తెను బెండ్లిసేసెను. దశార్ణభూపతి యాకృత్రిమముఁదెలిసి యుద్ధసన్నద్ధుఁడై వచ్చినపుడే శిఖండియొక్క స్త్రీత్వము లోకవిదితమైనది- స్థూలకర్ణుఁడను యక్షుఁడు శిఖండికిఁ బుంస్త్వమిచ్చెననుగాథ నిటులుసమర్థింపవచ్చును. పుంరూపముతోనుండిన శిఖండియొక్కపోలికగలవాఁడు స్థూలకర్ణుఁడను నొకఁ డుండవచ్చును. ఆస్థూలకర్ణుని స్థానమున శిఖండినిలిచి తనస్థానమున కాపరీక్షాసమయమునకు స్థూలకర్ణునంపియుండును—శిఖండిస్త్రీకదా ఆమెకు నల్వురెట్లుపుత్రులుకలిగిరి? గాలికి, నీటికిఁ బిడ్డలుపుట్టు నాకాలమున "క్షత్రదేవ, ఋక్షదేవా"దులు శిఖండిపెండ్లియాడిన దశార్ణభూపతిపుత్రికయందు క్షేత్రజులుగాఁబుట్టియుందురనవచ్చును. లేక, బహుళపుత్రదత్తతగలకాలమగుటచే నల్వురను శిఖండి దత్తులనుగాఁజేసికొనియుండును. లేకుండిన స్థూలకర్ణునకుఁ బ్రత్యుపకృతిగా బీదవాఁడగు నాతనిపుత్రులను తానుపెంచి తనపుత్రులేయని ప్రకటించియైన నుండవచ్చును. శిఖండి చిన్నతనమునుండియుసాముగరిడీలనునేర్చి శస్త్రాస్త్రవిద్యలనలవరచుకొనుటచేభీష్మునితోఁబోరుసామర్థ్యముకలిగిమెలగెను. స్త్రీలు పుంభావముతోమెలగినఁ బురుషనిర్విశేషులగుదురని "మాధురీ" పత్రికనుండి యుల్లిఖించి యాంధ్రీకరించిన వ్యాసమొకటి "భారతీ" పత్రికయొక్క ప్రభవసంవత్సర మార్గశిరమాససంచికలోఁ బ్రకటింపఁబడెను. దానిచే శిఖండియొక్క పుంస్త్వమట్టిదేయని విశదమగును. స్త్రీలస్త్రశస్త్రములనభ్యసించి పురుషత్వముతోఁ బోరాడుట పాశ్చాత్యదే

శములయందేకాక భారతదేశమునను వేదకాలమునుండి గతశతాబ్దమధ్యమువరకుఁ గలదని గ్రంథనిదర్శనములు కలవు. శిఖండిజన్మాదికము కూడ దేవతామహిమలతోఁ జొప్పింపఁబడి సంకీర్ణతనొందియున్నది. తనతండ్రికి రాజ్యమునిప్పించిన భీష్మునకు ద్రుపదునకు విరోధియగుటకుఁ గారణము ద్రోణుఁ "అహిచ్ఛత్రము" నాక్రమించుట కంగీకరించుటయేయనితోఁచును. దానికొఱకే శిఖండిని మొదటినుండియుఁ బ్రోత్సాహపరచుటకలిగినది.

## ద్రౌపది

అహల్యాది పంచకన్యలలో నీమెయొకతెగాఁ జేర్పఁబడెను. పంచకన్యలు "నైకపత్నులే" యగుదురు. ద్రౌపదీచరిత మా పంచకన్యలచరితములలో విలక్షణమైజగత్ప్రసిద్ధమైయున్నది. ద్రౌపది ముందొకఋషికన్యయై కొంతకాలము భర్తృపరిగ్రహమునంగీకరింపక విసిగి రుద్రునిగూర్చితపమాచరింపఁగా నాతఁడు ప్రత్యక్షమైనపుడు పతిపతియని యైదుమారులుచ్చరించినది. అందులకు రుద్రుఁడు పతిపతియని యైదుమారులంటివిగాన పాండవులేవురును నీకుఁబతులగుదురనివరమిచ్చెననియు నామెయిపుడు ద్రుపదునింటనావిర్భవించినదిగాన మీకామె భార్యగాఁదగియున్నదని యేకచక్రపురమునఁ బ్రచ్ఛన్నవేషులై యవయుచున్న పాండవులకుఁ దొలిసారి వ్యాసుఁడు చెప్పియున్నాడు* మత్స్యయంత్రభంజనానంతరము ద్రుపదుఁ డెట్లైదుగుర కొకతెంబెడ్లిసేయుటయని చింతించుసమయమునఁ బారాశర్యుఁడు ప్రత్యక్షమయి "పంచేంద్రోపాఖ్యానమును" జెప్పి పంచేంద్రులే పాండవులనియు రుద్రునానతిచే నింద్రుఁగొని తెచ్చినకన్యయే ద్రౌపదియనియు మఱి

---



* ఆదిపర్వ॥ 169 అధ్యా॥

కొకవిధముగాఁ జెప్పియున్నాఁడు. ♦ ఆంధ్రీకృతభారతమునను బొం బాయి ప్రతిలోను "నాళాయన్యుపాఖ్యానము" అను వేఱుకథగలదు. ఆంధ్రలిపిలో ముద్రితమగు సంస్కృతభారతమున నాళాయన్యుపా ఖ్యాన మాదిపర్వాంతమునఁ బ్రక్షిప్తమనియు జైమినిభారతము నుండి యీగాథయుల్లిఖింపఁబడియుండుననియు ముద్రాపకులువ్రాసి యున్నారు. ఆకథయిది.

"నాళాయని యనునొకతె మౌద్గల్యుఁడను వృద్ధుడును కుష్ఠియునగు వానిభార్యయైయుండెను. ఆతఁడు ద్రౌపదిని గామోపభోగములఁదృ ప్తిఁ బొందింపఁదపస్సు వంతయుధారవోసియునా మెందృప్తినొందింపలేకుం డెను. నీరతిచే నాగుహ్యేంద్రియము దృప్తినొందక శొధనొందుచు న్నది. యేరీతినైనఁ దృప్తినొందింపుమని నాళాయని మౌద్గల్యునివే ధింప నాతఁడు కుపితుఁడై చెప్పఁగూడనిమాటను నిశ్శంకతోఁ జెప్పితివి గాన ద్రుపదునింట భూలోకములో నావిర్భవింపుము. నీకచట నైదుగు రుభర్తలు సంభవింపఁగలరని శపించెనట! ఆమెయే రుద్రుఁగూర్చి తపమాచరించి పంచపతిత్వవరమునొందె"నని పంచేంద్రోపాఖ్యానము నకు ముడివెట్టఁబడినది. మౌద్గల్యునిచేఁ బంచపతిత్వమునకుశప్తురాలగు నాళాయని రుద్రునిగూర్చి పంచపతిత్వమునకై యేలతపస్సు చేయవలసి వచ్చెనో? పైయుపాఖ్యానములను విమర్శచేసిచూడఁగా ద్రౌపది హిమ వత్పర్వతోత్తరభాగమునమౌద్గల్యుఁడనుమునివరించి "దుర్భగరోగిణి" యగుటచే మౌద్గల్యునిచే వెడలఁగొట్టబడి భరతఖండమునకేతెంచి "యాజు" నాశ్రయించి ద్రుపదునియజ్ఞవేదికకుఁ గొనిరాఁబడియుం డును. కృష్ణద్వైపాయనునిచరితములో నీవృత్తాంతము కొంతచెప్పఁ బడెను.

---

♦ ఆదిపర్వ॥ 197 అధ్యా॥

ద్రుపదుని యజ్ఞవేదికయందామె యావిర్భవింపక పూర్వమే యామె యాజోపయాజులచేఁ బంచపతినరణమునకు నిశ్చయింపఁబడె నని యీక్రిందిశ్లోకార్థము చెప్పుచున్నది *

“వ్యాసుఁడిట్లులనుచున్నాఁడు. ఓద్రుపదరాజా? నాకుమార్తె కైదుగురుభర్తలేమని మనస్సునఁ దాపమునొందకుము. యాజోప యాజులిరువురును ధర్మప్రకాశకులు. వారిరువురు నీమెకుఁ బంచ పతిత్వముఁ జేసియున్నారు”—

పై శ్లోకార్థముచే ద్రౌపది ద్రుపదునివేదికపైఁ బుట్టకముందే పాండవులకైదుగురకు నామెను యాజోపయాజులు భార్యగాఁ జేర్పరచి రని స్పష్టమగుచున్నది. యాజోపయాజులు “కానీనులు” వ్యాసుఁడు కానీనుఁడు. వారికైకమత్యము సమకూడియుండును. పాండవులకు వ్యాసోపదేశముచే నుపకృతిం జేయుటకును మగఁడుమగండని వేధించు నాళాయనిని వదల్చుకొనుటకును స్వలాభమునకొఱకును కక్కుఱితి కాఁడగు యాజుఁడీసంబంధమును నిశ్చయపరచియుండును. దానికి వ్యాసోపయాజులు ప్రోత్సాహకారకులై యుందురు. ద్రుపదుఁడు ద్రోణునిజయించుకుమారుఁడు కావలయునని పలవరించెనేగాని యర్జు నునకు భార్యగాఁదగిన కుమార్తెను మొదట కోరియుండలేదు. ధృష్ట ద్యుమ్నునితో నయోనిజగా ద్రౌపదికూడ పుట్టెనని యాజుడగ్ని వేదికమీఁద ద్రౌపదిని గూర్చుండఁబెట్టియుండును. ఎట్లయినను ద్రౌపదీ స్వయంవరమునకుఁ బూర్వమె ద్రౌపది పాండవులనైదుగురఁ బెండ్లి యాడుటకును వారామెఁ బెండ్లియాడుటకును వ్యాస యాజోపయాజు లచే నిశ్చయింపఁబడి యంగీకరింపఁ జేయఁబడియుండును. ద్రుపదుఁ

* శ్లో॥ వ్యాసః;—మాభూద్రాజం స్తవతాపోమనస్థః పంచానాం భార్యా దుహితా మమేతి। యజోపయాజౌ ధర్మస్పృణీతపోభ్యాం తౌ చక్రతుః పంచపతిత్వమస్యాః॥

[illegible] అధ్యా 1 శ్లో॥ 1

జును తొలుత నీవృత్తాంతము నెఱుగక ద్రోణునిజయించు కుమారు నకుఁడోడు బలవంతుఁడగు నర్జునుఁడు తనకల్లుఁడైన శోభించునని ప్రచ్ఛన్నులగుఁ బాండవులకొఱకు వెదకించెను. వారు కాన్పించ నందున వీర్యశుల్క-స్వయంవరమును చాటింపించెను. ఆ స్వయంవర మును జాటుటలో నెవఁడైన నైదుబాణములతో నీమత్స్యయంత్రముఁ గొట్టిన నాతఁడు నాపుత్రిక నొందవచ్చునని నెను * పై చాటింపుప్రకార మెవఁడు మత్స్యయంత్రముఁ గొట్టిన వానినే ద్రౌపది వరింపవలసి యున్నది. కాని మత్స్యయంత్రముఁగొట్టఁ గర్ణుఁడు ధనుస్సును సజ్యము చేయుచుండఁగా ద్రౌపది సూతపుత్రుని నేనువరింపను• అనుటచే నంతకుఁబూర్వమె పాంచాలీపాండవులకు వ్యాసాదులచే ప్రధానము చేయబడియున్నదని దృఢముగాఁ జెప్పవలసియున్నది. మఱియు మాతృవాక్యపరిపాలనముకొఱకుఁ బాండవు లొకతెఁబెండ్లిచూడిరని స్థూలదృష్టిచేఁ జనులు తలంతురు కాని సూక్ష్మముగా నాలోచించిన వ్యాసాదులే పంచపతిత్వమునకుఁ బాండవుల నంగీకరింపఁజేసిరని విశదమగును. కుంతీదేవికూడ పాండురాజుకాక సూర్యాదులను నల్వురను వరించినది గాన సమానస్కంధురాలగు కోడలుండిన మంచిదే యని తలఁచిన దలంచి కొంత ప్రోత్సాహముఁ జేసియుండును.

శ్రుతి స్మృతి పురాణేతిహాసోక్త ధర్మములను సమర్థించు వారిలో "పూర్వమీమాంసా" శాస్త్రజ్ఞులు ముఖ్యులు. అందు కుమారిలభట్టాచార్యుఁడు ముఖ్యతముఁడు. అతఁడు "తంత్రవార్తిక" భాష్యమున "ధర్మవ్యతిరిక్తసాహసములు" అను శీర్షికతోఁ బురాణోక్తగాథలను సమర్థించుచు ద్రౌపదీపంచపతిత్వవిచారము నిటులఁ జేసియున్నాఁడు.

---

* ఆదిపర్వ॥ 185 అధ్యా॥

• ఆదిపర్వ॥ 187 అధ్యా॥

* "పాండుపుత్రుల కొకతెయె భార్యయని ధర్మవిరుద్ధముగా నేఁడి చెప్పఁబడెనో యది కృష్ణద్వైపాయనుని చేతనే విశేషముగా సత్పాదింపఁబడి ప్రతిపాదింపఁబడినది. ద్రౌపది యువతిగానె వేదీమధ్యమునుండి లేచినదికదా! ఆమెలక్ష్మి శ్రీ మాటిమాటికి కలుసుకొనఁబడినను గోపయుక్తురాలు కాదు. అందువలననే చెప్పఁబడెను. మనుష్యాతీతమై యద్భుతమైన యీరూపమును వ్యాసమహర్షి ద్రుపదునితోఁ జెప్పియున్నాఁడు. సుమధ్యమయగు నాద్రౌపది మహానుభావురాలుకదా? దినములుగడచినను ఆమె కన్యకయేయై యున్నదని కూడ చెప్పెను. (పాండవులైదుగురు నైదుదినములు ద్రౌపదిని పెండ్లియాడినపుడు ద్రౌపది దినమున కొకవిధమగు వేషమును వేయుచుం

---

* "యాతోక్తా పాండుపుత్రాణా యేకపత్నీ నిరర్థితా, సాపిద్వైపాయనేనైవ వ్యుత్పాద్య ప్రతిపాదితా। యౌవనస్థైవ కృష్ణాహి వేదీమధ్యా త్సముద్ధితా సాచ శ్రీ శ్రీశ్చ భూయోభి ర్యుజ్యమానా నదుష్యతి" అతఏవోక్తం॥

"ఇదంచ తత్రాద్భుతరూపముత్తమం జగాద విప్రర్షి రతీతమానుషం। మహానుభావాకిల సాసుమధ్యమా బభూవ కన్యైవ గతేగతేహని" ఇతి. (" " ఈశ్లోకము ఆదిపర్వము 189 అధ్యాయములోనిది)

స్త్రీహి మానుషీ త్వేతదుపపద్యతే. తేనాతీతమానుషమిత్యుక్తం। అతఏవచ వాసుదేవేన కర్ణోక్తః "షష్ఠేచత్వాహని పర్యుపస్థాస్యతీతి" ఇతరథాహి కథం ప్రమాణభూతస్సన్నేవంవదేత్? అథవా బహ్వ్య ఏవ తాస్సదృశీరూపాః ద్రౌపద్యా ఏకత్వేనోపచరితా ఇతి. వ్యవహారాద్గోపత్వా గమ్యతే। యద్వా భార్యార్జునస్యైవ కేవలస్య భవిష్యతి. సాధారణ్యప్రసిద్ధిస్తు నిచ్ఛిద్రత్వాయ దర్శితా। యథా యుధిష్ఠిరోపదేశా త్సభామధ్యమానీయమానా సహైవ రజస్వలావేషం సపుత్రస్య ధృతరాష్ట్రస్యా యశఉత్పాదయితుం ఆత్మానం చానాయ్యమానం ప్రఖ్యాపయితుం ద్రౌపదీ కృతవతీ। తథాచ కేవలార్జున భార్యాయా ఏవ తస్యాః స్త్రీత్వం జనావిదితం. పరస్పరసంఘాతాతిశయంచ భేదప్రయోగానవకాశార్థం దర్శయితుం సాధారణ్యప్రఖ్యాపన మిత్యేవమాది వికల్పే స్వపరిహారత్వా ద్రాగలోభకృతస్య వ్యవహారస్య శిష్టైరేవ ధర్మత్వేనా పరిగ్రహస్యోక్తత్వా దను [illegible]

డుటఁజూచి వ్యాసుఁడు (ద్రుపదునితోఁ జెప్పిన సందర్భములోనిది) మానుషిమైన నిదిసిద్ధింపదుగనుకనే మానుషాతీతయని చెప్పఁబడెను. అందువలననే శ్రీకృష్ణుఁడుకూడ (సంధికిఁబోయినపుడు) కర్ణునితో ద్రౌపది నినుగూడ నాఱవదినమునఁ బొందఁగలదని చెప్పియున్నాఁడు. మఱియొకలాగైనచోఁ గృష్ణుఁ డేప్రమాణముచే నిటులు చెప్పెను? అటులు కాకుండిన ద్రౌపదికి సమానరూపముగల పెక్కండ్రు ద్రౌపదీ వ్యవహారముఁ జేసియుండిరనికూడ వ్యవహారార్థాపత్తిచేఁ దోఁచుచున్నది. అటులుకాకుండినయెడల ద్రౌపది యర్జునకొక్కనికె భార్యయగును. ఆద్రౌపది లోకములోఁ దమలోటు కాన్పింపకుండఁగఁ జేసినది. ఎట్లనఁగా (ద్యూతసమయమున) ధర్మజునుపదేశముచే సభామధ్యమునకుఁ దేఁబడి పుత్రులతోఁగూడిన ధృతరాష్ట్రున కపఖ్యాతిం బుట్టించుటకును తనకుఁ గౌరవు లన్యాయముఁజేసిరని ప్రకటన చేయుటకొఱకును ద్రౌపది తక్షణమె రజస్వలావేషమును ధరించినది. కనుక ద్రౌపది యర్జునున కొకనికె భార్యయనియు నామెగే స్త్రీత్వము కలదనియు జనులెఱుఁగుదురు. అన్యోన్య దృఢసంబంధముకొఱకు, తమలో భేదభావము లేకుండుటఁ జూపుటకొఱకు నటులు చేసియుండునని వికల్పముచే సుపరిహారము (పంచపతిత్వదోషము) అగును. రాగలోభాదులచేఁ జేయఁబడిన వ్యవహారము శిష్టులచేతనె నిరాకరింపఁబడినది గాన ద్రౌపదీ పంచపతిత్వమును దూషింపరాదు.—

పై "తంత్రవార్తికభాష్య" వాక్యములచే "భట్టకుమారిలుని" కాలమున ద్రౌపదికైదుగురుభర్తలుకలరా? అర్జునుఁడొక్కఁడేనా? యను సందేహము విద్వాంసులలోఁ గలిగియున్నదనియు అర్జునుఁ డొకఁడే నిజముగుభర్తయైయుండునుగాని, ద్రౌపది పంచపాండవైకమత్యమును లోకములో సూచించుటకై తానైదుగురకు భార్యనేయని ప్రకటించుకొనుచుఁ గృ  డవులుకూడ

ద్రౌపదివలెనె గూఢవర్తనులై సంచరించువారనియు, ద్యూతకాల మునఁ గూడ లోకములోఁ బ్రసిద్ధిఁ బొందినంత మానభంగము ద్రౌపదికిఁ గౌరవులు చేయకపోయినను ద్రౌపదియే ధార్తరాష్ట్రుల కపఖ్యాతి విశేషముగాఁ గలుగురీతిని రజస్వలాదివేషములను వేసియున్నదనియు స్పష్టమగుచున్నది. ద్రౌపది కర్జునుఁడొక్కఁడే భర్తయై యుండునను టను ధర్మరాజు భీమునితో ద్రౌపది కర్జునునందే పక్షపాతమని యొక ప్పుడన్న చెప్పిన వాక్యము దృఢపరచుచున్నది.

ద్రౌపది సత్యభామతోఁ దనపాతివ్రత్యవిశేషమునుగూర్చి శ్రీ రంగనీతు లెన్నియైనఁ జెప్పినది. భర్తలయిష్టులకు మనుఁగులోత్తమ వారికనుసన్నల మెలఁగుచుండుననినది. కాని పాండవులే యామెకు జంకుచుండురని కొన్ని సందర్భములచేఁ జెప్పవలసియున్నది. అర్జునుఁడు సుభద్రను బెండ్లియాడి యామెతో నింద్రప్రస్థపురికి వచ్చుచు ద్రౌపది యేమనునోయను భీతిచే పట్టణపు వెలుపలనుండి సుభద్రను ముందుగా ద్రౌపదికడకంపి ప్రతిమాలించినాడు. ఆమెను సాంత్వనవాక్యము లచేఁ బ్రతిమాలియున్నాఁడు.* సమయమువచ్చినపుడు ద్రౌపది పాండవులను నిశ్శంకగా నెదిరించి ధిక్కరించుటలో వెనుదీయునది కాదు. ధర్మరాజు తనకర్మలఁదలఁచుకొనుచు మూఢుఁడైయున్నాఁడ నియుఁ దనబ్రతుకుకొఱకుఁ బగులకుఁ బ్రియవాక్యములఁ జెప్పు ధర్మ జుఁ జూచిన నాకుఁ గోపమగుచున్నదనియు నొకప్పుడనినది ‡

ద్రౌపది కృష్ణుఁడు తమ్ము నోదార్ప వచ్చినపుడును ♦ సంధికిఁ బోవుసమయమునను◗ నీవు బ్రతికియుండఁగాఁ బాండవులు జీవించిచూ

§ మహాప్రస్థానికపర్వ॥ 2 అధ్యా॥

* ఆదిపర్వ॥ 221 అధ్యా॥

‡ విరాటపర్వ॥ 18 అధ్యా॥



♦ అరణ్యపర్వ॥ 12 అధ్యా॥

◗ ఉద్యోగపర్వ॥ 81 అధ్యా॥

చుచుండఁగా నేను సభామధ్యమున నవమానింపఁబడితిని. శ్రీ భీముని బలమును అర్జునునిధనుర్ధరత్వము గాల్పనా యనియుఁ అర్జునునిగాండివము పౌరుషము మూఁటఁగట్టరాయనియు పాండవులయెదుటనే నిందించినది. కర్ణునిచే దెబ్బలుదిని శిబిరమున బాధనొందుచు ధర్మరాజు కర్ణునివలన భీతినొంది తన్నుఁ బరామర్శించు నెపమున వచ్చిన యర్జునునితో వ్రణవేదనచే నోడలు తెలియక యర్జునా! నీవు కర్ణుని వధింపలేకుండిన నీధనుస్సు కృష్ణునికిచ్చినచో నాతఁడు కర్ణునిజంపునే యనియంతమాత్రమున ధర్మజుజంపఁ గత్తిదీసినయర్జునుఁడు నీధనుర్ధరత్వము కాల్పనా నీగాండీవమును మంటఁబెట్టనాయని రెండుమూడుసారులనినను నోరు తెఱవక యర్జునుఁడును నిబలముగాల్పనాయనఁ గిమ్మనక భీముఁడునుండుటఁజూడఁగా ద్రౌపది యొక్క మానవతీత్వ మెట్టిదియో ద్రౌపదీవాక్యములకుఁ బాండవు లెటులు లోఁబడుచుండిరో స్పష్టమగును. పాండవులనే కాదు. కృష్ణునంతవానిగూడ లెక్కసేయక నీవు బ్రతికియుండఁగా నాకవమానముజరిగెనే. దుర్యోధనుఁ డొక్కక్షణము బ్రదికియుండినను నేనుసహింపననినది. కృష్ణుఁడు సంధిసేయ నేగునపుడు భీమార్జునులు సంధిసేత కనుకూలముగా మాటలాడుటను సహింపక భీమార్జునులు నిర్భాగ్యులై సంధికోరుదురేని నాతండ్రి నాసోదరులఁ గూడి కౌరవులతోఁ యుద్ధముఁజేతురనియుఁ అభిమన్యుంబురస్కరించుకొని నాకుమారు లైదుగురు కౌరవులతోఁ బోరాడుదురనియు వీరత్వసూచకముగాఁ బలికినది. ప్రచ్ఛన్నరూపముతోనుండియుఁ గీచకుని వ్యవహారములో విరటుని తత్సభవారింగూడ లెక్కసేయక నిందించినది. ద్రౌపది తనపై నణుమాత్రపుమాటనుగూడ పడనీయని పౌరుషవంతురాలు. విరటుని దత్సభవారిని నిందించుచు సభలోనిలచియుండిన ద్రౌపదిని ధర్మరాజు తమరహస్యము బయలగునేమో యనుభయముతో నామె నచటనుండి పొమ్మని సూచించినాఁడు. ఆమె యచట

నుండి కదలకపోవుటచే నాట్యమాండుగానివలెఁ గుంత్స్త్రీ సభలో నిలిచియుండరాదు. పోమ్మనఁగా ద్రౌపది గూఢముగా ధర్మజార్జునుల నిట్లు చెప్పిపోడిచినది.

గీ॥ నాదువల్లభుండు ♦ నటుఁడింతనిక్కంబు
పెద్దవారియట్ల ♦ పిన్నవారు
గాన బతులవిధము ♦ గాక యే శైలూషి
గాదనంగరాదు ♦ కంకభట్ట॥

వ॥ అట్లగుటం జేసి నాదు నాట్యంబును బరిచితంబు. మత్పతి శైలూషుండు కాఁడు గిశపుండునుగావున జూదరియాలికి గరువతనం బె క్కడిది అనినది.

ద్రౌపది విశేషవిద్యావతి. ద్యూతసమయమున ధర్మశాస్త్రపు ప్రశ్నలచే సభికులను నిరుత్తరులఁ జేసినది. ప్రథమద్యూతమునఁ బాం డవులు కౌరవదాసులుకాఁగా ద్రౌపదియే బానిసతనమునుండి యు క్తిచేఁ బాండవులనువిడిపించి వారియాయుధాదులఁ గౌరవులిచ్చునటు లుచేసినది. పాంచాలి కేవలవిద్యావతిమాత్ర మెకాదు. బలవతి దేహ దార్ఢ్యమునందామె భీమునకీడైనది. తనుఁబట్టవచ్చిన సైంధవుని బోర గిలఁద్రోసినది. కీచకునిఁబడఁగొట్టి కీఁచుమనిపించినది. కీచకునిబడగొ ట్టుటలో నొకదైవమహిమ కవిచేఁగల్పింపఁబడెనుగాని యదిసందర్భశు ద్ధిగాలేదు. ఇట్టిమబల—అబలకాదు బలవతి—మానవతి పాండవుల కనుసన్నలమెలఁగునా? వనవాసకాలమున ననేకమాఱులు ధర్మరా జాదులను గౌరవులపై నుసికొలుపుచుండెడిది. బంధువర్గవధచే ఖిన్ను డయి రాజ్యమునంగీకరింపనొల్లని ధర్మజుని రాజ్యోన్ముఖునిగాఁబురికొ నఁజేసిన యుపన్యాసము ప్రశంసనీయము. ఈమెయాభిజాత్యమున కీసుజెందియే కృష్ణుఁ డీమెసంతతి నిలువకుండఁగఁ జేసినసంగతి యిం తకుముందే చెప్పఁబడెను.

భారతవర్ణనావిశేషములచే ద్రౌపది నేటి పాశ్చాత్యప్రాచ్య వనితామతల్లికలం దలందన్నిన ప్రౌఢత్వముకలదిగాం దోచును.

పాతివ్రత్యముసంగాక తదితరవిషయములలో నేఁటికిన్ని భారత వర్ష వనితామతల్లికల కాదర్శముగానుండఁదగియున్నది. "నీతిశాస్త్ర" మని చెప్పఁబడు గ్రంథములోని యీక్రిందిశ్లోకములు ద్రౌపదీవాక్య ములని చెప్పునరుగాని యది యుక్తముగాగాన్పింపదు అయినను మూ లముమాత్ర మిందు వ్రాయఁబడుచున్నది.

శ్లో॥ సుందరంపురుషందృష్ట్వా భ్రాతరం పితరం సుతం
మోనిర్ద్రవతినారీణాం తథ్యంమే బ్రూహి కేశవ॥
పంచ షుపతయన్న స్తి మహ్యాంషష్ఠోపిరోచ తే
పురుషాణామ భావేన సర్వానార్యః పతివ్రతాః॥

## కుంతి

ఈమె చరితములోకవిదితము. పాండురాజుపోయినపిమ్మటనే యీమె భిక్షలఁగనియుండునని నాఁటివారె తలఁచిరనువృత్తాంత మిది వఱ కె వ్రాసియుంటిని. కుంతియొక్క రహస్యబ్రవర్తనమె యింతటిమ హాయుద్ధమునకుఁ గారణమని యుద్ధాంతమున ధర్మరాజు కుంతిపైఁగినిసి శాపమిచ్చెనని "శాంతిపర్వము" నంగలదు. ఈమె యాదవ (గొల్ల) వంశమునఁబుట్టెను. ఆమెతండ్రి "శూరుఁడ" నువాఁడు. తన మేనత్తకు మారుఁడగు "కుంతిభోజుఁడు" సంతతి లేక నీమెను దత్తతఁ జేసికొనుట కడుగఁగా నిచ్చెను. కుంతిభోజుఁడో శూరుఁడో "నాగులలో" ముఖ్యుఁడగు "ఆర్యకుఁడు" అను వాని దౌహిత్రుఁడని చెప్పబడి యున్నది! నాగు లనార్యులనియు నాగవనితలు వేశ్యలుగాఁ గూడ నుండిరనియు నిదివఱలోనె చెప్పఁబడెను. కుంతి యట్టి వేశ్యాకుల



! ఆదిపర్వ॥ 128 అధ్యా॥ వ్యాఖ్య॥

సంపర్కము కలదగుటచేతనె రహస్యముగాను బహిరంగముగాను బయలకే బిడ్డలంగనినది. సవతి తన్ను నాక్షేపింపకుండగ నామె కిరువురం దార్చినది. కోడల కైదుగురు మగలగుట కనుజ్ఞనిచ్చినది. కుంతీ ప్రవర్తనమునకు ధర్మజుఁడు మాత్రమె కాక కర్ణుఁడును నీచ కర్మఁజేసితివని నిందించియున్నాఁడు* కుంతి కర్ణునిగనుటలో సూర్యుఁడు రహస్యముగాఁ బొంచిపొంచి యంతఃపురముననుండిన కుంతిని గలిసి యుండెననియు గర్భమును తొమ్మిదిమాసములు రహస్యముగామోసి యొకనాఁటిరాత్రి కర్ణుఁగని తన కాపుఁరాలగు దాసిచే నదిలోఁ బార వేయుటకుఁ బంపుచుండగా దాసి కొఁపురాలగు రాధ యనునది మార్గ మధ్యమునఁ దానసిల్లి రహస్యముఁ గుఱుతుపట్టి తనకు బిడ్డలు లేనం దున రహస్యభేదనము కాకుండఁ బెంతుననుటచే దాసి రాధకా కర్ణు నిచ్చినటులఁను బురాణాంతరములలోఁ గలదు. కుంతి తొమ్మిదిమా సములు మోసియె కర్ణుఁగనినటుల భారతమున రెండుచోటులఁగలదు. ఈమె రహస్యము బయలైనపిమ్మట ధర్మజుఁడామెను గౌరవింపలేదు. ఈ నిరాదరణనొందలేకనె యామె వానప్రస్థయై మృతినొందినది.

## పాండవులు



వైదిక వాఙ్మయమును మహాభారతమును బరిశోధించిన పాశ్చా త్యపరిశోధకులు వైదికవాఙ్మయమునఁ బాండవులపేరులు కాన్పింప నందున భారతోదితపాండవులు కల్పితపురుషులని తలఁచిరి. అందు "ప్రొఫెసర్ లాస్సెన్" ముఖ్యుఁడు. దత్తమహాశయుని తలఁపుకూడ నట్టిదియే. వివేకానందస్వాములవారు "యగ్గిహింగుకృత శతపథాంగ్లీ కరణముఁ" జూచికాఁబోలు "భగవద్గీతావిచారణ" యను నుపన్యా సమునఁ గురుపాండవ యుద్ధముగుట ననుమానాస్పదముగా నంగీక రించిరి. "హాప్‌కిన్సు, విన్టెంటుస్మితు" అనువారు పాండవులు తిబెతు



* ఉద్యోగపర్వ॥ 145 అధ్యా॥

దేశమునుండి భరతఖండమునకు వచ్చిన విజాతీయులనియు అందువల ననే తిబెతుదేశమునందుండిన బహుపతిత్వమే ద్రౌపదిని వరించుటలో వా రవలంభించిరనియు వ్రాసియున్నారు. అందు "విన్సెంటుస్మిత్తు" యొక్క "ఆక్స్‌ఫర్డు ఇండియన్‌హిస్టరి" పాఠశాలలలో విద్యార్థులకుఁ జెప్పఁబడుచున్నది. మఱికొందరు క్రీ. పూ. 2, 3 శతాబ్దములలో మధ్యాసియానుండి భరతఖండముపై దాడివెడలిన "పార్థియనులు" పాండవులుగా మార్పఁబడి భారతములో దూర్పఁబడి యుందురను నపూర్వవాదముఁ గల్పించిరి. పార్థియనుట పాండవులగుటకుఁ బాండు వులనుండిన "పార్థులు" అను శబ్దసాదృశ్యమొకటి వారికిఁ దోడ్పడు చున్నది. క్రీ. పూ. 5—12 శతాబ్దముల కాలముల నడుమనుండిన "పాణిని, శాకటాయన" ఋషులే "వాసుదేవార్జున యుధిష్ఠిరా"దులఁ గూర్చి తమ గ్రంథములలోఁ బ్రశంసించియుండుటచేతను మహాభారత రచనము కూడ పార్థియనుల దాడిమాత్రకుఁ బూర్వమె రచింపఁబడి యుండుటచేతను పార్థియనులు పాండవులనువాదము మిక్కిలి యసంగ తముగా నున్నది. దాని నటుండనిండు.

యగ్గీహిందుదొరగారు తాను బర్లిన్ (జర్మనీ) లైబ్రరీలో "కాఠకములు" అను శిథిలమగు వ్రాతప్రతిలో వైచిత్రవీర్యధృతరాష్ట్రుని ప్రశంస (10—6) కనుపించినదని తా నాంగీకరించిన శతపథ బ్రాహ్మణపుఁ బీఠికలోఁ వ్రాసియున్నారు. పై కాఠకము లేవేదసంబం ధపునో? కాని పాండవులపేరు లెవ్వారును వైదికవాఙ్మయమునఁ జూచి నటుల వ్రాయరు. దీనికిఁ గారణమిదివఱకె వ్రాయఁబడె. వ్యాసుఁడు కూడ పాండవులు హాస్తిపురిం జేరనప్పుడు జరిగిన చరిత్రనె తన "జయానుక్రమణికలోఁ" సూచించియున్నాఁడు. హాస్తిపురికి వచ్చి నపుడే పౌరులు వీరి జన్మాదికము ననుమానించిరి. విద్యాభ్యాస కాలమునఁ బౌరులకు వీరి సంబంధావసరము కల్గుగలేదు. ధర్మజు

నను యువరాజ్యాభిషేకమైనపిమ్మట పాండవసంబంధము పౌరులకుఁ గలిగియుండెను. అవైదికాచారయుక్తులగు వీరిపైఁ జారులకు, రాజబంధువులకు, నయిష్టముకలిగెను. ధృతరాష్ట్రునానతిచేఁ బాండవులు వారణావతమునకుఁ బోవుచుఁ భీష్మాదులకు దీనావనతులై ప్రొక్కి యనుజ్ఞగొనఁగా నొక్కఁడును ధర్మజుపక్షముగా మాటలాడలేదు, పురమును వదలినపిమ్మటఁ గొందఱు బ్రాహ్మణులుమాత్రము (ధర్మజుచే నుపకృతినొందినవారు) ధృతరాష్ట్రుఁ డిటులు మిమ్మునంపుట యుక్తముగా లేదనిరట!* పాండవులతో సంబంధించిన విదేశీయులు కొందఱు హస్తిపురిలో నుండిరేమోయని ధృతరాష్ట్రుఁడనిన యీ క్రిందిశ్లోకార్థ మనుమాన పెట్టుచున్నది.

‡ మీ గణములతోను, మీ వంశములతోను, దేవతలవలె (వారణావతమున) విహరింపుడు అనెను.

ధర్మజుఁడు తన కాప్తులగువారు కొందఱు తనతో వారణావతమునకు వచ్చుటకు సిద్ధపడఁగా మీరు రావలదు. సమయమువచ్చినపుడు మాపనిని జేయుఁడని హస్తిపురి వెలుపలనుండి వారినంపఁగా వారు తిరిగి హస్తిపురికిఁబోయిరట!‡ ఇదికూడ పాండవజాతికిఁ జేరినవారు కొందఱు హస్తిపురిలో నుండియుందురను ననుమానమునకుఁ

---

♦ వారణావతము కురుదేశములోనిది కాదు. అది ద్రుపదుని జయించి యర్జునుఁడు ద్రోణునకిచ్చిన "అహిచ్ఛత్ర" రాజ్యమునకుఁ దూర్పుగానుండిన స్వల్పరాష్ట్రమునకు ముఖ్యపట్టణము. మహాయుద్ధసమయము దానిని ద్రుపదునకిచ్చుట కొడంబడిక ధర్మజుఁడు చేసియుండును. అందువలననే సంధిలోఁగోరిన యైదుగ్రామములలో వారణావతమొకటియై యున్నది.

* ఆదిపర్వ॥ 145 అధ్యా॥

‡ సగణాః స్వాన్వయాశ్చైవ విహరధ్వం యథామరాః" ఆదిపర్వ. 144 అధ్యా॥

‡ ఆదిపర్వ. 145 అధ్యా॥

కారణము. వారణావతమునఁ బాండవుల కమాత్యుఁడుగా "పురోచనుఁడు" కౌరవులచేఁ బంపఁబడెను. ఆతఁడు లాక్షాగృహమును దానికి సమీపమున నాయుధాగారమును నిర్మించి పాండవుల కుపచారములఁ జేయుచుండెను. పురోచనుఁడు మ్లేచ్ఛుఁడు—పారశీకుఁడని కొందఱు తలఁతురు. పురోచనుఁడు దుర్యోధనోపదేశముచే లక్కయింటిని గాల్చునను భయమేగాక యేదియో గొప్పతిరుగుబాటు జరుగబోవు సూచనలఁ దెలిసికొనియే పురోచనునుండి తమ గుర్తు తెలియకుండఁగాఁ బురోచనుఁగూడ లాక్షాగృహమున దహించి యంతకుముందే వేఁటనెపమునఁ దెలిసికొనిన గుప్తమార్గముల కనుగుణముగా లక్కయింటినుండి చేసికొనిన బిలద్వారమువలన వెలువడి పాండవులు లాక్షాగృహ దాహాఁపుటపవాదను దుర్యోధనునకును, మరణమును నిషాదవనితకుఁ దత్పుత్ర పంచకమునకుఁ బాచిపెట్టి పలాయితులైరి. లాక్షాగృహమునుండి వెలువడు బిలమును జేయుటకు విదురునిచే హస్తిపురినుండి పంపఁబడిన ఖనికుఁడు (ఉప్ప) తోడ్పడెను. లాక్షాగృహమునుండి యరణ్యములోఁ గొంతదవ్వేగినపిమ్మట గంగానది యడ్డువచ్చెను* హస్తిపురినుండి విదురునిచే పంపఁబడిన నావికుఁడొకఁడు తనకుఁబూర్వమె కొందఱిచే సిద్ధపరుపఁబడిన నావపైఁ బాండవుల నెక్కించి గంగానదిలోఁ గొంతదవ్వు తీసికొనిపోయి హిడింబావనప్రాంతమున వారిని దిగవిడచెను. చీమ చిటుక్కుమనిన బెదరుచుండిన మనస్సులతోఁ బాండవు లుండుటచే నావికుని గూడ నమ్ముటకు సందేహించుచుండఁగా విదురుఁడు చెప్పిన కొన్ని గుఱుతుల నా నావికుఁడు చెప్పవలసివచ్చెను. (పాండవుల నావ పయనము మూలాంధ్రీకరింపఁబడలేదు)† హిడింబవధానంతరము పాండవులు

---

* ఆదిపర్వ॥ 149, 150 అధ్యా॥

† ఆదిపర్వ॥ 156 అధ్యా॥

"తాపస" వేషములను ధరించి కంగారుపడుచు, ధార్తరాష్ట్ర భీతులై యొక్కొక్కప్పుడు పెడదారులంబట్టి కూడ మత్స్య, త్రిగర్త, కీచక, పాంచాల" దేశములలోఁ దిరిగి తిరిగి యేకచక్రపురసమీపమును జేరఁగా వ్యాసుఁడు తారసించి యనదలగు వీరికిఁ గొంత యాలోచనా సహాయముఁ జేసి వారి నేకచక్రపురమునకుఁ జేర్చెను.

ఆ వృత్తాంతము వ్యాస ద్రౌపదుల వృత్తాంతములోఁ జెప్పఁబడెను. ఎంత వేదాధ్యయనము చేయుచుండినను, ఎంత బ్రాహ్మణ వేషముువేసి సంచరించినను వీరిపై దేశీయుల కనుమానము నసూయ కలుగుచునే యుండెడిది. ఏకచక్రపురిలోనుండిన నెలదినములకే వీరి కచటనేకాక చుట్టుప్రక్కల గ్రామములలోఁ గూడ భిక్షము దొరకుట దుర్లభమైనది*

వీరినెత్తిఁగిన "యంగారపర్ణుఁడ" ను గంధర్వుఁడు కూడ వీరు భారతీయాచారయుక్తులుగా లేరని ధిక్కరించియున్నాఁడు§ ద్యూతజితులై వనమున కేగినపుడు ధర్మజాదులు సమయబద్ధులగుటచే నటులు వనమునయుండిరే గాని, లేకుండిన నొక్క భీముఁడుగాని యర్జునుఁడుగాని కౌరవులను జయింపలేరా యని భారతపాఠకులు తలఁతురు. అట్టివారు లాక్షాగృహ దహనానంతరము భీతులై నిస్సహాయులై యనదలై పలాయితులగుట కేసందర్భముఁ గల్పింతురో?¶ భీష్మ

---

* ఆదిపర్వ॥ 157, 168 అధ్యా॥

§ ఆదిపర్వ॥ 170 అధ్యా॥

¶ పాండవులు బ్రాహ్మణుని వధించి యశ్వమేధప్రాయశ్చిత్తముఁ జేసికొనిరి. పరీక్షిత్తు "శమీకమహర్షి" నవమానించి మృతినొందెను. జనమేజయుఁడు బ్రాహ్మణులపై విక్రమించి చెడిపోయెనని, కౌటిల్యుఁడు తన యర్థశాస్త్రమునవ్రాసియున్నాఁడు. కాన పాండవులకే కాక తద్వంశజులకును బ్రాహ్మణజాతిపైఁ గోపముకలదేమో? జనమేజయు సర్పయాగ మేమయ్యెను?

ములకుఁ గూడ పాండవుల భారతీయాచార విరుద్ధకార్యములకుఁ దత్కాలమున ననహ్యముకలిగి పాండవప్రవాసమునకు, నాశనమునకుఁ గూడ నిష్టపడియుండిరాయని వారి తాటస్థ్యముచే నూహింపవలసియుండెను. పాండవులు కాక నిషాదవనితయు నామెయొక్క పుత్రపంచకమె లాక్షాగృహమున దహింపఁబడిరని పిమ్మటఁ దెలిసియుండును. కృష్ణునకుఁ బాండవులు లాక్షాగృహదాహమునుండి వెలువడిరని తెలిసినదట* ద్రుపదునకుఁగూడ తెలియుటచేతనె యర్జునునకు ద్రౌపదినిచ్చుటకు వెదకించెను♦ కాని పాండవులు ధార్తరాష్ట్రభీతులై ప్రచ్ఛన్నతమవేషులై రెండుమూఁడేండ్లాయా దేశములఁదో తిరిగి తిరిగి పాంచాలీస్వయంవరమున బయలుపడిరి. ద్రౌపదీపరిణయముచే ద్రుపదుని సహాయమె కాక కృష్ణాదుల తోడ్పాటు కూడ కలుగుటచేఁ గౌరవులకుఁ దమ వృత్తాంతముఁ దెలియఁజేయుటకు ధైర్యముకలవారైరి. పాండవులు ద్రౌపదీవివాహానంతర మొక వత్సరము ద్రుపదునింట నుండినపిమ్మటనే హస్తిపురికి వర్తమానమంపిరని యనుక్రమణికాధ్యాయమున నుండినయంశము నాలోచింపఁగా, నా సంవత్సరమంతయు ద్రుపద పాండవ శ్రీకృష్ణులు కౌరవులతోఁ బోరాడుటకుఁ దగిన యాలోచనముఁ జేయుచుండిరని తోఁచుచున్నది. ఈ త్రివర్గసమ్మేళనమునకు జడిసియే భీష్మ ధృతరాష్ట్రు లర్ధరాజ్యమును బాండవుల కిచ్చినటుల ననుక్రమణిచే నూహింపఁబడుచున్నది.

ఇంద్రప్రస్థరాజ్యము హస్తిపురిరాజ్యమువలె నిర్బాధకముకాదుగాని పాండవులు కాలూనుకొనుటకు సాధనమగుటచేఁ బాండవులంగీకరించిరని తోఁచుచున్నది. తీర్థయాత్రానెపమున నర్జునుఁడు దేశములఁదిరిగి ద్రవిడరాజగు "మలయధ్వజుని" తోడను కృష్ణునితోను

---

* ఆదిపర్వ॥ 189 అధ్యా॥

♦ ఆదిపర్వ॥ 185 అధ్యా॥

దృఢమైత్రిం గలిగించుకొనెను. విధవయు, నాగకన్యయు నగు "ఉలూపి" ని పెండ్లియాడి యా వితంతుపుత్రుడు 'ఇరావంతుఁడు" అను కుమారునిఁ గనెను. ఖాండవవన దహనములో నర్జునుఁడు నాగులఁ బెక్కండ్రఁ జంపుటచే నీ "యిరావంతుని" యాతని సంతతి పినతండ్రి నాగలోకమునుండి వెడలఁగొట్టగా వాఁడు త్రివిష్టపమునకుఁ బలాయితుఁడయ్యెను* ఖాండవవనదహనముచే నింద్రప్రస్థరాజ్యము విస్తృతిఁ జెందినది కాని యందుండిన నాగులతో విరోధము కలిగినది. అశ్వసేనుఁడను నాగముఖ్యుఁడు కర్ణుకడకుఁ జేరి యర్జునుని "గించిదూన ప్రాణావశిష్టునిగాఁ" జేసి కిరీటము బద్దలుచేయుటకుఁ గారకుఁడయ్యెను. ఈ ఖాండవవన దహనసమయముననే మయుఁడను "అనార్య శిల్పి" తోడ్పాటు పాండవులకుఁ గలిగెను. మయుఁడు పదునాల్గు మాసములు సభానిర్మాణముఁ జేసినటులును వికృతరూపులగు నసురులు" ఎనిమిదివేలమంది" సభానిర్మాణమునకుఁ దోడ్పడినటులును గలదు♦ మయుఁ డసురశిల్పి. ఆతని యనుయాయులు రాక్షసులు. రాక్షస శబ్దమసురపదపర్యాయశబ్దము. పారశీకుల దేవతల నసురులనుగా వేదమే చెప్పుచున్నది. అసురశబ్దప్రకృతియగు "అహుర" శబ్దము "జందవేస్తా" లో (జందవేస్తా పారశీకులవేదము) మన వేదములో "సుర" శబ్ద సదృశమై పూజ్యమైన పదముగా వాడఁబడును. మన శుభకర్మలలో అందు వాస్తుకర్మలో "వాస్తోష్పతి, విశ్వకర్మ" ఎటుల నాహ్వానము చేయఁబడునో పారశీకుల వాస్తుకర్మలో నటులు "మజ్దఆహురుఁడు" (మయాసురుఁడు) పూజింపఁబడును. ఆ మయాసురుఁడు నాతని యనుయాయులగు నెనిమిదివేలమంది యసురులు కూడ ధర్మజుని సభను నిర్మించుటయు నా సభలో రాజసూయముఁ

---

* భీష్మపర్వ॥ 91 అధ్యా॥



♦ సభాపర్వ॥ 3 అధ్యా॥

జేయుటయుఁ గూడ పాండవులు వైదేశికులని యనుమానించుట కొక కారణమై యున్నది. (1915) సంవత్సరమునఁ బ్రసిద్ధశోధకుఁడగు "డాక్టరు డి. బి. స్పూనరుగారు పాటలీపుత్రములోని భూగర్భశిల్పములను గురించి పాంచాలదేశ చారిత్రకసంఘముకడ నొక గొప్ప యుపన్యాసము నిచ్చియున్నారు. అందు మయసభావర్ణనవృత్తాంతము ప్రశంసింపఁబడినది. మయసభ పారశీకశిల్పమని వారు దృఢపరచి యున్నారు. "ఏడూక" శబ్దవిచారములో నిది కొంత చర్చింపఁ బడెను. కాలాంతరమున ధర్మజాదులు భారతీయులుగాఁ బరిగణింపఁ బడినట్టులనే వారి శిల్పాచారియగు మయుని "వాస్తుప్ర"- అతనివాస్తు శాస్త్రము భారతీయులచే గౌరవింపఁబడి యాదరింపఁబడుచున్నది. (మనువాస్తుప్రకారమె యాంధ్రులు మాసువాలయిండ్లుకట్టుచున్నారు) మయుఁడిచ్చిన "గదయు, శంఖము" భీమార్జునుల కాయుధశంఖము లైనవి* ఆర్యేతరవనితలగు, "హిడింబ, ఉలూచి, చిత్రాంగద" యనువారలు భీమార్జునులకు భార్యలైరి. ద్రౌపదీవృత్తాంత మిది వఱకె చెప్పఁబడెను. ఒకతె ననేకులు పెండ్లియాడు నాచారము మాలోఁ గలదని ధర్మజుఁడు ద్రౌపదీవివాహ సమయమునఁ జెప్పుట కూడ భారతీయేతరులు పాండవులను ననుమానమునకుఁ గారణమగు చున్నది. పాండవులు ద్యూతజితులై వనములకుఁ బోయినపిమ్మట పదమూడు మాసములకు ధర్మరాజును భీముఁడు కౌరవులపయిఁబడఁ బ్రోత్సహింపగా ధర్మజుఁడు హస్తినాపురవాసులేగాక, "భూరిశ్రవుఁడు, శలుఁడు, జలసంధుఁడు మొదలగురాజులు కౌరవులలోఁ జేరుదురు గాన మనకిపుడు సమయముకాదనెను♦ నన్నియకు దొరకిన మహా

---

* రామాయణాదులలోఁగల మయుని చరితము నేఁడమెరికాలోఁగల మయ శిల్పశోధనము గ్రంథవిస్తరభీతిచే వ్రాయుటలేదు.

♦ అరణ్యపర్వ 36 అధ్యా.

భారతములో శల్యుఁడని యుండుటచేఁ గాబోలు "మద్రపతి" కౌరవులతోఁ జేరుననినాఁడు. కొన్నివ్రాతప్రతులలో "భూరిశ్రవాశ్చ శల్యశ్చ" యనియున్నందున, నన్నియభాషాంతరీకరణము యుక్తమని యే తలఁపవలసి యున్నది. భూరిశ్రవుఁడే కాక యాతని తండ్రి తాత లగు సోమదత్త బాహ్లికులు, స్థూలదృష్టిలోఁ గురుపాండవులకు సమానజ్ఞాతులువారును గౌరవులలోఁ జేరిరి. మద్రపతి నకులసహదేవులకు మేనమామయే కాక సహదేవునకు "విజయ" యను కూతును* గూడఁ బెండ్లిచేసియున్నాఁడు. అట్టి మద్రపతి కౌరవులలోఁ యుద్ధకాలమున సుయోధను మాయచేతఁ గాక పాండవుల చర్యచేతనె—పాండవులు ద్యూతజితులగునప్పటికె—కౌరవులలోఁ జేరఁ దీర్మానించుకొనె నని స్పష్టమగుచున్నది. మఱియుఁ బాండవులు ఆర్యావర్త స్మృతిధర్మములకు విరుద్ధముగా మేనమామకూతురగు సుభద్ర నర్జునుఁడును, విజయను సహదేవుఁడును బెండ్లియాడిరి. శిశుపాలుఁడు పాండవులకుఁ బినతల్లి కుమారుఁడు. ఆతని కుమార్తె వావిచేఁ బాండవులకుఁ గూతురు కావలసి యున్నది. కాని శిశుపాలుని కుమార్తెయగు "రేణుమతిని" నకులుఁడు పెండ్లియాడెను‡ ఇంతమాత్రమె కాదు. పాండవులు ద్యూతజితులై కౌరవుల జయించుటకొఱకు యుద్ధసన్నాహములఁ జేయుట కర్జునుఁడై దేండ్లు "త్రివిష్టప" దేశము (టిబెతు) లోనె యుండి పరికరములను సంపాదించుటయె కాక తనవలె స్వదేశమునుండి తరుమఁబడినట్టియు చిన్నతనముననె తాను వదలినట్టియు "ఇలావంతుడ" ను కుమారునిఁ గూడుకొని యాతని దనకు రాబోవు యుద్ధములోఁ తోడ్పడఁగోరెను. అట్లె యాతఁడు మహాయుద్ధములో సైన్యసమేతుఁడై తోడువచ్చెను. ఇట్టి దేశీయ విరుద్ధాచార, విదేశ

---

* విజయ యన్యజాతిస్త్రీయందు శల్యునకు బుట్టియుండును.

‡ ఆదిపర్వ॥ 95 అధ్యా॥

సంపర్కములఁ జూచియె పాండవు లన్యదేశీయులని కొందఱున్నారు. పాండవులలో ధర్మజ భీమార్జునులు కుంతీసుతు లనియు నకులసహదేవులు మాద్రేయు లనియు వ్రాయఁబడి యుండెను. ధర్మజుఁడు, భీముఁడు, కుంతీసుతులు కారేమో యను సందియముకూడ కలదు. ఎంతటి దేవతలైనను మనుష్య వ్యవహారములలో మానుషధర్మము నవలంభింపవలసె యుండును. సూర్యుఁడు కుంతితోఁ దొలుత సంభోగించుటచే సూర్యసుతుఁడగు యమునకుఁ గుంతి మాతృసదృశ కావలసియుండును. అందువలననే కాఁబోలు భారతములోఁ బాండురాజునకు దివ్యమగు నొక కారణముచే "ధర్మన" కా శతశృంగపర్వతమున నీ యుధిష్ఠిరుఁడు జన్మించెననియు వాయుదేవుఁడు భీముఁడను కుమారు నొసఁగెననియు దేవేంద్రునివలనఁ గుంతియందే యర్జునుఁడు జన్మించెననియు మునులు హస్తిపురిలోఁ జెప్పిరి* పాండురాజునకు ధర్మజ భీములను యమ మరుత్తు లిచ్చిరట! అర్జునుఁడుమాత్రము కుంతియం దింద్రునివలనఁ బుట్టెనట!

పై యంశములేగాక భీముఁడు నాగులసంబంధుఁడని వ్రాయఁబడుటయు "శ్వేనజిత్తు" అనువాఁడు భీముని మేనమామయని కర్ణభీష్ము లొకప్పు డుగ్గడించుటయు§ ధర్మజ భీములు కూడ కుంతీగర్భజనితులు కారేమోయని సందేహింపఁబడుచున్నది. "పార్థ" శబ్దమొక యర్జునునియందే (పృథకుమారుఁడుగాన) రూఢిగా వాడఁబడుట కూడ భిన్నోదరత్వము కౌంతేయులయం దనుమానింపఁబడుచున్నది.

మఱియొక విశేషము. పాండురాజు శతశృంగపర్వతమునం "దపత్యా" ర్థియై కుంతిని సద్బ్రాహ్మణుని వలన సంతతి నొందమని

* ఆదిపర్వ॥ 123 అధ్యా॥



§ ఉద్యోగపర్వ॥ 140, 171 అధ్యా॥

నియోగించెను. తనకు మంత్రము వచ్చునని కుంతి చెప్పినపిమ్మటను, "ధర్మ, వాయ్వింద్రుల" గోరి సంతతి నొందను నెను. పురాణమునుల లో, అందు వేదప్రవర్తక మునులలో ధర్ముండనుముని, ఋగ్వేదదశమ మండలము 114 వ సూక్తమునకును, వాయుఋషి, ఋగ్వేదము 10 మండలము 168 సూక్తమునకునుగొన్ని సామములకుం బ్రవర్తకులు. ఇంద్రులను మును లిరువురు కలరు. వారు ఋగ్వేదదశమమండలమున 7 సూక్తముల కధిపులు. పై ఋషులే ధర్మజ, భీమా, ర్జునలకు జనకులు కాంగూడదా? పాండు మరణానంతరము హస్తిపురికిం బాండ పులను శతశృంగమునులు తీసికొనివచ్చి యొప్పంజెప్పుటచేతను పై వితర్కము కలుగుచున్నది. ఈయంశమునింకను బరిశోధింపవలెను.

## ధర్మరాజు

ఈతండు నాటి రాజకీయధురంధరు లగు విదుర గాంగేయ శ్రీకృష్ణులను రాజనీతిలో మించినవాఁడు. ఏసమయమున కేయాట నాడవలయునో యది ధర్మజునకుం దెలిసినటులు శ్రీకృష్ణునకుంగూడ దెలియదు. లక్కయింటినుండి వెడలుట, ప్రచ్ఛన్నులై పలాయితు లగుట, ద్రౌపది నందఱుం బెండ్లియగుట, ద్యూతానంతర మరణ్యా వాసమునం దొందరవడు ద్రౌపదీ భీములను సమయమువచ్చువరకు వేచియుండుడని శాంతులం జేయుట, అర్జునుని దివ్యాస్త్రసంపాదన మునకై తపశ్చర్య కనుపుట, అర్జునుఁడు లేనిసమయమునం దీర్ఘయా త్రా నెపమునం దక్కినవారితోం గౌరవులదాడి కందకుండఁగ నానా పర్వతవనాములం దిరుగుట, కీచకుపైం బడంబోవు భీము నపుడువలదని సంజ్ఞ చేయుట మొదలగు విషమసమయములలో ధర్మజుని రాజనీతి సుశోభితమై యున్నది. శల్యుని బాండవులం జేరకుండం గపటముం బన్నిన దుర్యోధనుని కపటమును ... శల్యునే కర్ణునివధకు

సహాయునిగాఁ జేసికొని తానే యీ శల్యుని రణనిహతుని జేయుట భీష్మాదుల మనసులు కరుగునటుల యుద్ధారంభమున వారికి వందన మాచరించుటయు యుయుత్సుని కౌరవులనుండి విడదీసి యుద్ధాంతమున నాతని కేలాభముఁ గలుఁగ జేయుచుండుట భీష్ముని పతనమున కాతఁడె కారకుఁడగునటులఁ జేయుట, మొదట నిష్టపడకుండినను సమయానుసారముగా ద్రోణవధ కసత్యమాడుట మొదలగు వ్యవహారములలో ధర్మజుని రాజకీయ ధురంధరత్వ "మప్రమేయమై" శోభించినది. సంధి సేయుట కైదు గ్రామములను మాత్రమె కోరినను దుర్యోధనుఁ డంగీకరింపలేదే యని స్థూలదృష్టికిఁ గాన్పించును గాని దానిలోనె స్వపక్షమునకువచ్చిన రాజుల కుత్సాహమును శత్రుపక్షమునకు నిరుత్సాహము కలుగు సంశయము లిమిడియున్నవని స్పష్టమగును. ఆ యైదూళ్ళేవి?* (౧) కుశస్థలము (౨) వృకస్థలము (౩) మాకంది (౪) వారణావతము (౫) ఏదేని మఱియొక గ్రామము.

కుశస్థలము—కర్ణుఁడు యాదవులనుండి పుచ్చుకొనినది. మాకంది, వారణావతములు పాంచాలురనుండి లాగికొని ద్రోణుఁడు కౌరవులు ననుభవించుచున్నవి. వృకస్థలమునకుఁ గూడ నిట్టి సంబంధమేదియేని కలిగియుండును. కర్ణ ద్రోణు లనుభవించు భాగములను దుర్యోధనునకిచ్చుట కెటులు సాధ్యమగును? ఒకవేళ బలాత్కరించి యిచ్చినచోఁ గర్ణ ద్రోణులకు మనమున నసూయ కలిగి దుర్యోధనుపక్షమునఁ బనిసేయరు. కుశస్థలి నడుగుటచే స్వపక్షీయులగు కృష్ణసాత్యకులకును, మాకందీ వారణావతము లడుగుటచే ధృష్టద్యుమ్నాది పాంచాలురకు నుత్సాహము కలుగుననియే యట్టి సంధిని కోరియు

---

* శ్లో॥ కుశస్థలం వృకస్థలం। మాకందం వారణావతం
అవసానం భవేదత్ర, కంచిదేకంచ పంచమం॥



ఉద్యోగపర్వ॥ 30 అధ్యా॥

న్నాఁడు గాని ధార్తరాష్ట్ర వినాశమే ధర్మజుని ముఖ్యోద్దేశమని యర్జును నస్త్రసంపాదనకై తపమున కంపుటకు ముందు భీమునితో నాడిన మాటల వలననే స్పష్టమగుచున్నది. పంచగ్రామసంధి. గత మైరోపామహాసంగ్రామములో "కైజరు" "జిబ్రాల్టరు"ను స్పెయి నువారికిని, ఈజిప్టును తుర్కీసుల్తానున కిచ్చినమెడల "ఆల్సేసు, లో రైను" లను ఫ్రాంసువారికి మే మిచ్చెదమనుటన టిదే యని స్ఫురిం చును. పంచగ్రామసంధిని వినిన సంజయుఁడు ధర్మజుని "మెత్తని పులి" తోఁ బోల్చియున్నాఁడు. విదురుఁ డెంతయేని సహాయముఁ జేసి యుండియు జ్ఞాతివధలో ధర్మజుని ఘోరకృత్యములకు రోసెనని యిది వఱకె వ్రాయఁబడియుండెను. పేరునకు ధర్మరాజె కాని యాతని చేతలుమాత్ర మధర్మయుక్తములని యొక తెనుఁగుకవి ప్రాచీనకాల మున నుడివెను.

ధర్మజుఁ డశ్వమేధయాగదీక్షితుఁ డైనపుడు, అర్జును నశ్వసం రక్షణమునకు నియోగించుచు సామవాక్యములతోడనె యశ్వముఁ బట్టవచ్చినవారిని సమాధానపరుపుమని రాజనీతి విశదమగునటులఁ జెప్పినాఁడు. మహాయుద్ధములోఁ జేరుకలవారు పెక్కండ్రు మడిసి ననుఁ యునకులగు ప్రాగ్జ్యోతిష, మగధ, పాండ్యదేశాధీశులును; పౌరుషవంతులగు త్రిగర్త, సింధు, గాంధారాది దేశస్థ సైనికులును శాండవాధిపత్యమును ధిక్కరింప నుద్యుక్తులుగానె యుండిరి. అందు వలన యజ్ఞధనము దెచ్చుటకు హిమవంతమున కేగినపుడును♦ వనా శ్రమవాసులగు ధృతరాష్ట్రాదులఁ జూచుట కేగినపుడును‡ హస్తిపురి నెవరేని ముట్టడింతురను భీతిచేఁ బట్టణమును గాఁపాడ"యుయుత్సా" దులను ధర్మజుఁడు నియోగింపవలసి వచ్చుచుండెడిది. సామవాక్య సమాధాన మాత్మలాభకరమెగాని కేవలదయారసముచేఁగాదేమో?

♦ అశ్వమేధపర్వ॥ 63 అధ్యా॥

‡ ఆశ్రమవాసపర్వ॥ 13 అధ్యా॥

ధర్మజు డెంతధర్మాత్ముఁడయినను కృష్ణబలరాము లెంతటియవతార పురుషులైనను ఆ కాల మెంతధర్మకాలమని పౌరాణికులు నుడివినను, దేశమున, ద్యూతము పానము స్త్రీలోలత మొదలగు దౌష్ట్యములే కాక, మ్లేచ్ఛులు కిరాతులు దేశోపద్రవముఁ జేయుచునే యుండిరని కృష్ణనిర్యాణానంతర మర్జునునకుఁ గలిగిన కిరాతకృత పరాభవముచే నూహింపవలసి యున్నది. శ్రీకృష్ణుఁడు కూడ మ్లేచ్ఛకృత పరచక్ర భయమును దలఁచుచునే మృతినొందియున్నాఁడు. ధర్మజు డెంతటి ధర్మాత్ముఁడుగాఁ దలఁపఁబడుచుండినను, పరలోకమునొందినపిమ్మటఁ గూడ దుర్యోధనుని శ్రేయస్సును సహింపనివాఁడై స్వర్గమున నాతఁడు సుఖుఁడై యుండెనే యని మనస్సునఁ గాక పైకని విలాపముం జేసి యున్నాఁడు* ధర్మజుని రాజ్యోత్తరకాల మంతయుఁ బశ్చాత్తాపము తోడను, వితంతు విలాపములతోడను, ద్రోణాదుల బ్రహ్మహత్యల కగు నశ్వమేధాది ప్రాయశ్చిత్తములతోడను ముగిసినది కాని సుఖకర ముగా నానందకరముగా ముగియలేదు. తాముచేసిన సర్వదోష ప్రాయశ్చిత్తముగాఁ బాండవులు ద్రౌపదీ సహితులై మహాప్రస్థాని కముఁజేసి మృతినొందిరి. పరలోకమున వారు నరకమునే ముందు చూచిరనుట యుక్తియుక్తముగానె యున్నది. ధర్మజునంతరమునఁ బరీక్షిత్తు కొంతకాలము ప్రజానురంజకముగా రాజ్యముఁజేసి పిమ్మట బ్రాహ్మణుల కవమానముఁజేసి నాగులచే మృతినొందినగాథ పిమ్మట వ్రాయఁబడును.

## భీముఁడు



ఆలంకారికు లితని "ధీరోద్ధతుఁ" డందురు. భీముని జన్మాది వృత్తాంత మిదివరకె సూచింపఁబడెను. భీముఁడు చిన్నతనపు టాట

* స్వర్గారోహణపర్వ॥ 1 అధ్యా॥

లలోఁ గౌరవులను బాధించుటచేతనె కురుపాండవులకు విరోధబీజ మేర్పడెను. సన్నిదయభట్ట్యాంగ్రీకరణములో హస్తిపురికిఁ జేరునాటికిఁ భీమునకుఁ బదునాలు వర్షము లూడెనవెను. పదునెనిమిది లేక, యిరువది వత్సరముల యీడుననే దుశ్శాసనాదులను బాధించువాఁడు. ఈ బాధలఁ బడలేకనె దుర్యోధనుఁ డీతని జాపుటకు నదిలోఁ ద్రోయుట విషము నిడుటయు నను మహాదపకారములఁ దలపెట్టెను. లోకులు సుయోధన కృతాపకారములను లెక్కింతురేగాని, భీమ కృతాపకారముల నేలనో లెక్కింపరు. అపకారబుద్ధిలేక బాల్యము చేతనె యూతఁడట్టి బాధలఁ గౌరవులకుఁ జేసియుండెనని మహాభారతమునఁ గలదు. కాని బాల్యమైన బాల్యమైన నపకారబుద్ధి యుండిన నుండకుండినఁ బెట్టినబాధలు బాధలేకదా? అపకారబుద్ధిలేక నొకఁడగ్నిఁ దరికొలిపిన నిండ్లు కాలకుండునా? భీముని చర్య లట్టివియే యైనవి. భీముఁ డెట్టిబాధలను గౌరవులకు గలిగించెనో సన్నిదయభట్టు స్వీకరించిన పద్యములనే రెండు వ్రాయఁబడును.

క॥ వదలక పెనఁగి పదుండ్రం
బదియేవుర నొక్కపెట్ట పట్టి ధాత్రిం
జెదరఁ బడవైచి పవనజుఁ
డదయుండయి వీఁపులొలియ నందఱ నీడ్చున్॥

సీ॥ కూడి జలక్రీడలాడుచుఁ గడఁగి యా
ధృతరాష్ట్రతనయుల నతులశక్తి
నెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్కభుజమున
నెక్కించుకొని వారి నుక్కడంగఁ
గొంచక నీరిలో ముంచుచు నెత్తుచుఁ గా
రించి ప్రాణంబు సేరఁబెట్టి

గోరిషఘోషయాత్రలందు నారలమెక్కిన ప్రూం
కుల మొదవుల పేరఁబట్టి
వసిఁగదల్చుబంప్లు దపఁబడినారల
తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ
నిట్టిపాటగాన్పుపట్టిచే దుశ్శాస
నాదులెల్ల బాధితాత్ములైరి॥ ఆదిపర్వ॥

కురుకులవృక్షమునకు నినుపసీలగా నుద్భవించిన భీముడు లక్కయింట్ల నంటించుటలోను నాఁటిరాత్రి యరణ్యమున సోదరులఁ గుంతిని దాఁటించుటలోను, అర్ధరాత్రమున హిడింబు బారినుండి తమ్ము రక్షించుకొనుటలోను జటాయు కీచకవధలలోను స్వరక్షణాతిశయముచేఁ బ్రకాశించెను.

కౌరవవధచేసగు సామ్రాజ్యప్రాప్తిని జరాసంధవధచేఁ బూర్వ సముద్రవ్యాప్తికిఁ బాండవసామ్రాజ్యమునొందించినవాఁడు భీముఁడేను. జరాసంధుఁ గపటముగా భీముఁడు కృష్ణప్రేరితుఁడై చంపెనని నిశ్శంకగా శిశుపాలుఁ డధిక్షేపించినపుడు తనఛిద్రము వెల్లడియగుచున్నదని శిశుపాలుపై భీముఁడలిఁగి తలపడఁదలచెను కాని శిశుపాలుఁడు భీముని మించిన బలవంతుఁడని యెఱిఁగిన భీష్ముఁడా యుద్యమమునుండి మఱలించెను. దుశ్శాసన, దుర్యోధనవధ లన్యాయముగాఁ జేయఁబడిన వని భీముఁడే గాంధారియెదుటఁ బొలికలనిలోఁ జెప్పియున్నాఁడు. మఱియుఁ గురుకులములోఁ బెద్దయు, భీష్ముని పినతండ్రియు, శతవృద్ధుఁ డగు "బాహ్లీకుని" జంపుటలోను, ఆతనికుమారుఁడగు "సోమదత్తుని" సాత్యకిచేఁ జంపించుటలోను, ధార్తరాష్ట్రులలో నొక్కనిగూడ మిగులకుండఁ దుదముట్టించుటలోను, శ్రాద్ధములఁ జేయుటకు ద్రవ్యమునిండని ధృతరాష్ట్రుఁడడుగఁగాఁ బరలోకమున ధార్తరాష్ట్రులు కష్టమును

లనుభవింతురుగాక. వారికి శ్రాద్ధములఁ జేయనక్కఱలేదని కఠినముగా జెప్పుటలోను* (దుర్యోధనాదుల శ్రాద్ధములకు భీమునాజ్ఞలేకపోవుటచే రాజకోశమునుండి ద్రవ్యము నీయ వీలులేక ధర్మజ ధనంజయులు స్వంతద్రవ్యమునిచ్చి ధృతరాష్ట్రుచే శ్రాద్ధములఁజేయించిరి) అన్యాయముగా దుర్యోధనుఁ బడఁగొట్టి యాతనితలను రెండుసారులు తన్నుటలోను (తల నన్యాయముగాఁ దన్నినపు డది గర్హ్యకమని ధర్మరాజు కూడ మిగుల గర్హించి విలపించియున్నాఁడు) భీముని క్రూరత్వము విఖ్యాతినొందినది. భీముఁడు స్వపక్ష పరపక్ష బలముల తారతమ్యము నెఱుఁగక సదా శత్రువులపై విజృంభింప నుంకించువాఁడు. ధర్మజుఁడు మచ్చిన యేనుఁగును నేర్పరి యగు మావంతివలె నాతని శాంతునిఁజేయువాఁడు. స్వ పర పక్షబలములఁ దెలియకపోవుటచేతనే భగదత్త, సైంధవ, కర్ణాశ్వత్థామాదుల కపుడపుడోడుట సంభవించినది. కృష్ణార్జునులు సూచింపనిమొదల జరాసంధ దుర్యోధనులను భీముఁడు వధింపలేకుండునని యా ప్రకరణములఁ జదివిన విశదమగును. భీష్ముని సేనాపత్యకాలమున రెండు, ఆఱు, పది దివసములలోను గురుని సేనాధిపత్యకాలమున నాలుగు అయిదు దివసములలోను కర్ణుని యాధిపత్యకాలమున రెండవ దివస యుద్ధమునను భీముని పరాక్రమము ప్రశంసనీయమై యున్నది. ద్రోణాధిపత్యకాలమున నైదవనాఁడు "ద్రుమా" దులను వధించుటలోనగు విక్రమ మత్యద్భుతము. దుశ్శాసనువధలో జేసిన దారుణమగు రక్తపానము కర్ణ దుర్యోధనాదులు తనపైఁ గవియుదురను భీతిచేతనే చేసితినని గాంధారికడ చెప్పుకొనియున్నాఁడు. భీమ దుర్యోధను లొక్కదినముననే జన్మించినందుల కిరువురును తెలియనిమూఢులేయని చెప్పవలసియున్నది. భీముఁడు తన పక్షపువాఁడగు కృష్ణుఁడు తన కుమారుఁడగు ఘటోత్కచుని వధింపఁ గర్ణుపై కంపుటయు "శ్రుత

* ఆశ్ర[illegible] పర్వ [illegible] అధ్యా[illegible]

సోముని" (ద్రౌపదికి భీమునివలన జన్మించినవాఁడు) అశ్వత్థామునిమీఁదికి వదలుటయుఁ దెలియక తన సంతతి లేకుండఁగఁ జేసికొనియున్నాఁడు. ఒక్క కృష్ణుఁడే కాదు అర్జునుఁడును ఘటోత్కచవధను దెలిసియు భీమునకుఁ జెప్పక కృత్రిమముఁ జేసెను. కర్ణవధ దినసమున సమర భారమంతయు భీముఁడే వహించి యర్జునుని ధర్మజుసేను మరయునెప మున శిబిరమున కంపి విశేష విశ్రాంతిని గలిగించెను. కిమ్మీరాసుర వధయు, హనుమత్సమాగమము, అజగరరూపనహుషకృతపరిపీడనము, యక్షరాక్షసవధ, మొదలగు గొన్ని యంశములు కల్పితములుగాఁ గాన్పించును. మహాయుద్ధములోఁ బ్రముఖవీరు లీతనిచేతనె పొలిసిరి. తన శత్రువుఁజంపి పగఁ దీర్చుకొనుటలో నీతఁ డద్వితీయుఁడే కాని దుర్యోధనవధానంతర మాతని కొనరించిన యవమాన మత్యంతగర్హ్య ముగా నున్నది. క్రూరత్వముకంటెఁ గాక దేహబలమున భీముఁడు నిర్వీర్యు లగు ప్రస్తుతపుఁ భారతీయుల కాదర్శపురుషుఁడుగా నుండఁదగినవాఁడు.

## అర్జునుఁడు



నరుఁడను మునియంశమున జన్మించెనను నీ మహాపురుషుడే యింద్రు నంశమునఁబుట్టెనని యసందర్భముగాఁ జెప్పఁబడుచుండును. మార్కం డేయపురాణము జలదేవతాంశమున నర్జునుఁడు జన్మించెనని చెప్పు చున్నది. ఏదేవతాంశమైన నీతఁడు "పార్థుఁడు" (పృథయను మాఱు పేరుగల కుంతికుమారుఁడు) శాకటాయనుని కాలకాలమున కీతఁడు క్షత్రియవీరుఁడుగాఁ బరిగణింపఁబడి పాణినికాలమున కంతకంటె హెచ్చుగు మతప్రవర్తకుఁడుగా లెక్కింపఁబడి పతంజలికాలమునకుఁ గృష్ణునితో సమమగు పూజ్యస్థానమునుండి తొలగింపఁబడి నేఁటికాల మున భారతీయు [illegible] నున్నాఁడు. కును

పాండవవీరులలో నీతఁ డద్వితీయుఁడై యుండుట కీతనికిఁ గృష్ణసారథ్యమె తోడ్పడినది. విద్యాభ్యాసకాలమునుండియు నీతఁ డతి జాగ్రత్తగ మెలగుటచేతనె ప్రసిద్ధినొందఁగలిగెను. ఈతని విజయములు ద్రుపద విజయముతోఁ బ్రారంభమై యశ్వమేధాశ్వ సంరక్షణముతో నంతమై విజయాభిధాన మీతనికి సార్థకపరచినవి. ధర్మజుని రాజనీతియందును కృష్ణు నాలోచనా నైపుణ్యమునందు నీతనికి నమ్మక మెక్కుడగు టచే వారి యాజ్ఞల నెపుడును దాఁటువాఁడుకాఁడు. ధర్మజు నానతి చేతనె తీర్థయాత్రకుఁబోయి పాండ్య యాదవ వనితలఁ బెండ్లియాడి స్వవర్గమైత్రిని వృద్ధిఁజేసికొనియు, తపంబునకుఁబోయి రుద్రేంద్రా దులవలన దివ్యాస్త్రలాభమునొంది పరాక్రమాతిశయముఁ గలిగించు కొనియు విజయుఁ డయ్యెను. కృష్ణునానతిచే ఖాండవవనమును దహించి రాజ్యాభివృద్ధితో మయసభాలాభముఁ గూడ పొందెను. మహాయుద్ధములో గృష్ణు నానతిచేతనె భీష్మ భగదత్త సైంధవ కర్ణు లను రణనీతివిరుద్ధముగాఁ బడఁగొట్టెను. అర్జున కృతములగు ఘోష యాత్రాసందర్భపు గంధర్వవిజయము, ఉత్తర గోగ్రహణము కల్పిత ములని కొందఱు తలఁతురు. నివాతకవచ కాలకేయ జయములు కూడఁ గల్పితములనియే కేచిన్మతము, పైఁజెప్పఁబడిన విజయము లలో నివాతకవచ కాలకేయ విజయములఁ గొంత సందేహముకలదు. నివాతకవచులు రాముఁడు పుట్టకపూర్వమె రావణునితోఁ ద్రేతాయు గమునఁ బోరాడినవారు. వారు కొన్నియుగములకుఁ బిమ్మటకూడ నుండురాయనునది గొప్పసందేహము. కాలకేయులు వింధ్యపర్వత విజృంభణమునకుఁ బూర్వమె యగస్త్యుఁడు సముద్రోదకముఁబానము చేసినపుడు దేవతలతోఁ బోరాడినవీరులు. రావణుని సోదరియగు శూర్పణఖ కాలకేయాసురాధిపతియగు "విద్యుజ్జిహ్వుని" భార్యయై యున్నది. విద్యుజ్జిహ్వుని రావణుఁడె చంపెనని రామాయణమునఁ

గలను. నాఁటి కాలకేయులు భారతకాలమునందుండిరా? తక్కిన యుద్ధము లెట్టులుండినను, భీష్ముని యంత్యదివసయుద్ధమునను, సైంధవ వధనాఁడును, విజయుఁడు సూపిన పరాక్రమ మవర్ణ్యము. సైంధవ వధదివసమున ద్రోణు నతిక్రమించి శకటవ్యూహముఁ బ్రవేశించుట కును, శ్రుతాయుధునిగదతాఁకుడు సోఁకకుండుటకును, సైంధవుని మోసపుచ్చుటకై* మాయాతిమిరముఁ గల్పించుటకును శ్రీకృష్ణ సాహాయ్యమె యర్జునునకు విశేషముగాఁ గల్గెను. భీష్ముని తృతీయ నవమదివసయుద్ధములలో నర్జునుఁడు భీష్మున కోడెననియె చెప్పవలసి యున్నది. కర్ణుని భార్గవాస్త్రపీడితస్వసైన్యముఁ జూచి “మాధవా మనరథంబింకమరలనిమ్ము బ్రతికియుండిన సుఖములు వడయవచ్చు” నను సమయమె విజయుని విజయదశలో నీచతను సూచించు నవ స్థమై యున్నది. కర్ణుని వధింపనేగుసమయమునఁ గృష్ణుఁడెంత ధైర్య వాక్యములఁ జెప్పుచుండినను భీతిచే నర్జునుఁడు ప్రస్వేదగాత్రుఁడయ్యె ననునదియే యాతని జీవితములోని భీతావస్థ. యుద్ధరంగమునఁ గర్ణుని జూచినంతనె యర్జునుఁడు భీతిచే బెగ్గినని సుయోధనుఁడు చెప్పె నట!‡ ఈ వాక్యము సత్యమే యని యాతని ప్రస్వేదగాత్రావస్థ సూచించును. కృష్ణసహాయము లేకుండఁగ నర్జునుఁడు కొన్నివిజయ ముల నందినను, అవి కురుక్షేత్రవిజయ సదృశములు కావు. రాజసూ యాశ్వమేధ యాగకాలములలోని విజయము లతిశయోక్తులతో నిండియున్నవి. జైమినిభారతమున నశ్వమేధయాగకాలమున నయ్యో

---

* ఒకవిధమగు ధూమమును వ్యాపింపఁజేసి శత్రువులను మోహపెట్టుట చాణక్యునికాలమునను గలదని యాతని యర్థశాస్త్రము చెప్పుచున్నది. జర్మనుల యుద్ధనావలలోఁ గొన్ని ధూమవ్యాపకముచే నింగ్లీషువారి యుద్ధనావల దృష్టి చెదరునట్లుఁ జేసినవి. ఇట్టి ధూమవ్యాపనముచేతనె కృష్ణుఁడు మాయాతిమిరముఁ గల్పించి సూర్యమండలము నాచ్ఛాదించియుండును.

‡ కర్ణపర్వ 69 అధ్యా

నను. చెప్పు యుద్ధములు బూటకములు. జైమిని భారత గాథలు దాక్షిణాత్యకవి కల్పితములని కొందఱు తలంతురు. కృష్ణనిర్యాణానంతరము కృష్ణు భార్యలఁ గిరాతులచేఁ గోల్పోవుటయే యీతని జీవితములోని నికృష్టసమయము. కృష్ణాభిమాన మీతనియందుండుటచేతనె సర్వకురుపాండవసంతతి నశించినను, ఈతనిసంతతి భరతఖండస్థ చంద్రవంశాంకురముగా నిలిచియుండుటకుఁ గారణమయ్యెను. ఇపుడు భరతఖండస్థ క్షత్రియులలోఁ గొందఱు "ధనంజయస" గోత్రికులుకలరు. వారు తెలియక తా మర్జునసంతతివారమనుకొందురు. కాని యది పొరపాటు. గోత్రర్షి యగు ధనంజయుఁడు విశ్వామిత్రగణములోనివాఁడు. ఈధనంజయునకు నాధనంజయునకుఁ సంబంధములేదు. అర్జునునకుఁగల ప్రఖ్యాతు లన్నిటిలో నాతనికిఁ గృష్ణుఁ డుపదేశించెనను విఖ్యాతిగల భగవద్గీతలె మిన్నయైనవి. గీతలన్నిటి నాసమయమునఁ గృష్ణుఁ డర్జునున కుపదేశించిన నుపదేశింపకుండినను గీతాలతాబీజమునకు క్షేత్రమై యర్జునుఁ డుండుటయె విఖ్యాతి హేతువు.

## నకుల సహదేవులు

పాండవులలో వీరుకలిసియుండుటచేతనె వీరికిఁ బ్రసిద్ధికలిగినది కాని వీరుచేసిన ఘనకార్యములంతగాఁ గాన్పింపవు. నకులుఁ డశ్వశిక్షానిపుణుఁడని విరాటపర్వమునఁగలదుకాని, శకునితో నశ్వసైన్యయుద్ధముసల్పినవాఁడు సహదేవుఁడేను. నకులుఁడందగాఁడట! ఆతఁడందగాఁడై యితరుల నధిక్షేపించువాఁడు* కర్ణసుతులఁ జంపెనెగాని పేరుగలవారి నెవరిని జంపినటులులేదు. సహదేవుఁడు నకులునికంటెను శూరుఁడుగఁ గాన్పించును. ప్రఖ్యాతిగన్నవీరుఁడగు శకుని యాతనికుమారు

* మహాప్రస్థానికపర్వ॥ 2 అధ్యా॥

డులూపుడు సహదేవునిచే జచ్చిరి. సహదేవుడు జ్ఞానియట! అందువలన నితడు లను దృణీకరించువాడు * రాజసూయయజ్ఞమున మేనుకృష్ణుని బూజింతును, దీనికంగీకరింపక యెవరు చెప్పువారితలపై నేనుకాలుంతునని సభలో రాజుల దృణీకరించుటయె రాజుల మనస్సునందసూయకంకురమైనది. కుంతి వరముగోరకుండిన గన్నచే నకులసహదేవులు మృతినొంది యుందురు.

ఇంతవరకు మహాభారతచరిత్రములోని ముఖ్యాంశములు వర్ణింపబడినవి. పాండవులే న్యాయస్థులనియు దుర్యోధనాదు లన్యాయమునకొడంబడి పాండవులు గడగండ్లపాలుచేసిరనియు స్థూలదృష్టిం దలపంబడునంశములన్నియు నిజముగావని విమర్శనములలో జూపం బడినవి. ఇకను సుయోధను పక్షముకూడ క్లుప్తముగావిమర్శింపబడి యీచరితము ముగింపబడును—

# దుర్యోధనుడు



ఈతడు గాంధారీగర్భజనితుడు. భీముడు నీతడు నొక్కదివసమునందే జన్మించిరి. సమానబలవంతులు. భిన్నభిన్న కాలములలో నీయిరువురును బలరామునికడ గదాయుద్ధనైపుణ్యమునందిరి. కృపద్రోణులకడ జిన్నతనమున విద్యాభ్యాసముజేసిరి. దేహబలమున భీముడెక్కుడు. గదానైపుణ్యమున దుర్యోధనుడుమిన్న. భీముడే తొలుత నాటలనెపమున సుయోధనాదులబాధించి వారికీర్ష్యనుజనింపజేసెనని యిదివఱకె వ్రాయబడెను. నీరిలోద్రోయుట విషమునిడుట యనునవి భీముడుపెట్టుబాధలకు సహింపకజేసినచేతలు. వారణావతమునకు బాండవులను సాగనంపుటలో బౌరులకుగూడ నసూయ కలుగుట చేతను, స్వరాజ్యప్రతిష్ఠాపనకొఱకునై సుయోధనునిగృత్రిమము వ్యక్త

* మహాప్రస్థానికపర్వ॥ 2 అధ్యా॥

మగుచు. లాక్షాగృహదహనప్రయత్నముమాత్రమె దుర్యోధనునిది కాని కర్మమాత్రము భీమునిదైయున్నది. పాండవులు లాక్షాగృహమునుండి యడవులపాలైనపుడె కళింగదేశాధిపునిసుతార్తై శుభాంగి” గర్ణునిసహాయముచే స్వయంవరమునఁ బెండ్లియాడెను. ద్రౌపదీ స్వయంవరానంతరము యాదవ పాంచాలురతోఁ బాండవులు కలియుటచే రాజనీతి ననుసరించి పాండవుల కింద్రప్రస్థరాజ్యమునిచ్చెను. ధర్మజునిరాజసూయపువిభవముఁ జూచి లోనక్షత్రియసామాన్యపుటీసు జనించినది. అది మయసభలోఁ గాలుజారి పడినపుడు ద్రౌపదీభీములు పరిహసించుటచే వృద్ధిగమై ద్యూతకార్యమున కంకురమైనది. ద్యూతసమయమునందు సమస్తరాజులకుఁ బాండవులపై నీసు కలిగియుండుటచేతను, పాండవ మిత్రులగు యదు వృష్ణి భోజాంధకులు సాల్వునితోడి పోరాటమునఁ దగుల్కొనుటచేతను దుర్యోధనునకు ద్యూతజితులై పాండవులు వనములపాలైరి.

ద్యూతమున కాహ్వానింపఁబడిన ధర్మజుఁడు ప్రౌఢముతోనె సభలోనుండినవారిలో నెవఁడు నాతో ద్యూతమునకుఁ గడఁగెద రని నపుడు సుయోధనుఁడు నాకై శకుని యాడునని తన యప్రౌఢిమను సత్యముగాఁ జెప్పియున్నాఁడు. అందాతనిలోపముగాన్పింపదు. శకుని యొడ్డిన పణముల నన్నిటిఁ గెలిచెను. ఇందు ధర్మజుని యప్రౌఢిమయే గాని దుర్యోధనుని యన్యాయము కాన్పింపదు. దీనిని విరటునిసభలో బలరాముఁడుకూడ స్పష్టపరచియున్నాఁడు. ద్రౌపదిని సభలోనికిఁ దెచ్చుట తన్ను మయసభలో హేళనముఁ జేసినదానికిఁ బ్రతిగాఁ జేసిన యవమానమైయున్నది. ద్రౌపది ప్రాతిగామిని బరాయించి పెంకి ప్రశ్నలువేయుటచేఁ దాత్కాలికక్రోధముచే దుశ్శాసనుఁడు ద్రౌపదీకేశగ్రహణముఁ జేసియుండెను. ద్రౌపదినిమాత్రమె సభలోనికిఁ దెచ్చుట కాదె [illegible] త్తవ్యాపారమై యున్నది. ఆమె

దుర్యోధనాదుల కపఖ్యాతిఁ దెచ్చుటకే రజస్వలావేషమును వేసిన దనియు, వస్త్రవిసర్జనముఁ జేయుట కల్లయనియు నిదివఱకె స్పష్ట పఱుపఁబడెను.

పాండవులకుఁగల యితరభార్యలను సభలోనికిఁదెచ్చుట కాని వారల నవమానించుట గాని సుయోధనుఁడు చేయక ద్రౌపదిని మాత్రమె పరాభవింపఁజేయుట పాంచాలియొక్క యయుక్తప్రవర్తనముచేతనె యై యున్నది. ధర్మజున కప్పటికి ధనము త్తర యుండుటచే నాకు విస్తారము ధనముకలదు. దీనికిఁ బ్రతిపణముగా నెవరేమి పెట్టుదు రని నుడివియున్నాఁడు* కాలకర్మవశమున శకుని జయించుటచే ధర్మజాదులు వనవాసగతులైరిగాని ధర్మజుఁడే జయించిన సుయోధనుని వనవాసగతునిగా ధర్మజుఁడు చేయఁడా? ధర్మజ భీమ నకుల సహదేవు లాయాసమునొందఁగా యుద్ధములోఁ గర్ణుఁడు చంపక విడిచెను. ధర్మజుని ద్రోణుఁడు, ధృష్టద్యుమ్నుని గృపుఁడు యుద్ధమునం దోడి నపుడు వదలిరి. పాండవులు అందు విఖ్యాతశూరుఁడగు నర్జునుఁడే తనకుఁదొరకిన భీష్మ సైంధవ కర్ణుల నన్యాయముగాఁ బడఁగొట్టెను. నీటిలో నొప్పిచే నాయాసముఁ దీర్చుకొనుచుంటినని బ్రతిమాలుకొని నను ధర్మమూర్తియగు ధర్మజుఁడే సుయోధనునింబరిమార్ప హ్రదము నుండి వెడలించి చంపించియున్నాఁడు. తమ కపకారముచేయునో చేయకపోవునో నిరూపింపకుండగఁ బురోచనుని, తమకూడిగముఁ జేయు నిషాదవనితను సపుత్రికనుగాను, లక్కయింటను దహించిరి. తమకుఁ గర్ణువధలో నుపకృతిఁజేసిన శల్యుని సపుత్రునిగాఁ జంపిరి. ఇట్టి పాండవులే ద్యూతములో జయమునందినయెడల దుర్యోధనుని గడగండ్ల పాలుచేయరో? మొదటిజూదమునఁ బరాభవమొందినను రెండవసారి ధర్మజుఁడు ద్యూతమునకు సిద్ధపడుట సుయోధనుని

---



* సభాపర్వ॥ 59 అధ్యా॥

జయింతునను దురాశచేతనైమై యున్నది. మొదటిజూదములో నోడి రెండవసారి తిరిగి జూదమునకు సిద్ధపడుచున్నం జూచి భీమార్జునాదులు గాని ద్రౌపదిగాని యేల ధర్మజుని వారింపలేదు? ఈసారి ధర్మజుఁడే జయించును. దుర్యోధనుని వనమునకుఁ బంౘెండేఁడులు పంపుదుమను దురాశచేతనె నివారింపరైరి. ప్రారంభమునుండి దుర్యోధనుని బలవంతముగా ధర్మజుఁడు తీసికొనివచ్చినట్లు దుర్యోధనుఁడు ధర్మజుని ద్యూతసభారంగమునకు బలవంతముగా దీసికొనిరాలేదు.

మొదటిజూదమునఁ బరాభూతులగు పాండవుల నంతకు ముందుండిన మయసభాపరాభవాదికమును దలఁచికొని సుయోధనుఁ డవమానపఱచెనుగాని రెండవసారి ద్యూతజితులైనపుడే యవమానముఁ జేయలేదు. కాని పాండవులే "పఱుగెత్తలేక బలాదూరు" అను సామెతనొప్పున రెండవసారి కూడ ద్యూతమునఁ జయింపలేక కురుకులము నున్మూలింపు ప్రతిజ్ఞలు చేసిరి. వీరి ప్రతినలు "ఆయివిసరిన గుండ్లం బావుజేసెడి" నేఁటి క్యాచిత్క-రాజనీతికి సరిపడియున్నది. పాండవులు వనమునకుఁ బోయినవెంటనె యాదవపాంచాలురు వారిం జేరి యోచించి కౌరవులను నశింపఁజేయు నాలోచనలఁ జేయఁగ సుయోధనుఁడు రహస్యముగఁ బాండవులపై దండెత్తి వారి నున్మూలింపఁదలపెట్టెను గాని కౌరవులచేతలపైఁ గన్నుగలిగి మెలఁగుఁ గృష్ణద్వైపాయనునిచే నా రహస్యము వెల్లడికాఁగా నపుడా ప్రయత్నమునుండి దుర్యోధనుఁడు విరమించెను. ఘోషయాత్రాగాథ మృషయని యిదివఱకె చెప్పఁబడెను. నిజమని తలఁచినను కర్ణునంతటి యోధుఁడు రాజునువదలి పలాయితుఁడగునా? మఱియు సుయోధనుని పాతాళలోకమున కసురులు తీసికొనిపోవుట మొదలగు నసందర్భపు గాథ లందు కూర్పఁబడుటయె యది మృషాగాథగా దలఁప మనసుగొల్పును. [illegible] అర్జునుడు దివ్యాస్త్ర

ముల నొందుటకై దేవతలు త్రివిష్టపమున కేగినపుడా వైదేశ్యులను సుయోధనభీతులై తీర్థయాత్రానెపమున నానా పర్వతారణ్యములలో నదీనదపరిసరముల భ్రమించిరి. విరాటుని ప్రోలుననుండినపుడు సుయోధనుఁడు తెలివిలేమిచేతనే పాండవులఁ గనుగొనలేకపోయెను. చివరకుఁ దెలిసియు గార్యకారి కాలేదు. గోగ్రహణపుగాథను గొందఱు మృషయనియే గాథాసందర్భములచే నూహించిరి. దక్షిణగోగ్రహణపు గాథలోఁ గొంత సత్యముండును. అందు సుశర్మయోడుటకూడ సంభవించియుండునుగాని, యర్జునుఁడొక్కఁడె భీష్మాదుల జయించెననుట పొసగియుండదు. మఱియు నర్జునుఁడు గోవులను మఱలించియుండినను దానిలోఁగూడఁ గొంత నిజముండును. వ్యూహరచనలో మూఁడు తెగలుగాఁ గౌరవులు సైన్యమును నడపించుచుండిరి. అందు ముక్కడి మూఁకలోనె గోవులుండెను. వానినొకవేళ మళ్లించిన మళ్లించియుండునుగాని భీష్మాదులను జయించుట కల్లయని పక్షాంతరమున నుత్తర గోగ్రహణము నంగీకరించువారిమతమున తలఁపఁబడుచున్నది. ద్రుపద పురోహితునివలన సంధివాక్యముల నందియ్యకముందె పాండవులు సైన్యములఁ గూర్చుకొనిరి. దానిఁదెలిసియె సుయోధనుఁడు సైన్యములఁ గూర్చుకొనెనుగాని తొలుత యుద్ధమునకు సిద్ధపడలేదు. తొలుత సమరసన్నాహముఁజేయక సామమె పాండవులు నడపినచో సమయబద్ధులు పాండవులని దుర్యోధనుఁ డేలరాజ్యమీయఁడు? పాండవులె తొలుత యుద్ధసన్నద్ధులై మాపైఁ గాలుద్రవ్వుచుండిరేకాని మేము వారిపైఁ గాలుద్రవ్వుటలేదని కృష్ణుతో రాయభారసమయమున దుర్యోధనుఁడనిన యీ క్రిందివాక్యములు సుయోధనానపరాధత్వముఁ జెప్పును.

క॥ వనితం బఱిచి రరణ్యంబున నిడుములఁబడితిమనుచుఁ బోటరులై చం
పనుఁ జెఱుపఁ [illegible] కమకదుర॥

మ॥ అరయం దప్పొకయింత నావలన లేదా ధర్మపుత్రుండు జూ
దరినెంటం దమకించి సౌబలునిచేతన్భూమి గోల్పోయి ము
ష్కరుండై వెండియునోడ్డఁగా నతఁడు నష్కప్రౌఢిమైగెల్వ నే
తెరువైనం దనయిచ్చతో మెలఁగె నింతేకాక యేఁబూటయే॥
గీ॥ మాత్స్య పాంచాల పాండ్యాది మనుజపతుల
గూర్చికొని తార కయ్యంబుగోరి యెత్తి
విడిసి రింతియకాక యివ్విధము నుగ్ర
కర్మమున కేముదొడరుట గలదె చెపుమ॥

ద్రుపదపురోహితుఁడుగాని శ్రీకృష్ణుఁడుగాని తమ సంధివాక్యముల నించుకంతయు సామారంభముగాఁ గాక దుర్యోధనాదుల యపకృతులను ముందర నుద్ఘాటించుచునే ప్రారంభించి దుర్యోధనాదుల కోపము నుద్రేకింపఁజేసిరి. అందు కొన్ని యప్రస్తుత ప్రశంసలుకూడ కలవు. ద్రౌపదీపరిణయానంతరము ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధరాజ్యము నిచ్చుటతో ముగిసిన దుర్యోధనాపరాధముల నేల కృష్ణుఁడు సంధిసమయమునఁ ద్రవ్వికొనవలసెను? మఱియుఁ గృష్ణుఁడు కౌరవులతో సంధిసేయక విగ్రహమునే జరుపఁ దలపెట్టి సంధివాక్యములఁ బూర్తిచేయక పాండవులకడకరిగి యుద్ధప్రస్థానముఁ జేయించినటులు సుయోధనుని యీవాక్యములచేఁ దెలియనగును.

* "సంధిని జేసికొనక శ్రీకృష్ణుఁ "డుపప్లావ్యము" నకు వెడలిసపిమ్మట దుర్యోధనమహారాజు కర్ణ శకుని దుశ్శాసనులతో నిట్లనెను.

---

* శ్లో॥ ప్రలియాతేతు దాశార్హే రాజాదుర్యోధన స్తథా
కర్ణం దుశ్శాసనంచైవ శకునిం చాబ్రవీదిదం
అకృతేనైవకార్యేణగతః పార్థా నధోక్షజః
సఏనా న్మన్యునావిష్టో ధ్రువం ధక్ష్యత్య సంశయం
ఇష్టోహి వాసుదేవస్య పాండవైర్మమ విగ్రహః
భీమసేనార్జునౌ చైవ దాశార్హస్య మతేస్థితౌ

సంధిచేసికొనకయే శ్రీకృష్ణుఁడు పాండవులకడకుఁ బోయినాఁడు. అతఁడు క్రోధాత్ముఁడై వీరిని నిశ్చయముగా యుద్ధమునకుఁ బ్రేరేపించును. వాసుదేవునకుఁ బాండవులతో నేను పోరాడుట యిష్టము. భీమార్జునులు కృష్ణు నిష్టముచొప్పునఁ బ్రవర్తింతురు. ధర్మజుఁడత్యంతము భీమార్జునుల వశమునసే సంచరించును. ఇంతమాత్రమె కాక రెండవజూదమున నాచే సోదరులతోఁగూడ యోడియున్నాఁడు. (లేక నాచే వంచితుఁడై యున్నాఁడు) విరాట్ద్రుపదులు నాతో విరోధపడియున్నారు. వారిపుడు సేనానాయకులుగా మాత్రమె కాక వాసుదేవుని వశమునఁగూడ కలరు. కాన భవిష్యత్తునందు మహాయుద్ధము దొమ్మిగాఁ గాఁబోవుచున్నది. కాన సంగ్రామకార్యమునంతను జాగ్రత్తగఁ జేయింపుఁడు" అనియున్నాఁడు.

యుద్ధకాలమునఁగూడ దుర్యోధనుఁ డెవరిని న్యాయవిరుద్ధముగాఁ జంపలేదు. చంపింపను లేదు. అభిమన్యుని విరథునిఁ జేయుటలోఁగూడ దుర్యోధనప్రేరణము లేదు. "స్వపక్ష పరపక్ష నిర్ధామధాముఁడ" గు ద్రోణుఁడే యాపని జేయించెను. సౌప్తికవధకును దుర్యోధనప్రేరణము లేదు. అశ్వత్థామ సౌప్తికవధను జేసెనన్నమాట మరణవేదనలోఁ గొంత సంతసముఁ జూపినఁ జూపుట లోకవిరుద్ధము కాదు. భీష్మ ద్రోణ కర్ణ శల్యులు దుర్యోధనుపక్షమున నుండియే యుద్ధములో నాతని కపకృతిఁ జేసిరి. అందుఁ దాను ముఖ్యముగా

---

అజాతశత్రు రత్యర్థం భీమార్జున వశానుగః
నికృతశ్చ మయాపూర్వం సహసర్వై స్సహోదరైః॥
విరాట్ద్రుపదౌచైవ కృతవైరౌ మయాసహ
తౌచ సేనాప్రణేతారౌ వాసుదేవవశానుగౌ
భవితా విగ్రహస్సోఽయం తుములో రోమహర్షణః
తస్మాత్సాంగ్రామికం సర్వం కారయధ్వ మతంద్రితాః
ఉద్యో॥ పర్వ॥ 152 అధ్యా॥

నమ్మినబంటుగు కర్ణుఁడే జామదగ్న్య, బ్రాహ్మణశాపతప్తుఁడై ఇంద్ర శల్య కుంతీదేవులచే వంచితుఁడై తనకపుడపుడు యుద్ధములోఁ దొరకిన యుధిష్ఠిరాదులఁ జంపక సుయోధనునిగూడ వంచనచేసెను. దుర్యోధనుని వధించుటలో గర్హ్యముగాఁ బాండవు లన్యాయముగా మెలఁగిరని పాండవపక్షపువారికే--అందు ధర్మజునకే తోఁచి భీమునినిందించి మిగులవిచారించి దుర్యోధనునితో నాయనా నీవుధర్మముగానే యుద్ధము చేసితివి. నీవుస్వర్గము నొందగలవు. మేము నరకసమమగు దుఃఖము నొందఁగలమని యెంతయేని విచారించియున్నాఁడు. బలరాముఁడు కూడ భీముని యన్యాయమునకుఁ గినిసి భీముఁగొట్టి సిద్ధపడియు కృష్ణుఁడు కౌఁగలించుకొని బ్రతిమాలఁగా వెడలిపోవుచు ధర్మార్థములు పాండవులచేఁ గామమునకుఁ గ్రిందు జేయఁబడినవనినాఁడు. * ఊరుభంగానంతరము కృష్ణదుర్యోధనసంవాదములలో దుర్యోధనునిదే న్యాయమని పుష్పవృష్టి దేవదుందుభిసస్వానము దేవతలు కలిగింపఁగాఁ గృష్ణాదులు సిగ్గుపడిరట! ♦ ఆతఁడు పుట్టినపుడు నక్కలఱచెనట! అట్టి యశుభమునుసూచించిన దేవత లిపుడేల పుష్పవృష్టిని వర్షించిరో? కాని కృష్ణుఁడే సిగ్గునువిడిచి యన్యాయములనన్నిఁటినిఁ జేయించిన "పాపాలభైరవుఁడను" నేన యనుట మాత్రమఁట సమయస్ఫూర్తిగ నున్నది. దుర్యోధనుఁడు రావణునివంటి దుర్మార్గుఁడుకాడని పాండవపక్షమునువహించినవారుకూడ తలఁతురు. "భాస" మహాకవి దుర్యోధనుని యోగ్యతను "పంచరాత్ర, ఊరుభంగ" నాటకములలో మిగుల వర్ణించియున్నాఁడు. భాసుని నాఁడు లోకులు నేఁటిసామాన్యులవలె దుర్యోధనుం గ్రూరునిగాఁ దలంపలేదు. భాసుడే కాదు "భారవి" కూడ దుర్యోధనుఁడు

---

* శల్యపర్వ॥ 60, 61 అధ్యా॥



♦ శల్యపర్వ॥ 62 అధ్యా॥

మొదటఁజిహ్మ్మండేయైనను ధర్మజునిమించం ధర్మముగా మెలఁగువాఁడని తన "కిరాతార్జునీయ" కావ్యమున వర్ణించియున్నాఁడు. వేదశాస్త్రములఁజదివి యజ్ఞాములఁజేసి దేవతలఁ దృప్తినొందించి ప్రజలను సుఖపరచి ధర్మముగా యుద్ధముఁజేసి మృతినొందుటచేతనే యాతని పక్షము నెంత నికృష్టముగా వర్ణించినను, మహాభారతకవి యాతనికి స్వర్గమె లభించినట్లు వర్ణింపకఁ దప్పినదికాదు. జయమును రచించిన వ్యాసుఁడు పాండవహితుఁడగుటచేతను, భారతమునురచించిన వైశంపాయనుఁడు, అర్జున ప్రపౌత్రుఁడగు జనమేజయునకిష్టముగా భారతగాథను జెప్పవలసివచ్చుటచేతను, సౌతి కృష్ణద్వైపాయనుని శిష్యపుత్రుఁడగుటచేతను సంస్కృతమహాభారతము సుయోధనాపకర్షముగా రచింపఁబడెనని తిరిగి చెప్పవలసియున్నది. గాని యచటనచట సుయోధనుని యోగ్యతలు సూచింపకతప్పినదికాదు. ఆంధ్రీకృతభారతములో నన్నయ కేవలము పాండవవంశ సంభూతుఁడ నని చెప్పుకొను రాజనరేంద్రునకుఁ గృతినిచ్చుటచేతను, తిక్కన, యెఱ్ఱనలు సూర్యచంద్రవంశస్థులగు రాజుల నాశ్రయించువారె యగుటచేతను, ఆంధ్రభారతములోఁగూడ దుర్యోధన యశోపకర్షణమె వర్ణింపఁబడెను. కవిచేతనె మహారాజులయొక్క కీర్త్యపకీర్తులు వెల్లడియగునుగదా? శివాజి "కొండయెలుక" యనియు, క్లైవు దేశోద్ధారకుఁడనియు మన యింగ్లీషుకవులు చరిత్రలలో వర్ణింపఁ గొంతకాలము నిజమే యని మనము తలఁచుకాలము కలిగెను. దుర్యోధనాన్యాయము, పాండవన్యాయముకూడ తాదృశమేయని తలఁపవలసియున్నది. దుర్యోధనునిపైఁగల యీర్ష్యను మహాపతివ్రతయగు గాంధారిపైఁగూడ వ్యాసాదులు కొంతదొరలించి యామె తన తోడికోడలగుఁ గుంతి బిడ్డలఁగనుచున్నదని తాను కడుపుబాదుకొని మాంసఖండముఁ గనినదని ప్రకృతి విరుద్ధపుగాథ [illegible] మహాపతివ్రతయై భర్తకులేని

కన్నులు తనకేలయని గంతలుకట్టుకొని సయునానందసుఖ మహ యౌవనజీవనము వదలిన మహాపతివ్రత—మరణసంశయమగు యుద్ధమున కేగుచుం దన్ను దీవింపుమనివచ్చిన కుమారుని "యతో ధర్మ స్తతో జయః" యని ధర్మైకాగ్రచిత్తమై దీవించిన ధర్మవనితామతల్లిక—శత్రుపక్షపువారిచేగూడ భయభక్తులతో సేవింపఁబడు పవిత్రచరిత్ర--అట్టిది—నోడికోడల సంతతిఁజూచి కడుపుబాధుకొనునో? ఈమె కుమారులలో, నల్వురే యౌరసులుగాఁ గాన్పింతురనునంశ మింతకుఁ బూర్వమె చెప్పఁబడెను. ఔరసు లుండినను, స్వయందత్తాదులను పుత్రులుగా నంగీకరింపఁ బూర్వపుస్మృతు లంగీకరించుచున్నవి. రాజ రాజనరేంద్రునినాఁడుకూడ "కులోత్తుంగచోళుఁడుం" డగా "రాజేంద్ర చోడునిఁ" దత్తునిగా రాజనరేంద్రుఁడు చేసికొనినటులఁ జనశ్రుతి కలదు. ఈస్వయందత్తాదు లన్యబాలిజులుగాఁగూడ నుండవచ్చును. ఇట్టినారే గాంధారి యొక్క 93 గురు పుత్రులును. గాంధారీపుత్రుల కపార్థములనిచ్చు దుర్మ్మఖాదినామములను వ్యాసాదులు కల్పించియుం దురని తలఁతురు. నామకరణములఁ జేయునపుడు "గృహ్యసూత్ర కారులు" శుభచిహ్నముగా నుంపమనిరే కాని యశుభచిహ్నముగా నుంపమనలేదు. పెంటయ్య, తుక్కమ్మ మొదలగు నవీననామములును, శునశ్శేఫ, పసుమేఢ్ర, కాసర, జంబుకాది ప్రాచీననామములును కారణాంతరముచేఁ బెట్టఁబడియుండును. వ్యాసాదులు దుర్యోధనుపక్షముఁ గ్రించుపరచుటకని వ్రాసిన ప్రక్రమమునుం గమనించి "కుండాశ్యా" ది నామములు వ్యాసకృతములగునని చెప్పవలసియున్నది.

## పరిశిష్టము

1. న్యాయ మన్యాయముగాను, అన్యాయము న్యాయము గాను వ్రా[illegible]ముచే భాగ

వతనుచు రచించియుండుటయేగాక మనసెంకను బాధించుటచేఁ గాఁబోలును సుయోధనునకు స్వర్గసౌఖ్యప్రాప్తిని, పాండవులకుఁ గొంత కాలము నరకప్రాప్తిగూడ పిమ్మటఁ జెప్పియున్నాఁడు.

2. ప్రఖ్యాత మహాకవియగు “వేమన” కూడ పాండవుల యందు గౌరవముఁజూపుట నెట్టిదని యిట్లు నుడివియున్నాఁడు.

ఉ॥ తాతజనించెఁ గన్యకకు తండ్రియుఁ దాము గుండగోళకుల్
మాత పరానుకూల మతి మత్స్యవ ద్రౌపదిభర్త లేవురా
నీతులుసెప్పఁ బాండవుల నేమను లిట్టివియుంచు నెన్నుచున్
భూతలమందు వారలకుఁ బూజలఁజేతురు నెట్టివేమనా!

3. మహాభారతయుద్ధమునఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యము పోరియుండునా? అట్లుండినఁ దగినచోటు కురుక్షేత్రమున నుండెనా? యను ప్రశ్న కలదు. పదునెనిమిది యక్షౌహిణులసైన్య మున్నదనియు, నేఁటి “యులహాబదు” మొదలించుకొని రాజపుత్రస్థానపు పెడార్వడికు యుద్ధరంగమనియు నందు వారణావతము, అహిచ్ఛత్రము, పంచనదము, కురుజాంగలము, రోహితకారణ్యము, కాలకూటము, గంగాకూలములలోఁ గౌరవులసైన్యము పన్నఁబడి యించుమించుగ నైదువందలమైళ్లు యుద్ధరంగమై యుండెననియుఁ దెలియనగును * ఆయుద్ధరంగములలో భీష్మద్రోణాదులకుఁ బాండవులలోనివారగు శిఖండి ధృష్టద్యుమ్నాదు లెదురుగ నొడ్డనములఁ దీర్చుచుండిరి. సైంధవవధనాఁ డన్నిసైన్యములు నొక్కటిగాఁ దూర్పువలసివచ్చినపుడే వైపుఁజూచినఁ గౌరవసైన్యము పదిరెండుయోజనముల స్థలము నాక్రమించినదై యున్నదని వర్ణింపఁబడుటచే బదునెనిమిది యక్షౌహిణులు పోరాడినవనుటలో విరుద్ధములేదు. సైంధవుని జాపినప్రదేశము నిషాదప్రదేశమని ధృష్టద్యుమ్నుఁడు చెప్పుట



* ఉద్యోగపర్వ॥ 18 అధ్యా॥

గమనింపఁదగినది* ఇన్నినందల నైఋత్యప్రదేశములో నిషాదులుండు ప్రదేశముకూడ యుండిన నుండును.

ఆయా దేశకాల పరిస్థితులలో వార్తాహరణాది వ్యవహారము లను ద్వారగా నడిపించు సౌకర్యము లుండుటచే నవి యపుడట్లు జరుగ లేదని తలంప వీలులేదు. సాంకేతిక శంఖచిహ్నాదులచే వ్యవహార ములఁ ద్వారగా నడుపుచుండినటుల నాయాస్థలములలోని వర్ణనములఁ బట్టి యూహింపఁబడుచున్నది.

4. శ్రీకృష్ణప్రోత్సాహమునఁ బాండవులు భారతసామ్రాజ్య మున కేకచ్ఛత్రాధిపత్యమును స్థాపింపఁ దివిరిరిగాని యది నిల్వలేదు. పరీక్షిత్తునాఁడె నాగులు విజృంభించి పరీక్షిత్తుఁ జంపిరి. జనమే జయుఁడుమాత్రము తక్షశిలపై దండెత్తి యా రాజ్యముఁ జయించి క్రీ॥ త॥ రెండవశతాబ్దములోని "కనిష్క" చక్రవర్తివలె హిందూ కుశపర్వతములు మొదలు మగధదేశమువఱకుఁ జక్రవర్తియై పరిపా లించినటులఁ గాన్పించును. ఆతఁడు బ్రాహ్మణులను విరోధించి పద భ్రష్టుఁడయ్యె నని యర్థశాస్త్రమునఁ జాణక్యుఁడు వ్రాసినసంగతి యేపురాణములలోనైనఁ గలదేమో? జనమేజయునకుఁబిమ్మట మూడు తరములకుఁ జన్మించిన "నిచక్నుఁడ"ను రాజు కాలమున హస్తిపురి గంగానదీ ప్రవాహముచేఁ బూర్ణముగాఁ గొట్టుకొని పోవుటచేతను, యాదవు లింద్రప్రస్థము నాక్రమించి యుండుటచేతను, నిచక్నుఁడు పాంచాలరాజ్యములోని "కౌశాంబి"నిఁ జేరి సాధారణపురాజయ్యెను. ఆతని కాలముననె హస్తిపురిరాజ్యము పేరులేకుండనశించినది. పాండ వుల యనంతరము పరీక్షిత్తు ప్రజారంజకముగాఁ బాలించినటులు అథ ర్వవేదములోని యీక్రిందిమంత్రము చెప్పుచున్నది.

---

* ద్రోణపర్వ. 188 అధ్యా

తా॥ కురుదేశములో నింటినిగట్టుకొనుచు సంసారి యిటులు * భార్యతోఁ జెప్పుచున్నాఁడు. కౌరవ్యుఁడగు పరీక్షిత్తు మాకు శాసనముఁ జేసి క్షేమమును జేయుచున్నాఁడు.

కుంతాపసూక్తములోని విశేషములను గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేను—

నాఁటి దేశపటము తద్వర్ణనము నాఁటి వీరుల పుట్టుక జూపి యీ చరితము ముగింపఁబడును.



---

* పరీక్షిన్నః క్షేమమకరత్తమ శాసనమాచరన్
కులాయం కృణ్వ న్కౌరవ్యః। పతిర్వదతి జాయయా
అథర్వసంహితా॥ కాండ॥ 20 వర్గ॥ 128.

# మహాభారత కాలపు రాజ్యములు

మహాభారతచరిత్ర జరుగుకాలమున భరతఖండస్థరాజ్యముల పట మిందు చూపఁబడియున్నది. ఆపటమందుఁ జూపఁబడిన హద్దులు సరియైనవియే యని చెప్పలేము. ఇంచుమించటుల నుండునని మహాభారతమును జదువగాఁ దోఁచినది. వాని నించుమించుగ వర్ణింపు చున్నాను. భరతఖండ మన నేఁటి బ్రిటీషిండియామాత్రమే కాదు. హిమాలయోత్తరభాగమునఁ గల నేఁటి తిబేతులోనివగు "ఉత్తర కురు, కాంభోజ, ఉలూక" దేశములును, తూర్పున, చైనా, ఆసాం దేశములలోని "ప్రాగ్జ్యోతిష" మును, మధ్యాసియా, ఆఫ్గనిస్థాన ములలోని "ఉశీనర, మద్ర, బాహ్లిక" దేశములును భరతఖండస్థ రాజ్యములుగా నాఁడు పరిగణింపఁబడినవి. కురుదేశము, వేదకాలము నందును మహాభారతకాలమునందును నేఁడును మహాప్రసిద్ధినే పొంది యున్నది. కురుదేశమును "మనువు, కాళిదాసు" కూడ బ్రహ్మావర్త మని వర్ణించిరి * భరతఖండమును నెవరు పరిపాలింపవలయునని మహాభారతయుద్ధము తరువాతఁగూడ మూఁడు కురుక్షేత్రయుద్ధము లైనవి. ♦ "పానిపత్తు, ఢిల్లీ, స్థానేశ్వరము" లను నేఁటి ప్రసిద్ధస్థలము లీకురు క్షేత్రములోనివేను. నాఁటి కురుదేశమున కుత్తరమున హిమాలయ మును, తూర్పునఁ బాంచాలదేశములోని "అహిచ్ఛత్రము, మాకంది,

---

* మనుస్మృతి (2—17) మేఘసందేశము (1—49)

♦ (1) "పృథ్వీరాజు, మహంమదఘోరీల" యుద్ధము. (2) "బేబరు, ఇబ్రహీంలోడీల" యుద్ధము. (3) "మహారాష్ట్రులు, అహమదుఅబ్దాలీల" యుద్ధము ముఖ్యకురుక్షేత్రయుద్ధములేను.

"కాంపిల్య" యనుభాగములును* దక్షిణమున మత్స్యదేశము. నాఁడు "మరుస్థల" మని పిలువఁబడు రాజపుత్రస్థానపు టెడారియును. పశ్చిమమున నేఁటి "కాంధహారు, పశ్చిమోత్తర పరగణాలలోను, పంజాబులలోను" గలిసిన గాంధారదేశమునుగలవు. గాంధారదేశమునకుఁ బశ్చిమోత్తరభాగములలో "బాహ్లిక, మద్ర, కాశ్మీరదేశములును, నైఋతిదిక్కున, కేకయ, సింధుసౌవీర" దేశములును, నేఁటి "రాజపుత్రస్థాన గుజరాతి" దేశములలో మరుస్థలమును నెడారియు, "మత్స్య త్రిగర్త, దశార్ణ" దేశములు "శూరసేన, అవంతి, సౌరాష్ట్ర" దేశములును, నేఁటి "మాల్వా, మధ్యరాష్ట్ర" భాగములలో "నిషధ, హైహాయ, విదర్భ, చేది, దక్షిణకోసల" దేశములును పాంచాలనకుఁ దూర్పునఁ "గాశీ, కోసల" దేశములును, "బేహారు బంగాళా" రాష్ట్రములలో "విదేహ, మగధ, అంగ వంగ, పుండ్ర" దేశములును "ఆసాం, చీనా, బర్మా" భాగములలో ప్రాగ్జ్యోతిషరాజ్యములును గలవు. "ఉత్క, లాంధ్ర, మహారాష్ట్ర" దేశములలోఁ "కళింగాంధ్ర, మణిపుర, శోణ, మల్ల" దేశముల భాగములును "ద్రవిడ, కర్ణాటక, మళయాళ, మహారాష్ట్ర" భాగములలోఁ "చోళ పాండ్య, కేరళ, కొంకణ, సాళ్వ" దేశములును గలవు. మహాభారత యుద్ధకాలమునందలి దేశములు రాజధానులు, రాజులుయొక్క పట్టిక నీ క్రింద ముఖ్యమైనవానిఁ జూపుచున్నాను.

---

* ద్రుపదుని పరిపాలనలోఁగల గంగ కుత్తరముననుండిన "అహిచ్ఛత్రము, మాకంది" యను పాంచాలరాజ్యభాగములను ద్రోణుఁడు కురుకుమారులతోను బాండవులతోను ద్రుపదునిపై దాడివెడలి లాగుకొనియున్నాఁడు. ఆ ప్రదేశములోనిదియే "వారణావతము" ఆ లాగుకొనిన భాగములు కురురాజ్యములోఁ జేరినవి. దానికి భీష్ముఁ డంగీకరించుటచేతనే ద్రుపదునకు భీష్మ ద్రోణులపై మహావిరోధము కలిగినది.

ఆదిపర్వము 138 అధ్యాయము.

| సంఖ్య | దేశము | రాజధాని | రాజు | విశేషములు |
|---|---|---|---|---|
| 1 | కురుదేశము | హస్తిపురి | ధృతరాష్ట్రుఁడు | మహాభారతగాథ ఈకురురాజ్య సంబంధపుదేను. |
| 2 | పాంచాల దేశము | కాంపిల్య నగరము | ద్రుపదుఁడు | ద్రుపదుని కొమరుఁడు ధృష్టద్యుమ్నుఁడు పాండవసైన్యసర్వాధికారి. |
| 3 | గాంధార దేశము | తక్షశిల | శకుని | దుర్యోధనుని మేనమామ. "సర్వనాశాయమాతులః" అనుసామెత యీతనివలననె కలిగినది. |
| 4 | మద్ర దేశము | శాకల్య పురము | శల్యుఁడు | నకుల సహదేవుల మేనమామ యైనను దుర్యోధనుపక్షమవలంబించి, కర్ణుఁడు చచ్చుటకుఁ గారకుఁడైనాఁడు. "శల్యసారథ్యము"ను సామెత యీతనిచేతనె కలిగినది. |
| 5 | బాహ్లిక దేశము | | బాహ్లికుఁడు | భీష్ముని పినతండ్రి. శతవృద్ధయినను సోమదత్తుఁడను కొమరుని తోను, భూరిశ్రవసను మనుమని తోను మహాయుద్ధమునఁ గౌరవుల పక్షమునఁ బోరి పాండవులచేఁ జచ్చెను. |
| 6 | కేకయ దేశము | | జయత్సేనాదులైదుగురు | ధర్మజుని పినతల్లి కుమారులు. కుంతి చెల్లెండ్రబిడ్డలందరిలో వీరే పాండవపక్షులు. |
| 7 | సింధు దేశము | | జయద్రథుఁడు (సైంధవుఁడు | దుర్యోధనునిబావ. "శ్యాలకో గృహనాశాయ" యను సామెత యీతనివలననె కలిగినది. |

| సంఖ్య | దేశము | రాజధాని | రాజు | విశేషములు |
|---|---|---|---|---|
| 8 | సౌవీర దేశము | | 12 గురు సోదరులు | ఈదేశము సైంధవునకు లోఁబడినది. ఆదేశప్రభువులు 12 గురు ద్రౌపది నరణ్యమున సైంధవు డెత్తుకొనిపోయినపుడు యుద్ధమున నర్జునుఁడు వీరినందరఁ జంపెను. |
| 9 | కుంతిభోజ దేశము | | శ్యేనజిత్తు | కుంతియొక్క తమ్ముఁడు. ఈతఁడు నాగుల సంబంధుఁడఁట! |
| 10 | శూరసేన దేశము | ద్వారక | ఉగ్రసేనుఁడు | శ్రీకృష్ణుని మాతామహుఁడు. ఉగ్రసేనాదులు కురు, పాండవ యుద్ధమునఁ దటస్థులై యున్నారు. |
| 11 | అవంతి దేశము | ఉజ్జయిని | విందానువిందులు | పాండవులకుఁ బినతల్లి కుమారులైనను దుర్యోధను పక్షమునకు వచ్చిరి. |
| 12 | త్రిగర్త దేశము | | సుశర్మ | సంశప్తకసేనతోఁ గడవరకు నర్జునునిఁ బ్రతిఘటించి పోరిన మహావీరుఁడు. గోగ్రహణమున విరటునిఁ బట్టుకొనగాఁ బాండవులు విడిపించిరి. భీముఁడపుడీతనిఁబట్టుకొనెను. |
| 13 | మత్స్య దేశము | ఉపప్లావ్యము | విరటుఁడు | విరాటపర్వమున నీతనిగాథ ప్రసిద్ధమైయున్నది. |
| 14 | దశార్ణ దేశము | | హిరణ్యావర్మ | భగదత్తునితోఁ బోరి చచ్చెను. పాండవపక్షపాని. |
| 15 | హైహయ దేశము | మాహిష్మతి | నీలుఁడు | సహదేవునితో రాజసూయ కాలమునుండియు విరోధించుటచే గౌరవపక్షమునకు వచ్చెను. |

| సంఖ్య | దేశము | రాజధాని | రాజు | విశేషములు |
|---|---|---|---|---|
| 16 | కాశీ దేశము | కాశి | | కాశిరాజు యుద్ధాత్పూర్వమె కృష్ణునితోఁబోరి చచ్చుటచే సైన్యము మాత్రము పాండవ పక్షమునకు వచ్చెను. పౌండ్రకవాసదేవునిగాథతోఁ గాశిరాజుగాథ యిమిడియున్నదని విష్ణు, భాగవత, పురాణములఁ జదివినవారికి దెలియును. |
| 17 | ఉత్తర కోసల దేశం | అయోధ్య | బృహద్బలుఁడు | పద్మవ్యూహములో నభిమన్యుచేఁ జచ్చెను. |
| 18 | మగధ దేశము | రాజగృహము | సహదేవుఁడు | జరాసంధునిపుత్రుఁడు. ఈతఁడు పాండవపక్షమునఁబోరి ద్రోణునిచేఁ జచ్చెను. కాని యీతని కొడుకు "మార్జారి" పాండవుల కెదిరిగ్గొ్డ్డి యర్జునున కోడెనని యశ్వమేధ పర్వమునఁ గలదు. |
| 19 | చేదిదేశము | శుక్తిపురి | ధృష్టకేతుఁడు | శిశుపాలునికుమారుఁడు పాండవ పక్షమునకువచ్చెను. |
| 20 | ప్రాగ్జోతిష దేశము | ప్రాగ్జోతిష పురము | భగదత్తుఁడు | నరకాసురునికుమారుఁడు. కౌరవపక్షమునకు వచ్చి యర్జునునిచేఁ జచ్చెను. మహావీరుఁడు. |
| 21 | అంగ దేశము | చంపా నగరము | కర్ణుఁడు | పాండవులు మొదట నరణ్యముల పాలైనపుడు "రాజపుర" మునఁ జరిగిన స్వయంవరములో దుర్యోధనుపక్షమునఁ గర్ణుఁడు జరాసంధునితోఁబోరి యాతనినోడించి బహు |

| సంఖ్య | దేశము | రాజధాని | రాజు | విశేషములు |
|---|---|---|---|---|
| | | | | మతిగ "మాలినీ" నగరమును<br>నంగరాజ్యముఁ గొనెను. మాలినీ<br>నగరమె "చంపానగరము" కుమార<br>విద్యాప్రదర్శక సమయమునఁ గర్ణ<br>కర్జునునితోఁ బోరుటకుఁ గర్ణుఁ<br>డు రాజు కాడను నాక్షేపణ<br>ముఁ గృపాచార్యుఁడు చేయఁగా<br>దుర్యోధనుఁడు కర్ణున కంగరాజ్య<br>మిచ్చెనని యాదిపర్వమునఁ గలదు.<br>కాని యది యసత్యముగా గాన్పిం<br>చుచున్నది. దుర్యోధనున కపు<br>డట్టి యధికారము రాజ్యమున<br>లేదు. ధర్మజునకు యువరాజ్యపట్టా<br>భిషేకము చేయుటచేఁ దన కట్టి<br>యధికారము లేదని దుర్యోధనుఁ<br>డు విలపించినాఁడు. అట్టి దుర్యో<br>ధనునకు నంగరాజ్యమిచ్చుట కధి<br>కార మెట్లుకలిగినది? కాన జరా<br>సంధునిచేఁ గర్ణుఁడు బహుమతిగ<br>నొందినదే యంగరాజ్య మగును.<br>ద్రోణుఁడు, కర్ణుఁడు, బాహ్లీకుఁడు<br>కురురాజ్యమునకు లోఁబడి "అహి<br>చ్ఛత్ర, అంగ బాహ్లీక" రాజ్యముల<br>నేలుచుండిన సామంత రాజులు.<br>అందువలననే దుర్యోధనునకు రా<br>రాజని పేరుకలిగెను. |

| సంఖ్య | దేశము | రాజధాని | రాజు | విశేషములు |
|---|---|---|---|---|
| 22 | పాండ్య దేశము | మణిపురము | మలయధ్వజుఁడు | ఈతఁడు పాండవపక్షమునఁబోరి యశ్వత్థామచేయుద్ధమునజచ్చెను |
| 23 | కళింగ దేశము | రాజపురము | చిత్రాంగదుఁడు (యుద్ధసమయమున శ్రుతాయువు) | ఈతఁడు దుర్యోధనుని మామ. వృద్ధుఁడగుటచే యుద్ధమునకు రాలేదు. కళింగసైన్యములు మాత్రము వచ్చి ఘోరముగఁ గౌరవుల పక్షమునఁ బోరెను. భీముఁడు శ్రుతాయువుం జంపెను. |
| 24 | సాళ్వ దేశము | సౌంభకపురి | సాళ్వుఁడు | అంబవిషయమై భీష్మునకీతనికిఁ బోరాటము కలిగినది. కౌరవపక్షమునకే యీతఁడు వచ్చి, సాత్యకి ధృష్టద్యుమ్నులచేఁ జచ్చెను. (అంబకొఱకు భీష్మునితోఁ బోరిన సాళ్వుఁ డీతఁడు కాడని కొందరు తలఁతురు) |
| 25 | ఉలూక దేశము | | క్షేమధన్వి | కౌరవపక్షమున వచ్చి భీమునిచేఁ జచ్చెను. |
| 26 | కాంభోజ దేశము | | సుదక్షిణుఁడు | సైంధవ వధ నా డర్జునునిచే జచ్చెను. |
| 27 | అంబష్ఠ దేశము | | శ్రుతాయువు | డిటో |
| 28 | విదర్భ దేశము | కుండిన నగరము | రుక్మి | శ్రీకృష్ణునిబావ, రుక్మిణియన్న. బలరామునకు నీతనికి వైరము కలదు. బలరాముఁ డేపక్షమునకుఁ జేరనందున నీతఁడు నేపక్షమునకు [illegible] యుండెను. |

# వనౌషధిశబ్దార్థనిఘంటువు

అనేక సంస్కృతగ్రంథములను పరిశీలించి మూలికలయొక్క సంస్కృత నామములకు ఇంపు వాడుకలోనున్న తెలుగుపేరులు వ్రాయబడినవి. 35000 శబ్దములకు అర్థములుగలవు. అపూర్వగ్రంథము. ఇది ఉన్నచో వైద్యకశబ్దసింధు సర్వశబ్దసంబోధిని మున్నగు గ్రంథము లక్కరలేదు. కాలికో బైండు. వెల రు **3—4—0**

# భస్మప్రదీపిక

ఇందు సమస్తఖనిజములు శుద్ధిచేసి చక్కని భస్మములుచేయు విధానములు వ్రాయబడినవి. గొప్ప యూనానీగ్రంథమునకు తెలుగు. తు1కి 500రూ॥ కిమ్మతుగలభస్మములుకూడగలవు. వెల రు **2--0--0**

# మిథునానురాగము.

చక్కని చరిత్రవిషయికనవల. ఇందు దంపతుల ప్రేమానురాగములు చక్కగవర్ణింపబడినవి. ఎల్లరునుచదవదగినది. వెల రు0--12--0

# నరసింహకారికావృత్తి

ఆపస్తంబ గృహ్యసూత్రములకు శ్లోకరూపమైన వ్యాఖ్యానము. ప్రతిశ్లోకమునకు సులభమగు తెలుగుతాత్పర్యము వ్రాయబడినది. ఈగ్రంథముచేతనున్న స్మార్తకెందు నడ్డుండదు. వెల రు 1—1[illegible]—0

**బొప్పనభట్టీయము:**—స్మార్తగ్రంథము. 1—[illegible]

# వారకాంత

ఇదియొకనాటకము. వేశ్యల ఆలోచనములు, మాయలు, [illegible] తమాషాలు చక్కగ ప్రదర్శింపబడినవి. చెన్నపురి బీచి వ[illegible] బడినవి. వెల రు 0—12

**వాసంతిక:**—(చెంచులక్ష్మి) కథ నాటకముగ వ్రాయబ[illegible] శృంగారము, హాస్యము మున్నగు రసములు, ఇంక ననేకవి[illegible] ముల వర్ణనలు కలవు. వెల రు 0—10

**రెడ్డి ప్రభవము, రామాయణము, గోదావరిజి[illegible]**

